# సాహిత్యసుధ







డా॥ ఎస్. గంగప్ప

# సాహిత్యసుధ

(వ్యాస సంపుటి)



డాక్టరు ఎస్. గంగప్ప, ఎం. ఏ., పిహెచ్. డి.

# సాహిత్యసుధ

(వ్యాససంపుటి)

రచయిత :

డా॥ ఎస్. గంగప్ప, ఎం. ఏ., పిహెచ్. డి.

ఆంధ్రోపన్యాసకులు, నాగార్జున విశ్వవిద్యాలయం,

నాగార్జున నగర్-522510, గుంటూరు జిల్లా



ప్రథమ ముద్రణ : డిసెంబర్ 1981

ప్రతులు : 1000

వెల : రూ. 15/-

ముఖపత్ర చిత్రణ : శ్రీ పి. నాగుల్ (మంగళగిరి)

ప్రతులకు :

శశీ ప్రచురణలు

C-73, శ్రీనివాసనగర్, గుంటూరు-52006.

నవోదయా పబ్లిషర్స్,

ఏలూరురోడ్, విజయవాడ-2,

అరండల్‌పేట, గుంటూరు-2.

ముద్రణ : వైష్ణవి ప్రింటర్స్, గుంటూరు-1

---

**Paper was made available by the Govt. of India at concesional rates**

# విషయసూచిక

# అభినందన

ఆచార్య జి. ఎన్. రెడ్డి, ఎం. ఏ., ఎమ్. లిట్., పిహెచ్. డి.
కళాశాలాధ్యక్షులు,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి.

తెలుగు సాహిత్య విమర్శకులు వ్రాసే గ్రంథాలు స్థూలంగా రెండు రకాలు. మొదటి రకం : ఒక కవిని గురించి, లేదా కొన్ని కృతుల్ని గురించి, లేదా ఒకానొక సాహిత్య ప్రక్రియను గురించి యథాశక్తితో లోతుగా పరిశీలించి సమగ్రంగా వ్రాయాలనే సత్సంకల్పంతో వ్రాసి ప్రచురించే విమర్శ గ్రంథాలు. రెండవ రకం : విమర్శకులు యథాలాపంగా అప్పుడప్పుడూ వ్రాసి, పత్రికల్లో వ్యాసాలుగా వెలువరించి తర్వాత తర్వాత పుస్తక రూపంగా ప్రకటించే విమర్శ గ్రంథాలు. ఈ రెండో రకం విమర్శ గ్రంథాలు సాధారణంగా విషయ వైవిధ్యమున్న వ్యాసముక్తకాల సంపుటులు. డాక్టర్ గంగప్పగారి ఈ సాహిత్యసుధ రెండో రకానికి చెందిన విమర్శ గ్రంథం. ఇందులోని వ్యాసాలు కొంతకాలంగా వారు అప్పుడప్పుడూ వ్రాసి ప్రకటించినవే. సాహిత్య రంగంలో పాత కొత్తల రెంటింటినీ సమదృష్టితో ఆదరించడం గంగప్పగారిలోని విశేషగుణం. కాబట్టి ఈ వ్యాససంపుటిలో ప్రాచీన కావ్య సంబంధి విమర్శ వ్యాసాలే కాకుండా, ఆధునిక కావ్యాలను పరామర్శించిన వ్యాసాలు కూడా చోటు చేసుకున్నాయి.

విమర్శ వ్యాసాలకు జీవగర్ర విషయ విశ్లేషణం, సోపపత్తిక ప్రతిపాదన. గంగప్పగారి వ్యాసాలు విశ్లేషణ ప్రధానమేకాదు, సోదాహరణంకూడాను. ఇందున్న ప్రతి వ్యాసంలోను ఈ లక్షణం బాగా కన్పిస్తుంది. ఉదాహరణ ప్రధానంగా నడచిన వ్యాసాలు కూడా కొన్ని వున్నాయి. మొత్తంమీద ఈ సాహిత్యసుధలోని వ్యాసాల్ని సాహిత్యాభిరుచిగల పాఠకులు చదివి మెచ్చుకోగలరని ఆశిస్తున్నాను.

తిరుపతి
3-12-'81

(సం.) జి. ఎన్. రెడ్డి

# సుధాసేకం

డా॥ వి. వి. యల్. నరసింహారావు, ఎం. ఏ., పిహెచ్. డీ.
డైరెక్టర్,
ఆం. ప్ర. ప్రాచ్యలిఖిత గ్రంథాలయం, పరిశోధనసంస్థ
హైదరాబాద్.

సాహిత్యసృష్టి ఊపిరిగా జీవిస్తూ, నిరంతరరచనా వ్యాసంగమగ్నులై ఉండే వారిలో డా. గంగప్పగారు గుర్తుంచుకోదగ్గ వ్యక్తి. 'కోలాచలంవారి నాటక సాహిత్య సమాలోచనం' చేసి డాక్టరేట్ పట్టం పుచ్చుకున్నా-అంతతో ఆగక పుంఖానుపుంఖంగా పద్యాలు, గేయాలు, వ్యాసాలు, విమర్శలు వెలువరిస్తూ, లబ్ధప్రతిష్ఠుల జాబితా కెక్కిన వ్యక్తి డా. గంగప్ప. ప్రతిష్ఠతో ప్రతిభకు 'ఫుల్‌స్టాప్' పెట్టిన వ్యక్తిమాత్రంకాదు.

పదసాహిత్యమంటే ఈయనకు ప్రాణం. క్షేత్రయ్య, సారంగపాణి-మొదలైన వారి పదసాహిత్య స్వరూపాలను హృదయంగమంగా ఆవిష్కరించిన గౌరవం గంగప్పగారికి దక్కింది.

పత్రికల్లోనూ రేడియోలోను వీరివ్యాస ప్రసంగాలు చాలావెలువడినై. 'ఆ వ్యాసాలూ, ప్రసంగాలు అంతతోసరి' అన్నట్లుగా ఉంటారు చాలమంది. కాని గంగప్ప గారట్లాకాకుండా వ్యాసరచన ప్రారంభించినప్పుడే ఈ వ్యాసాలన్ని పుస్తక రూపంలో ముద్రిస్తే ఎట్లా ఉంటాయో ఊహించుకుంటూ ఉపక్రమిస్తారు. ఇంతటి దూరదృష్టి కలవారు కనుకనే 'ప్రసంగసాహితి' 'సాహిత్యసుధ' మొదలైన వ్యాస సంపుటులు ప్రత్యేకగ్రంథాలుగా వెలువరించగలిగారు.

పత్రికల్లో వ్యాసాలు ప్రచురించటం దగ్గర్నుంచీ వాటిని గ్రంథరూపంలో ఆవిష్కరించటం వరకూ తెనుగునాట అదొక యజ్ఞం. గంగప్పగారు ఈ ప్రక్రియలో కూడా ఎంతో ప్రగతి సాగించి, అవభృతస్నానాలు చేస్తున్న ధన్యజీవి.

అందుకే-ఈయన ప్రతిభాపాండిత్యాలు, నిరంతరకృషి, కార్యకరణ దక్షత నన్ను అతిమాత్రంగా ఆకర్షించాయి.

పుస్తకంపేరు 'సాహిత్యసుధ;' ఆత్మోత్కర్షకు అవకాశమిచ్చేదిగా వుంది; 'విజ్ఞాన మణిమంజూష' మొదలైనపేర్ల వంటిది. వసుచరిత్ర', 'మనుచరిత్ర' వంటి పేరు కాదన్నమాట. రచనలో సుధామాధుర్యమూ, మణిమరీచులూ స్ఫురించనప్పుడే పేచీ. గంగప్పగారిది పేరుగొప్ప వ్యవహారంకాదు. ఆచి, తూచి, అంచనాకట్టి అడుగు వేసే తత్త్వం. అందుకే 'సాహిత్యసుధ' సార్థకంగా వుండాలని ఎంతో జాగరూకత ప్రదర్శించటం జరిగింది.

ఇందులో ఇరవై వ్యాసాలున్నై. వ్యాసాలకూర్పు రచనా కాలపు క్రమా న్ననుసరించిందికాదు. విషయక్రమా న్ననుసరించిందే.

దేశభాషల్లో తెలుగు లెస్సదనాన్ని ఉపక్రమవ్యాసంగా భావిస్తే ఆక్రమంలో వ్యాసాలన్నీ కలిసి అలనాటి తెలుగు సాహిత్యపు ఒరవళ్ళ నుంచీ నేటికాలపు నెరవళ్ళ వరకూ స్థూలంగా ఒక సమగ్ర సాహితీమూర్తిని మనముందునిలిపేవిగా వున్నాయి. ఏ గ్రంథానికైనా-అది వ్యాససంకలనమే కావచ్చు—బహిరంతః సౌష్ఠవం అతి ముఖ్యం. గంగప్పగారి చూపులో ఈ నైశిత్యం కూడా నెలకొనటం ముదావాహం.

'శ్రీకృష్ణదేవరాయల లోకప్రవృత్తపరిశీలన(3వ వ్యాసం) మొదలుకొని 'ఏసుపుల సాహిత్యం' (11వ వాసం) వరకు తొమ్మిది వ్యాసాలూ ప్రబంధ సాహిత్యపు స్వర్ణ యుగానికి ప్రతిబింబాలు. ఈ యుగానికి ముందు వెనుకలను ప్రతిబింబించేవిగా రావి త్రిపురాంతకుని 'త్రిపురాంతకోదాహరణం', రఘునాథరాయల 'వాల్మీకిచరిత్రం' కూర్చటం జాగరూకతతో చేసినపనే. ఇక 'పుష్పసాహిత్యం' మొదలు 'సాహ ప్రహ' వరకు ఆధునిక యుగంలో అడుగుపెట్టి చేసిన అంతః పరిశీలన. కనుక హిత్యసుధ అతుకుపొందికలులేని వ్యాససంపుటి కాక అంతఃసౌష్ఠవంగల ఆంధ్ర సాహిత్యపు క్రమానుశీలన వ్యాసపేటికగా గుర్తించదగివుంది.

కొంచెం పెట్టె తెరిచి, లోపల భద్రపరిచిన అమృతపు సీసాల బిరడాలుతీసి; చూచి, సరకు 'నాణ్యం' తెలుసుకోవాలికదా !

వ్యాసరచనకూడా ఒక శిల్పమేనని నమ్మేవాళ్ళలో నేనొకణ్ణి. పత్రికల్లో ప్రచు రించే దృష్టితో వ్రాసినా సంవిధానంలో సాంకేతికమైన శిల్పదృష్టి విస్మరించటం కదు. వ్యాసకర్తకు ఈ విధమైన లోపలిచూపు వున్నదనటానికి ఇందులోని పలు

వ్యాసాలు నిదర్శనం. సాధారణంగా ముందు వ్యాసలక్ష్యాన్ని పేర్కొని దానికి ఉప బలకమైన ఉదాహరణలు పేర్కొంటూ పర్యవసానంగా వ్యాసకర్త తన ఆకాంక్షను పఠితకు సూచిస్తాడు.

తొలి వ్యాసంలో తెలుగులెస్సదనాన్ని సోపపత్తికంగా, సోదాహరణంగా వివరించి చివరకు "ఇలాంటి మనతెలుగు భాష ఆధునిక విజ్ఞానాన్ని సర్వప్రజానీకానికి పంచిపెడుతూ అధికారభాషగా వ్యవహరించే తరుణంవచ్చింది. సర్వవిధాలా సమర్థవంతంగా పై కార్యనిర్వహణ గావించినప్పుడే 'దేశభాషలందు తెలుగులెస్స' అన్నమాటలు సార్థకం కాగలవు. అలాంటి మన ఆకాంక్ష తప్పక ఫలిస్తుందని ఆశించవచ్చు" అంటూ ముగించారు వ్యాసకర్త. అధికారభాషగా ఆఫీసు కార్యాలయాల్లో వ్యవహరించబడే తెలుగుభాషకూ సాహిత్యభాషగా రచయితల గళంనుండీ కలంనుండీ వెలువడవలసిన తెలుగులెస్సదనానికీ వుండే అంతరం వ్యాసకర్త గుర్తించారనే అనుకుంటాను. వ్యాసాంతంలో రచయిత ఆకాంక్ష స్పష్టంకావటం వ్యాసస్వరూప సౌష్ఠవానికి మేలిగుర్తు.

ఉదాహరణ వాఙ్మయానికి సంబంధించిన 'త్రిపురాంతకోదాహరణ'మున్నది. ఉదాహరణమనేది భగవత్సంబంధమైన స్తోత్ర రూపగేయ ప్రబంధజాతికి చెంది ప్రాసాంత్యప్రాసలతో గానయోగ్యంగా నడిచే రచన. సోమనాథుని సంస్కృతోదాహరణంలోని కళికోత్కళికలు కూడా అట్లాగేనడిచాయి.

కళిక : "సతత వికస్వర భాస్వర నిజముఖ మండల ఖండితరజనీనాథః
కృతయుగవర్తన కీర్తన నిరసన నిపుణ పవిత్ర చరిత్ర సనాథః"

ఉత్కళిక : " సురగిరి మందర నిరుపమ కందర
ఘన హరి చందన వన మయ నందన"

మరి త్రిపురాంతకుని ఉత్కళిక భావనా ప్రపంచంలోకూడా ఓమెట్టు పైకెక్కి కల హంసగీతాన్ని ఆలపించినట్లుంటుంది.

"వినుత ముఖ నళినమును ఘన జఘన పులినమును
వర వళి తరంగములు గురు కుచ రథాంగములు
గలిగిన యుమా సరసి లలిత ముఖములఁ బెరసి
క్రాలు నొక కలహంస బాల చంద్రోత్తంస:"

ఉమా సరసిలో వోలలాడే శివకలహంసను సంభావించిన భక్తిరసజ్ఞత అసామాన్యమైంది. దాన్ని మన దృష్టికి తెచ్చే ప్రయత్నంచేసిన వ్యాసకర్త రసజ్ఞత కూడా సామాన్యమైందికాదు.

ఉదాహరణ కావ్యాన్ని క్షుద్రకావ్యకోటిలో భావించిన లాక్షణికుడికి కనువిప్పుగా నడిచింది త్రిపురాంతకోదాహరణం. ఆ లాక్షణికుడు కూడా "తదుదాహరణం నామ విభక్త్యష్టాంగ సంయుతమ్" అన్నప్పుడు విభక్తితత్త్వం స్పష్టం చెయ్యలేదు. అది నేటికీ అస్పష్టంగానే ఉంది.

'విభక్తి' అంటే విశిష్టమైన భక్తి. వాక్యంలోని శబ్దాలకు పరస్పరం ఉండవలసిన విశిష్టమైన భక్తిని తెలిపేది విభక్తి. క్రియతో అన్వయం కలిగించే 'కారక' లక్షణం విభక్తిలో అంతర్నిహితం. భక్తునకు భగవంతునితో అన్వయం కలిగించేందుకు కారక మయ్యేది కూడా విభక్తి. కనుకనే ఉదాహరణవాఙ్మయంలో విభక్త్యంత రచనా సంప్రదాయం చోటుచేసుకుంది.

ఇక రాయలవారి స్వర్ణయుగంలోకి అడుగుపెడదాం. ఆయన లోకవృత్తపరిశీలన దక్షతకు కోకొల్లలుగా ఉదాహరణలిచ్చి, వ్యాసకర్త చివరకు "ఇలాగా, ఆముక్తమాల్యదలో 'రాయల ప్రకృతి పరిశీలనా దక్షత', వర్ణనవైదగ్ధ్యం మొదలైన గుణాలన్నీ అతనికి గల సర్వంకష పాండిత్య ప్రకర్షకు వన్నెబెట్టుతున్నాయి. ఇదే రాయలలోని ప్రత్యేకత." అంటూ ముగించారు వ్యాసాన్ని. అంటే ప్రకృతి పరిశీలన అవధులు దాటి వ్యాసవిషయానికి అతివ్యాప్తికూడా కలిగిందన్నమాట. అయినా చెప్పిన తీరు హృదయరంజకంగా ఉండటంవల్ల సమాదరణీయమే.

ఈ వ్యాస కోటిలో నా హృదయాన్ని బాగా ఆకట్టుకున్న విషయాలు "ప్రవర విష్ణుచిత్తుల ధర్మపత్ను"లూ, "నిగమశర్మ భార్య". అసలీ పాత్రలు విస్మృతపాత్రలు వీటిమీదికి దృష్టిపోవటానికి రాయలయున్నంత లోకవృత్త పరిశీలన కావాలి. వ్యాసకర్తకు ఇంతటి అంతర్దృష్టి ఉన్నదనటానికి ఈ వ్యాసాలు తార్కాణం. ప్రవరవిష్ణుచిత్తులు భార్యావిధేయుల కోటిలోవారే. నిగమశర్మ ఆ బాపతు కాదు. "పెళ్ళాం కన్నుగప్పి ఎట్లా పైతిరుగుడు తిరుగుదామా?" అన్న ఆలోచనే ప్రధానం. ఆ నిస్పృహురాలు తన అదృష్టం అపాటిదే ననుకొని దుఃఖం దిగమ్రింగుకొన్న దయనీయ. సరిగా ఇటువంటి పరిస్థితే నిరంకుశుని భార్యకూ (నిరంకుశోపాఖ్యానం) తటస్థించింది. వీరిద్దరికీ పూర్వం గుణనిధి భార్యా, సుకుమారుడి భార్యాకూడా ఇదే పరిస్థితిలో పడ్డారు. బ్రతుకు అట్లాగే తెల్లవారుస్తున్నారు. కాని నిరంకుశుని భార్య అట్లా ఊరుకోలేదు. మెత్తగా ఎదురుతిరిగింది. "అత్తగార్ని మందలించింది"—అత్తప్ప, సర్వలక్షణ సమన్వితురాలవు "నన్ను తిట్టుటన్ మెత్తనేగాని నీ కొడుకు మూఢత మానుపనైతివి; వాడు రోలా తులమారియై, కోకలు రూకలు చేరవేస్తున్నాడు" ఇట్లా మొదలుపెట్టి అత్త మనస్సును ఆర్ద్రింపచేసింది. అంతేకాదు; ఆ మొగుడు ఎక్కడ ఏ రంభతో కులికినా చివరకు తన దగ్గరికేవచ్చి గుట్టుగా కాపురం చేసేట్లు కార్యశూరత ప్రదర్శించింది. ఈ ఉదంతం కూడా జోడిస్తే ఈ వ్యాసాల్లోని సాంఘిక విషయానికి పుష్టిచేకూరేది. ముందువిధమైన చూపుతో ఆ ధర్మపత్నుల్ని పరామర్శ చేసినందుకే వ్యాసకర్త నభినందిస్తున్నాను.

ఆయన సూక్ష్మాతిసూక్ష్మ పరిశీలన దృష్టికి "వటవృక్షం", వేసవికాలం, వ్యోమయానం, ఏనుగుల పద్యాలు, అర్థాంతరన్యాసాలు, పరమేశ్వర భక్తిప్రవృత్తులు ప్రపంచించబడిన తీరు నిదర్శనం.

వటవృక్ష చరిత్ర ప్రస్తావిస్తూ రాయలసీమలోని గూటిబయలు "తిమ్మమ్మ మర్రిమాను" సంగతి, తెలంగాణాలోని "పిల్లలమర్రి" సంగతీ చెప్పి విషయానికి పరిపుష్టి సమకూర్చారు వ్యాసకర్త. "వీటినికూడా ఏ ఆధునిక కావ్యంలోకైనా ఎక్కిస్తే ఎంత బాగుంటుందా!" అనిపించింది.

వసుచరిత్రలోని మంజువాణి వ్యోమయాన వర్ణన రామరాజభూషణుని కవితకూ, ఊహకూ కలికితురాయి వంటిది. వాల్మీకి రామాయణంలో హనుమంతుడు వ్యోమయానం చేసి లంకను చూచినప్పటి సందర్భం వసుచరిత్రకారుడి మనసులో మెదలి

పించింది. మంజువాణి వ్యోమయానం చేసి అధిష్ఠాన పట్టణం దర్శించిన తీరు అటు వంటిదే. రావణుని శుద్ధాంతంలో పానకేళివలనలసి ప్రేమ్యంచి నిద్రించే స్త్రీ మూర్తులు ఆంజనేయుని కంటబడినట్లే బ్రహ్మచారిణియైన మంజువాణి కంటికికూడా అధిష్ఠానగత వేశ్యావాటికలోని మహాభోగినులు కన్పించారు. అయినా ఆ పట్టణం ఆమెకు లంబికా పూర్ణసమాధి యోగనిష్ఠలో ఉన్నట్లే (సొలయు యంత్రపీఠము.... వ. మ. 4-64) కన్పించిందట. వ్యోమయానంలో అంత ఎత్తుకుపోయి ఆమె దర్శించిన తీరు అపూర్వం. కొంత ఎత్తుకు మాత్రమేపోయి చూచినప్పటి విశేషాలు వ్యాసకర్త ఎంతో అందంగా వివరించారు.

రఘునాథరాయల వాల్మీకి చరిత్రమీది వ్యాసం అన్నిటికంటే పెద్ద వ్యాసం. తలస్పర్శి పరిశ్రమచేసి వ్రాసిన వ్యాసం.

"సతులెవ్వరు? సుతులెవ్వరు?
హితులెవ్వ? రేటివరద నెండే నొకచో
జతకూడిన కాష్ఠంబుల
గతి నింతక కూడి విచ్చి కదలుదు రవలన్" (2—149)

కావ్యంలోని ఈ భావాన్ని పసిపట్టిన వ్యాసకర్త కావ్యహృదయాన్ని పసిపట్టి నట్లే. తత్త్వం ఆమూలచూడం మనముందు ఆవిష్కరించినట్లే

రఘునాథుని కవితాతత్త్వం చేసుకొనేరకు తెలిసినంతగా ఇతరులకు తెలియక పోవచ్చు "తారిసృష్టిపై ప్రతి పదంబున జాతియు, వార్తయున్, చమత్కారము, అర్థగౌరవము గల్గు అనేక కృతుల్ ప్రసన్న గంభీరగతిన్" రచించినవాడు రఘునాథ భూపాలుడు (వి.వి. 1-81).

జాతి వార్తా చమత్కారాలకు సాధారణ నిఘంట్వర్థాలు కాకుండా ఆలంకారిక పరిభాషా పదార్థాలు ఇంకా అన్వేషింపవలసినవనే నా అభిప్రాయం. వీటినిగూర్చి క్షోదక్షమమైన పరిశోధన జరగవలసివుంది. డా॥ రాఘవన్‌గారు కొంతమేరకు పరిశీలించి తమ అభిప్రాయం తెలియజేశారు. వాటిని సుదూరం పరామర్శించటానికి ఇది సమయం కాదు. రఘునాథరాయల కవితా పరామర్శకు వీటి వివరణ ఎంతైనా ఉపకరిస్తాయి.

# 3

"సాహిత్యసుధ"లో ఇంతవరకు జరిగిన పరామర్శ అంతా ప్రాచీనార్వాచీన సాహిత్యానికి సంబంధించిందే. పుష్పసాహిత్య వ్యాసంతో మొదలైంది. ఆధునిక కవితా పరామర్శ. "గౌతమీకోకిల" వేదులవారి "కాంక్ష"కు "ఫూల్ కీ చాహ్" అనే హిందీమూలమున్నా ఆయన పద్యాల్లోని సంక్షిప్తత, సూటిదనం, రచనాశిల్పం, వృత్త రచనా కౌశలం అనితరసాధ్యం. నండూరి, పల్లపరపు, పెనుమర్తి, కరుణశ్రీ, కె.వి.ఆర్. మొదలైనవారి పుష్ప హృదయాలను వ్యాసకర్త సముచితంగానే దర్శించారు. చలంగారి "ఓ పువ్వుపూసింది" వచన రచన అయినా వెయ్యి పద్యకావ్యాల భావ సుగంధాన్ని ఉదారంగా పంచిపెట్టిన మహాకావ్యం. జీవన తత్త్వాన్ని పుష్పద్వారా బహిర్గతంచేసి, సృష్టి స్థితిలయాల ఆంతర్యాన్ని అతి సుకుమారంగా అవగతపరిచిన అమూల్య రచన అది.

కవికోకిల జాషువాగారి 'గబ్బిలం', 'పిరదౌసి', 'ముంటాజ్ మహల్' ప్రత్యేక వ్యాసాలుగా రూపొందాయి. 'గబ్బిలం' మానవతావాదానికి ప్రతీక అని వ్యాసకర్త అభిప్రాయం. రచనలోని నవ్యత, నూతన ప్రయోగాలు, దేశభక్తి, కరుణ రసం, మన్నిత(మైన) హాస్యం, అలంకారిక శైలి మొదలైన అంశాల వివరణకు ప్రాధాన్యం. మెచ్చి వ్యాస శీర్షిక అయిన ప్రధాన లక్షణ పరామర్శ పరిమితమై పోయింది. వ్యాసంలో వివరించబడిన అంశాలన్నీ మానవతావాదానికి ప్రతీకలని చెప్పటం కష్టం. గబ్బిలం కావ్యం ప్రధానంగా అస్పృశ్యతా నిరసనానికి పుట్టిన కావ్యం, ఒక రకంగా కవి రచనా వ్యాసంగమంతా అందుకే అంకితమైందన్నా ఆశ్చర్య పడనక్కర్లేదు. అస్పృశ్యతా నిరసనం మానవతా వాదంలో అంతర్భాగమే కనుక కవిని 'హ్యూమనిస్టు'గా చెప్పినా తప్పులేదు.

'పిరదౌసి కావ్య శిల్పం' అనల్పం. శబ్ద చిత్రణలు, వ్యంగ్య వైభవాలు, అన్యదేశీయాల అపూర్వ ప్రయోగం జాషువాను నవయుగ కవిచక్రవర్తిగా నిల బెట్టాయి. 'స్వామి కపమతిచేయు లుచ్చాల' వంటి ప్రయోగాల మాట అట్లావుంచి 'ఈ తొలికోడి కంఠమున నే యినబింబము నిద్రపోయెనో' వంటి వ్యంగ్య గర్భ వైదగ్ధ్యం కవిని ఆకాశానికి కెత్తుతున్నది. అన్నిటికంటే ముఖ్యంగా కరుణానికి పట్టం గట్టి, కవికి జరిగిన అన్యాయం గూర్చి ఆత్మవేదన అవిష్కరించిన తీరు

అనన్య సాధ్యం. రచన పద్ధతిలో ఉపక్రమోపసంహారాలు కూడా శిల్పసంవిధానానికి నిదర్శనంగా నిలుస్తాయి.

'ముంతాజ్ మహల్' కవి కళాహృదయానికీ, ఆర్ద్రమైన ప్రేమ తత్త్వ దర్శనానికీ చెరగని గుర్తు.

విశ్వం గారి పెన్నేటి పాటలో వ్యాసకర్త రాయలసీమ విశ్వరూపాన్ని దర్శించి వ్యాసబద్ధం చేశారు. అటు పద్యంలోను ఇటు పాటలోను సవ్యసాచిగా రచన సాగించి "ఖళి ఖళీ" విశ్వన్న 'గణమె కావ్యము' అన్నట్లు మెచ్చుకోలు పొందిన విశ్వంగారి కవితా హృదయాన్ని పఠితృలోకానికి బాగా పరిచయం చేశారు వ్యాసకర్త.

'తిష్యరక్షిత' కావ్యకర్త శ్రీ కరుటూరి సత్యనారాయణగారు ఈ యుగంలో కూడా పద్య రచన కోసమే ప్రాణాలు ముడుపు గట్టుకొన్న ప్రౌఢ కవి. అమృత హృదయులు. నిరంతర పద్య కావ్య రచనలో నిద్రలో కూడా పద్యం చెప్పగల ఛందోయోగి. చిత్రాంగి వంటి తిష్యరక్షిత, రాజరాజు వంటి అశోకుడు, సారంగధరుని వంటి కుణాలుడు కావ్యగత పాత్రలు.

"అక్షీణ ప్రతిభా సమన్వితము, లాప్యాయంబు, లానందము ద్రాక్షా పక్వమ్ములు" అని కుణాలుని నేత్ర ప్రభలను గూర్చి కవి పలికిన పలుకులు కవి కావ్య కన్యకు కూడా అన్వయిస్తాయి. అటువంటి కావ్య సౌందర్యాన్ని వ్యాసకర్త అభినందన పూర్వకంగా అగ్గించటం మెచ్చదగిన అంశం.

వ్యాస సంపుటిలో తుది వ్యాసం 'సరోజినీనాయుడు కవితలో సామాజిక స్పృహ' .... ఆంగ్ల మూలానికి డా॥ సి. నారాయణరెడ్డిగారి తెనుగుసేత ఆధారంగా సాగిన విమర్శ. పర రచనను తుల్య సంస్కారం గల కవి అనువదించటం మేలు. అదే జరిగింది.

లయప్రధానంగా కదను త్రొక్కించే శబ్దాల కూర్పుతోపాటు భావచిత్రణలోను, భారతీయ ప్రకృత్యారాధనలోను సరోజినీనాయుడు కవిత రొమాంటిక్ శ్రేణికి సంబంధించిందే. కొంతకు కొంత అభ్యుదయ దృష్టి — నవ్యభావ చిత్రణ దృష్టి —

రెండూ మేళవించిన ఆమెగారి కవిత కొత్త పుంతలు తొక్కింది. సమకాలీన ఆర్థిక సాంఘిక సమస్యల స్పృహ ఆమె కవితలో ఎంతవరకు ప్రతిఫలించిందో సమాలోచించటమే వ్యాసకర్త చిత్తశుద్ధితో చేసిన ప్రయత్నం. "తాజమహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు ?" అన్నట్లుగా "పెళ్ళికూతురు కూర్చున్న పల్లకి, మోసిన బోయీలెవ్వరు ?" అని ప్రశ్నించుకుని 'palanquin Bearers' ప్రబంధమల్లి పరామర్శించటం సామాజిక స్పృహ. పెళ్ళికూతురు కూడా సమాజంలో భాగమే.

"Gaily o gaily we glide and we sing
We bear her along like a pearl on a string".

పాటను తరుముకుపోయే మహాలయను ఛేదించుకుని సామాజిక స్పృహను పైటను లాగాలి. అందుకే వచన కవిత ఛందస్సును చాలావరకు వెలివేసింది.

మొత్తం మీద డా॥ గంగప్పగారి వ్యాస విన్యాసం తెలుగులోని ప్రాచీన కవిత్వం నుండి ఆధునిక కవిత్వం వరకుగల భావసౌందర్యాన్నీ రచనా సౌందర్యాన్ని చదువరులకు చక్కగా **అనుభూతం** చేస్తూ కృతార్థమైంది.

'సాహిత్య సుధ' అక్షరాలా సార్థకం.

హైదరాబాదు
4-12-81

**(సం.) వాసిరి వేంకట లక్ష్మీనరసింహారావు**

# సుధాస్వాదనము

**శ్రీమాన్ కుంటిమద్ది శేషశర్మ,**
తెలుగు పండితులు (రిటైర్డు)
2-228, 4వ క్రాసు, II రోడ్డు,
**అనంతపురం.**

తెలియరాదు మనిషి విలువ, వాడెంత లో
గొన్న దానివిలువ కొంచమేని
వెలికిఁబెట్టు దానివలననే తెలియు న-
దంతగాని మరి యంతగాని

వాడు మహా పండితుడు, చతుశ్శాస్త్ర పారంగతుడు, భాషాపరశేషభోగి అయిన కావచ్చు. అంతమాత్రంచేత వాని గొప్పదనము లోకులకెరుగరాదు. వాని చదువు వలన, విజ్ఞానమువలన లోకానికుపకారంలేదు. వాడు తన విజ్ఞానాన్ని పెట్టుబడిచేసి, లోకానికందజేసిన సరుకు అంతగాని, యింతగాని రచయితయొక్క విలువను వెల్లడిస్తుంది.

ఆంధ్ర సారస్వత పాథోనిధి చిన్నదిగాదు. శతాబ్దాల తరబడి, శాఖోపశాఖలుగా ఉప్పొంగినది. తన విజ్ఞాన మంథానముతో మథించి సాధించిన సాహిత్యసుధను చిరంజీవి డాక్టర్ ఎస్. గంగప్ప జిజ్ఞాసువుల కందజేసినాడు.

“దేశభాషలందు తెలుగు లెస్స” అన్న తీర్పును ఒక్క తెనుగుభాష మాత్రమే తెలిపిన వ్యక్తి యివ్వజాలడు. “ఎల్లనృపులు గొలువ ఎరుగవే బాసాడి” అని, నానా సామంత మహీనాథులతో గోష్ఠికలాపములందు పాల్గొన్నవానికిగాని వచింప సాధ్యము కాని విషయమది. అటులనే నన్నయ పౌరాణిక కవితనుండి నేటి దిగంబర కవితల వరకుగల సారస్వత వైచిత్రి నాకళించుకొన్న వ్యక్తిగాని సాహిత్యసుధను పంచి ఇజాలడు.

కృష్ణదేవరాయల లోకవృత్త పరిశీలనలో ప్రవర విష్ణు చిత్తుల ఆతిథ్య వైశిష్ట్యమును, వారిభార్యలలో దాదాప్య సహిష్ణుయమును, ధూర్జటి కృష్ణదేవరాయ పటువృక్ష, తద్వారిల బ్రహ్మరక్షస్స్వరూప వర్ణనావైవిధ్యములను, పెద్దన తిమ్మనల అర్థాంతరన్యాస విన్యాస పాటవములను, తులనాత్మకముగా పరిశీలన గావించి నిగ్గు తేసి వెల్లడించినాడు.

ప్రవరుడు వరూథినిని "అంసద్వయంబంటి పొమ్మంచున్" త్రోయుట, సత్య కృష్ణుని శిరంబును "వామపాదంబునన్ దొలగన్" త్రోయుట, ఆయాకథలకు ఆయువు పట్టులని, 'ఒక్కట కామిని కన్యక తిరస్కారము, వేరొక్కట కామినీ కర్తృకతిరస్కారము ప్రదర్శింపి, కాంతలకు వశులై "బ్రహ్మానందాధి రాజ్య పదవీ చ్యుతులు" కారాదని, "నాథుల్ నేరముల్ సేయ పేరలుకం జెందిన" కాంతలు ఉచిత వ్యాపారమునకు విరుద్ధముగ నాచరించుట సహజమేనని సమర్థించి, ఇట్టిచో కవులు తమ లక్ష్యములను సాధించుకొనుట, నిరూపించినాడు.

ధూర్జటి తన పరమేశ్వర భక్తిని నిరూపించుటకు శ్రీకాళహస్తి మాహాత్మ్యము నను, రఘునాథ రాయల కవితా విలాసమును ప్రదర్శించు వాల్మీకి చరిత్రమునకు, 'గర్భిలము, పిరదౌసి' ఇత్యాది శీర్షికలలో ఆయాకవుల విలాసములకు, తన వ్యాసములను అద్దములుగా చేసినాడు.

కవులు చూపిన వస్తువులు వర్ణించగలరు. తమ అనుభవాలకు అక్షరరూపత నందివ్వగలరు. అంతమాత్రమే కాక, "కవియొక్క ఊహ ఎంతకైన సమర్థమైనది" అన్నవిషయాన్ని వసుచరిత్రలోని వ్యాసమూనం లో నిరూపించుట వెల్లడించినాడు.

తెనాలి రామకృష్ణుని చిత్రణంలో రేఖామాత్రముగా నుండిన నిగమశర్మ భార్యను సర్వాంగశోభి లావణ్యమూర్తిగా, సచ్ఛీలగా, సభ్యతగల యిల్లాలుగా, తన వేదనను ఊరబ్బునారబ్బుచేయు గయ్యాళిగంప కాకుండ, అకుమరుగు పిందెగా పాఠకులకు ప్రదర్శింపచేసినాడు.

ప్రబంధాలలోని ఏడుపులనుగూడ వినిపించినాడు. ఎందరెన్ని రీతుల ఏడ్చినా, ఆయా కవుల రచనా కౌశల్యమునుబట్టి సారస్వతమున యింకెన్ని ఏడుపులకైనా యవకాశముందని, అది సహృదయ హృదయ రంజకమేనని నిరూపించినాడు.

క్షీరార్ణవమును మథించినపుడు, అమృతముకంటె ముందు ఎన్నో వస్తువులుద్భవించినాయి. కొన్ని సామాన్యములు, కొన్ని విశిష్టములు. కాని అన్నింటికంటె ముందు గరళముకూడ జనించినది. కాని సాహిత్య సాగర మథనములో జనించినదంతయు శ్రవణపుట పేయమైన సుధాపరీవాహమే. అయ్యది చి॥ గంగప్ప రచనలో ఇరువది పాయలై పారినది.

"కావ్యామృత రసాస్వాదం వ్యాఖ్యాతా వేత్తినో కవిః।
సుమరసమాధుర్యం నహి వల్లీ జానాతి బంభరోవేత్తి"॥

ఆలోచనామృతమయిన కావ్యరసమును కవికంటే వ్యాఖ్యాతే బాగా గ్రహించ గలడు. పూల మకరందమాధుర్యం తీగెకేమి తెలుసు. పలు పూలలోని రసము నాస్వాదించే తుమ్మెదకే దాని కమ్మదనము తెలుసుకొనే యోగ్యత.

తుమ్మెదవలె తెలుసుకొన్నంత మాత్రముతో మనకేమి ప్రయోజనం? తాను ఒక్కడు రసము గ్రోలి తనిసినంత, అది సరియైన భుక్తిగాదు.

"వేదవిదేశిల దత్తం దత్తం బంధుజనైః సహభుక్తం భుక్తం – ప్రియత మయా సహ సుప్తం సుప్తం అన్యదదత్తమ భుక్తమసుప్తం"– అన్నాడొక కవి. బంధు జనులతోపాటు అనుభవించిన దానిలోనే సారస్యము. వ్యాఖ్యాత తుమ్మెదవంటి వాడు. వి పూర్వక ఖ్యా ప్రకథనే ధాతుజన్య వ్యాఖ్యాతృ పదానికి లోకానికి ప్రకటించే వాడు అని అర్థము. కాన కేవల రసాస్వాదన పరుడు మాత్రమే గాక ఆరసమును లోకానికి పంచిపెట్టే వాడనియు వ్యాఖ్యాతృ పదార్థము.

గంగప్ప తాను సాహిత్య పాథోనిధిని మథించి, గ్రహించిన సుధను రసిక లోకమున కంతటికి పంచిపెట్టినాడు.

ఒక్క కావ్యమును చదివి అందలి సారమును వెల్లడించుట ఒక్క సరసత. అనేక కావ్యముల సారమును గ్రోలి అందలి పాత్రల తారతమ్యమును, సామ్య వైషమ్యములను సహేతుకముగ చర్చించి, ఆయాపాత్రల వైశిష్ట్యమును ప్రదర్శించుట ఒక తార్కికతతో గూడిన రసాస్వాద లోలుపత.

రచనలో బిగువుసడలిన నేటికాలము రచయితల ఏడ్పుల వింటే ఏడ్పువచ్చే రచనలు రావచ్చు. "కాలోహ్యయం నిరవధిర్విపులా చ పృథ్వీ" కదా! ఇక "పుష్ప సాహిత్యం"లో పూలనెపంతో తమహృదయారవిందంలో వెల్లివిరిసిన భావ పరీమళాలకు అక్షరత గావించిన కవుల రచనల మచ్చులనొక్క చోమాలగూర్చి పాఠకుల చిత్తములం బల్లవింప చేసినాడు.

ఆంధ్ర సారస్వత పాథోనిధి అపారమన్నాము. అందులోని తరంగములన్నింటి వంపుసొంపు నొయ్యారాలను పరామర్శించుటకు ఎట్టి చతురాస్యునికైనా అలవిగాని పని. చిరాయువు గంగప్ప ఒక్కనాడుచేసిన కృత్యముగాదు ఈ సాహిత్య పరిశీలనము. 1966 మొదలు 81 వరకు ఆయా సందర్భాలలో రచించిన వానికి సంకలన మీ సాహిత్యసుధా సమారాధనము.

సారస్వత మాధుర్య జిజ్ఞాసువుల కిది ఎంతేని ఆన దకందము

పలుకవుల రచనల పొందుల నాకళించుకొన్న నిత్య సారస్వత వ్యాసంగియైన ఈ చిరంజీవి, ఈ సారస్వత నందనోద్యానమునకు స్వకీయమైన ఒక సుగంధి కల్పకమును ఉపాయనీకరించునని ఆశించుచున్నాము.

అనంతపురం,
2-12-1981

(సం) కుంటిమద్ది శేషశర్మ

# కృతిస్వీకర్తృ వచనం

ఆచార్య తూమాటి దోణప్ప, ఎం. ఏ., పిహెచ్. డి.,
తెలుగు శాఖాధ్యక్షులు,
నాగార్జున విశ్వవిద్యాలయం,
నాగార్జున నగర్–522 510.

సమర్థమైన శిక్షణంవల్లనూ, బహు గ్రంథ సేవన వల్లనూ, నిరంతర చింతనం వల్లనూ సుప్రసన్నమూ, సుసంపన్నమూ అయిన సంస్కారధనం మా గంగప్పది. ధారావాహికమూ, ధీర విచారశ్రీకమూ అయిన డా॥ గంగప్ప సాహితీ తపస్సు విద్వజ్జనుల చిత్తానకత్తిన వృత్తం జగమెరిగిన చరిత్ర.

పదిపదైదేళ్ళుగా పలుపత్రికల్లో ప్రచురించిన సాహితీ సమీక్షాపరమయిన స్వీయరచనలను సంపుటీకరించినా ఆకృతినందిన ప్రకృతకృతి బహుముఖ ప్రతిభా ముఖరితమయిన డా॥ గంగప్ప కృషికి నికషోపలం.

నేను ద్రోణుడనూ కాను; ద్రోణునివంటివాడనూ కాను. కాని డా॥ గంగప్ప నాకు ఏకలవ్య శిష్యుడు. తనంతతానే యీ కృతిని నాకు గురుదక్షిణగా సమర్పణ చేస్తానని ముగబడివచ్చి మొగమోట పెట్టినాడు. ఔననక తప్పలేదు. చదువుల సారమూ, పారమూ తెలిసిన యీ వినయ సుందరుని చిన్ని ఉడుగరను ఆనందంగా అందుకుంటున్నాను.

కృతి కర్తకు మంగళా శాసనాలు !

బి–17, సుధారా,
శ్రీనివాస నగర్
గుంటూరు–6.
1-12-81

(సం.) తూమాటి దోణప్ప



కృతి స్వీకర్త　　　　కృతికర్త

# సమర్పణ

నా ప్రగతి నాశించే హితులు
సాహిత్య మార్గోపదేశకులు
ఆచార్య తూమాటి దొణప్పకు
నాభక్తి గౌరవాల ప్రతీక
అర్పిస్తున్నా చిరకాల కామనం
ఈ 'సాహిత్యసుధ' అనే ఉపాయనం!

—ఎస్. గంగప్ప

# కృతజ్ఞతాంజలి

అడిగినదే తడవుగా నామీది అత్యంత వాత్సల్యంతో 'అభినందన' అభివ్యక్తీక రించిన పూజ్యులు ఆచార్య జి. ఎన్. రెడ్డి గారికీ,

'సుధాసేకం' గావించిన ప్రియమిత్రులు డా॥ వి. వి. ఎల్. నరసింహారావు గారికీ,

చిన్ననాట మిన్నగా మన్నించి, విద్యాబుద్ధులు గరపి, ఈనాడు 'సుధాస్వాద నము' చేసిన అస్మద్దేశికోత్తములు ప్రసిద్ధ కవులూ, పండిత ప్రకాండులూ, పూజ్యులు శ్రీమాన్ కుంటిమద్ది శేషశర్మగారికీ,

నా అభ్యర్థనను అవ్యాజానురాగంతో ఆదరించి, కృతి స్వీకరించిన పూజ్యులు ఆచార్య తూమాటి దొణప్పగారికీ,

నా వ్యాసాలను ప్రకటించిన ఆయా పత్రికాధిపతులకూ

నా కృతజ్ఞతాంజలులు!

ముచ్చటగా ముఖపత్ర చిత్రణ చేసిన శ్రీ పి. నాగుల్ (మంగళగిరి), బ్లాకు తయారీలో సహకరించిన శ్రీ ఏ. రజాహుస్సేన్ (పరిశోధక విద్యార్థి), ముద్దుగా ముద్రించిన వైష్ణవి ప్రింటర్స్ అధిపతి శ్రీ భవిరిశెట్టి రాజేంద్రప్రసాద్—

వీరందరికీ నా అభినందనలు!

ఎస్. గంగప్ప

# ప్రస్తావన

పలు పత్రికలలో ప్రకటితమై, పలువురు పాఠకుల మన్ననలకు పాత్రమై ప్రశంసింపబడిన ఇరవై వ్యాసాల సంపుటీకరణమే ఈ 'సాహిత్య సుధ'. విషయ క్రమాన్ననుసరించిన ఈ వ్యాసక్రమం తెలుగు సాహిత్య చరిత్ర స్థూలరూపాన్ని నిరూపిస్తుంది ప్రాచీన సాహిత్యంతోపాటు ఆధునిక సాహిత్య పరిమళాల గుబాళింపుల్ని ఈ వ్యాస పుష్పాల్లో సహృదయులు ఆఘ్రాణించగలరు.

ఇవి - తెలుగు కావ్య సంబంధి వ్యాసాలు కాగా, నాటక, జానపద సాహిత్యాలకు సంబంధించిన వ్యాసాలు అనేక పత్రికల్లో ప్రకటితమైనవి సంపుటాల రూపంలో వెలుగు చూడవలసిన అవసరమెంతేని కలదు. 'నాటక సాహిత్య సుధ, జానపద సాహిత్య సుధ' అన్న పేర్లతో త్వరలోనే ప్రకటించ ప్రయత్నిస్తున్నాను.

'సాహిత్యసుధ' ఆస్వాదనచేసే అభిరుచిగల సామాన్య పాఠకులను అలరించి, సాహిత్య విద్యార్థులకు సహకరించ గలదని ఆశిస్తున్నాను.

గుంటూరు
1-12-1981

ఎస్. గంగప్ప

# దేశభాషలందుఁ దెలుఁగు లెస్స

"తెలుఁగదేల యన్న దేశంబు దెలుఁ, గేను
దెలుఁగు వల్లభుండఁ, దెలుఁగొ కండ,
యెల్ల నృపులు గొలువ నెఱుఁగవే బాసాడి,
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స". (1–16)

కృష్ణానదీ తీరస్థ శ్రీకాకుళక్షేత్రంలో వెలసిన ఆంధ్రవిష్ణువు శ్రీకృష్ణదేవరాయలకు స్వప్నంలో సాక్షాత్కరించి తెలుగులో ప్రబంధ నిర్మాణం చేయుమని ఆనతిచ్చినప్పటి మాటలివి. ఇవి శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదా కృతి ప్రశంసలో తెల్పుకొన్నారు. 'దేశ భాషలందుఁ దెలుఁగు లెస్స' అన్న సూక్తి శ్రీనాథుని కాలానికే ప్రసిద్ధి పొందినట్లు తెలుస్తుంది శ్రీనాథుని కృతమనబడే క్రీడాభిరామంలో—

"జనని సంస్కృతంబు సకల భాషలకును,
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స,
జగతిఁ దల్లికంటె సౌభాగ్య సంపద
మెచ్చు టాడుబిడ్డమేలు గాదె?" (పద్యం – 37)

—అని ప్రశంసించబడింది. కానీ ఇలాంటి అభిప్రాయమే కృష్ణదేవరాయ శ్రీనాథులకు పూర్వం నుంచే ఉన్నట్టు కే॥ శే॥ నేలటూరి రామదాసయ్యంగారు పేర్కొన్నారు. "నన్నయభట్టు ...... 'స్వస్థాన వేషభాషాభి మతాః సన్తో' రస ప్రలుబ్ధధియః । లోకే బహుమన్యన్తే వైకృత।కావ్యాని చాన్యదపహాయ' అని రస ప్రలుబ్ధ ధీశాలులు అన్యమును (= సంస్కృతమును) మాని వైకృతి (= తెలుగు) కావ్యముల బహుమానింతురనియు, ఉభయ కవిమిత్రుడు తిక్కన ఆంధ్రమున భారతము రచించుటయేకాక, ఉత్తరరామాయణమున, 'ఒప్పైనను జాత్యముగామిచే

ఎయ్యెడను సంస్కృతమును చొన్ప' ననుటయు ఇత్యాదిం బట్టి చూడ 'దేశభాషలందు, దెలుఁగు లెస్స' యనునది సంప్రదాయముగా 'నానుడి'వలె దేశముననెంతయు నానిన నుడిఁగాఁ జూపట్టు చున్నది "[1]

కాబట్టి ఈనానుడి అర్థం తెలుసుకొనే ముందు దేశభాషలంటే ఏమిటో మనం గుర్తించవలసి ఉంది. సమస్త భాషలకు మూలం సంస్కృతమని పూర్వం నుంచీ పండితులభిప్రాయ పడుతున్నారు. "'తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును' అని ఆంధ్రభాషాభూషణంలో కేతన, 'జనని సంస్కృతంబు సకల భాషలకును' అని క్రీడాభిరామకర్త, 'తల్లి సమస్త భాషలకు దైవత భాషయ' (మనుచరిత్ర-పీఠిక) అని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, 'జనని సమస్త భాషలకు సంస్కృత భాష' అని రాయప్రోలు సుబ్బారావుగారూ పేర్కొన్నారు. కానీ ఇవన్నీ "ఏదో ఔపచారికంగా అన్నముక్కలే గాని, తార్కిక దృష్టితో, తత్త్వావలోకనాసక్తితో నిర్ధారించిన నిశ్చయాత్మక నిర్ణయాన్ని ప్రతిబింబించేవికావు"[2] అని భాషాశాస్త్రవేత్తలు ప్రొఫెసర్ తూమాటి దోణప్పగారు నిష్కర్షగా చెప్పారు. సంస్కృతమూ, ప్రాకృతమూ నని భాష రెండు విధాలనీ, ప్రాకృతం మరల అనేక విధాలనీ అప్పకవి[3] ప్రాకృతాలు దేశభాషలు. "ప్రాకృతాలలో మహారాష్ట్రి, శౌరసేనీ, మాగధీ, అర్ధమాగధీ, పైశాచి, చూళికాపైశాచీ అన్నవి ముఖ్యమైన భాషాభేదాలు. ఇవికాక అవంతి, చాండాలీ, ప్రాచ్యా, బాహ్లీకీ, శాకారీ, శాబరీ మొదలైన అవాంతర భాషాభేదాలు కూడ ప్రాకృతములలో ఉన్నాయి."[4] 'ఆంధ్ర భాషయుఁ గవిమతంబునందుఁ బ్రాకృత భేదంబె యనఁగ నొప్పు' (1-75) అన్న అప్పకవి మాటలను నమ్మి కొందరు పండితులు తెలుగు సైతం సంస్కృతభవమైన ప్రాకృత విశేషమని నిరూపింప యత్నించారు. కానీ ఆధునిక భాషా శాస్త్రవేత్తలు తెలుగు ద్రావిడభాషా కుటుంబంలోనిదని సిద్ధాంతం చేయడం సర్వపండితైకవేద్యమే ! కాబట్టి సంస్కృతమే సమస్త భాషలకు తల్లి అన్నవాదం వరాస్తమైంది.

---

1. అముక్తమాల్యద – ఉపోద్ఘాతము — పుట 39.
2. దేశభాషలలోని దేశ్యభాగం : తెలుగులో కొత్త వెలుగులు—పుట 23.
3. అప్పకవీయము – ప్ర. ఆ. 71-81.
4. పై రెండో దానిలోదే పుట – 121.

ప్రాకృతం మొదలగు దేశభాషలకంటే తమిళం, కన్నడం, మొదలగు ద్రావిడ భాషలకంటే తెలుగు విశిష్టమైందిగా చెప్పబడింది. సంస్కృతమే సర్వ దేశభాషలకు జనని అనీ, ఆ దేశభాషల్లో శ్రేష్ఠమైంది తెలుగనీ, సౌభాగ్య సంపదలో తల్లికంటె ఆడుబిడ్డే మేలనీ శ్రీనాథిరామకర్త చెప్పినట్లు పూర్వోక్తం. ఇంతకంటే కృష్ణదేవ రాయలు చెప్పిన మాటలు విశిష్టంగా ఉన్నాయి. తెలుగు దేశభాషల్లో ఎలా గొప్పదో చెప్పబడింది. 'తెలుగదేల ....' అన్న కృష్ణదేవరాయల పద్యానికి వ్యాఖ్య వ్రాస్తూ, వేదం వేంకటరాయశాస్త్రిగారు, "కన్నడ రాయఁడవైన నిన్ను కన్నడ ములో చెప్పుమనక, మఱియే భాషలోఁగాని చెప్పుమనక తెనుఁగుననే చెప్పుమని యెద నేల యనఁగా అందులకు ఈ వక్ష్యమాణ కారణము లున్నవి. ఒకకారణము- ఇది తెలుగు దేశము, రెండవకారణము – నేను తెలుఁగు దేశము నభిమానించిన వల్లభరాయఁడను, మూడవకారణము – ఆ రెంటి కంటెను గొప్పది అది యేమన, తెలుఁగు బాస యనఁగా పలుకందముగదా; నానా భాషలాడు రాజులు నిన్నుఁగొలుచు నప్పుడు వారితో నాయా భాషలాడి దేశభాషలన్నిటిలోను తెలుఁగు భాషలో నాయు త్కృష్టను నీవు కనిపెట్టియుండలేదా ?"[5] అని ఆంధ్రవిష్ణువు చెప్పినట్లు వివరిం చారు. సంస్కృతం కంటే ప్రాకృతం సుకుమారమైన భాష అని రాజశేఖరుడు చెప్పగా, అంతకంటే గూడ అతిసుకుమారమైన భాష తెలుగని అంటారు గిడుగు సీతాపతిగారు. "అయితే తెలుగు పదములలో గల లాలిత్యము నే నెక్కువగా కొని యాడుతాను. రాజశేఖర కవి కర్పూరమంజరిలో—

'పరుషాః సంస్కృత గుంఫాః
ప్రాకృత గుంఫస్తు భవతి సుకుమారః,
పురుష మహిళానాం యావ
ది హాంతరం తేషు తావత్" (ఇది ఛాయ)

ప్రాకృత పదములకంటెను సుకుమారములైనవి తెలుగు పలుకులు."[6] తెలుగు భాషకు ఇంతటి ఉత్కృష్టత కలగడానికి కారణం మనం తెలుసుకోవడం అవసరమే.

---

5. ఆముక్తమాల్యదా సంజీవని – పుట 20.

6. తెలుగు నుడికారము – సాహిత్యోపన్యాసములు — 1 పుట 43.

"సహజముగా ద్రావిడ లక్షణములను బట్టి సరళమును, సుకుమారమును అయిన తెలుగువాణి, కాలక్రమమున గాంభీర్య పటుత్వముల నలవర్చుకొని, తల్లికిని అక్కచెల్లెండ్రకును లేని క్రొత్త సొగసు దనము కైసేసికొన్నది. పరస్పర భిన్నములైన ఆర్య ద్రావిడ భాషలను రెంటిని ఒక్కచోట, సమ్మేళనమొనర్చి సమరస భావము సాధించినది కావుననే, తెనుగు పలుకు ఆ రెంటికినిలేని, గుణాతిశయమున విలసిల్లుచున్నది."[7] ఇంకా పింగళివారిలా అన్నారు "మేలిపూవులను ఏర్చే నేర్పుగల మాలకరి గ్రుచ్చిన దండవంటిది తెలుగు. తన సారళ్యానికి ఈడైన సంస్కృత ప్రాకృత శబ్దాలను ఏర్చుకొని తనమెత్తని మాటలలో పోహళించటానికి పనికివచ్చే సంస్కారాలను వాటికిచేసి తనలో కలిపి వేసుకొన్నది తెలుగు నెఱజాణ. సంస్కృతంలో ఇలా క్షీరనీరన్యాయంగా కలిసిపోయే నేర్పు ఇతర ద్రావిడ భాషలకు కుదిరింది కాదు. ఈ మేలికలయికే తెలుగుకు నిండుదనంతోపాటు అనన్యమైన శ్రవణ సుభగత్వం సంపాదించి పెట్టింది."[8]

తెలుగు భాషలోని మాధుర్యమూ, సారళ్యమూ అనే గుణాలు సంగీతానికి మిక్కిలి ఉపకరించాయి. కనుకనే తెలుగు గానానికి అనుకూలించింది. దీనికి భాషలోని యతి ప్రాసలు సైతం బహుధా ఉపకరించాయనడంలో సందేహం లేదు "జయదేవాదులు సంస్కృతాన్ని బుద్ధిపూర్వకంగా సంగీతానికి ఒదిగించుకొంటే, సంగీతమే ఏరికోరి తెలుగును వరించింది. దక్షిణ దేశ వాగ్గేయకారులంతా ఈ రహస్యాన్ని గుర్తించాటనీ వేరే చెప్పనక్కరలేదు ?"[9] అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్య మొదలైన వాగ్గేయకారులీ తెలుగు భాషను బహుమానించి పదాలు, కృతులు రచించి ధన్యులయ్యారు. వాటి మూలంగానే తెలుగు స్థిరంగా నిలిచిపోయింది. తమిళనాడులోని గాయకులు సైతం త్యాగరాయ కృతులను తెలుగు భాషలోనే ఆలాపించవలసిందే. కనుకనే రాయప్రోలు సుబ్బారావుగారు తమ ప్రబోధంలో —

'తన గీతి యరవజాతిని పాటకులనుగా
దిద్ది వర్ధిలిన తెనుగు వాణి".

---

7. పింగళి లక్ష్మీకాంతంగారు : గౌతమ వ్యాసములు — పుటలు 2, 3.
8. తెలుగు సాహిత్యం - నా రేడియో ప్రసంగాలు — పుట 99.
9. పైదే — పుట 100.

అని ప్రస్తుతించారు. ఇంతేగాక పాశ్చాత్యులు సైతం తెలుగు భాషలోని శ్రావ్యతను ప్రశంసించడం గమనించదగ్గది.

"In respect of antiquity of culture and glossorial copiousness, Telugu is generally considered as ranking next to Tamil in the list of Dravidian Idioms, whilst in point of euphonic sweetness it justly claims to occupy the first place"[10]. అని కాల్డ్వెల్ పండితుడు ద్రావిడ భాషలందు తెలుగు శ్రావ్యతా మాధుర్యంలో ప్రథమ స్థానాన్ని ఆక్రమిస్తుందని వివరించారు. ఇంకా పాశ్చాత్యులు తెలుగు భాషా మాధుర్యాన్ని గూర్చి చెప్పిన మాటలను గిడుగు వారిలా పేర్కొన్నారు. "పాశ్చాత్య దేశమునందలి భాషలలో ఇటాలియన్ భాష ఎంత మధురంగా ఉంటుందో అంత మధురంగా ఉంటుంది తెలుగు భాష. తూర్పు దేశమునందలి భాషలలో అనే అర్థములో Telugu is the Italian of the East అని అనేక భాషలు విన్న పాశ్చాత్య పండితులు మన తెలుగు భాషా మాధుర్యమును కొనియాడినారు. ఆ మాధుర్యము భాషిస్తూ ఉన్నప్పుడు వారు వీనుల విందుగా విని గ్రహించినదేగాని పుస్తకములలో నున్నది చదివి తెలుసుకున్నదికాదు. ఆడిన మాటలకు అర్థము తెలియకపోయినా అవి చెవిని పడినంతనే అందులోగల మాధుర్యము గోచరిస్తుంది. అనగా ఆ మాటల ఉచ్చారణలోనే సహజ సిద్ధమైన తియదనమున్నదన్నమాట."[11] ఈ విధంగా పాశ్చాత్యుల మన్ననలకు పాత్రమైన మన తెలుగు తియ్యందన మెంతటిదో స్పష్టమవుతుంది. ఇట్లే ఓ కన్నడ మిత్రుడు సైతం తెలుగ తేటను, "కన్నడకస్తూరి, తెలుగుతేట" అని పేర్కొన్నాడు. ఇది నిజంగా తెలుగువారికి గర్వకారణం !

ఇలాంటి తరితీపులతో నన్నయ నాటినుంచి నేటివరకు వెలసిన తెలుగు సాహిత్యంలోని తియ్యందనాన్ని దిఙ్మాత్రంగా పరిశీలించి రుచి చూద్దాం. వాస్తవానికి నన్నయకు పూర్వం ఆరోశతాబ్దంనుంచి తెలుగు శాసనస్థమై వికసించింది. అంతేగాక జానపదులలో గేయరూపంలో అనేకవిధాల జీవిస్తూ వచ్చింది .రామాయణం, శ్రీకృష్ణ లీలలు, శివమహిమలు మొదలైన పురాణ ప్రసిద్ధ విషయాలేగాక, కేవలం ప్రజల

---

10. A Comparative Grammar of the Dravidian or South Indian Family of Languages – P. 25.

11. పై ఆరోదానిలోదే పుట — 41.

జీవనవిధానమంతా జానపదగేయ సాహిత్యంలో అద్దంపట్టినట్లు కనిపించి సహృదయ హృదయాలను అలరిస్తుంది. ఇది అనంతం. ఇలాగా పామరజన సందోహానికి వినోదమూ, శ్రమాపనోదకమూ అయి జానపద గేయ సాహిత్యముంటూన్నప్పటికీ పండిత జనసముదాయానికి, ఆనందమూ, విజ్ఞానమూ చేకూర్చటానికి రాజుల అండదండలతో నన్నయతో తెలుగు సాహిత్యం ఆరంభమైంది. నన్నయ దగ్గర్నుంచి శ్రీనాథుని వరకు గల కాలం అనువాద యుగంగా ప్రసిద్ధిపొందింది. కవిత్రయం ఆంధ్ర భారతాన్ని స్వతంత్ర కావ్యంలాగే అనువదించి ఉండడం గమనించదగ్గది. భాగవతానువాదం భక్తపోతన వశంగావడం ఆంధ్రుల మహద్భాగ్యం. ప్రబంధ రచనకు దారి చూపిన శ్రీనాథుడు ప్రశంస్యుడు. ఇందు కెంతగానో ఉపకరించిన నాచన సోముని నవీన గుణాలు విస్మరించలేము. నన్నయ తిక్కనల నడిమికాలంలో వెలసిన శైవభక్తి పారమ్యమైన జానుతెనుగులోని కవితకు కారకులైన పాల్కురికి సోమనాథుడు మన కారాధ్యుడు

'ఉరుతర గద్య పద్యోక్తుల కంటె
సరసమై పరగిన జానుఁదెనుఁగు
చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ
గూర్చెద ద్విపదలు గోర్కి దైవాఱఁ
దెలుఁగు మాటలనంగవలదు; వేదముల
కొలఁదియ కాఁ జూచుకొనుఁడి నెట్టులనినఁ
బాటి తూమునకును బాటి యౌనేనిఁ
బాటింప సోలయుఁ బాటియో కాదె
అల్పాక్షరముల ననల్పార్థ రచన
కల్పించుటయె కాదె కవి వివేకంబు' (బసవపురాణం – పుటలు 8, 9)

అని ప్రతిన బూనిన సోమన సామాన్యుడా ? వీరి మూలంగానే తెలుగుదనం పరిరక్షితం కావడం విశేషం ! భారత భాగవత రామాయణాలేకాక సంస్కృతంలోని రసవత్తర కావ్యాలన్నీ ఈదశలోనే అనూదితమై తెలుగు సాహిత్యానికి పుష్టినితుష్టిని ఇచ్చాయి. కొన్ని స్వతంత్ర కావ్యాలున్నా ఈదశను అనువాద యుగం అనడమే

సముచితం. తెలుగు తియందనాన్ని రుచి చూపిన వారిలో మహాకవి తిక్కన అగ్రేసరుడు. తెలుగు పలుకుబళ్ళు, నుడికారం, తెలుగుదనం మొదలైన ఉత్తమ గుణాలకు తిక్కన కవిత కాణాచి. కౌరవసైన్యోద్ధత్యాన్ని, చూచి భయభ్రాంతుడైన ఉత్తరుడు వెనుదిరిగి పోవడం సముచితమని బృహన్నలతో చెప్పినా వినక, అర్జునుడు తేరు పోనిచ్చినపుడు —

"దవ్వుల విరిగినఁ బౌరులు
నవ్వు దురదె మేలుమేలు ననునాఁగకు పీ
క్రొవ్వఱుగదేనిఁ దలపడు
మెవ్విధిఁ జనితేని ననుచు నెత్తినభీతిన్" (విరాటపర్వం 4 - 69)

శరశరాసనాలు రథంపైనే వదలి పెట్టి, రథం మీదనుంచి దూకి పరువెత్తిపోయాడట ! దూరంగా ఉండగానే మనం వెనుదిరిగిపోతే పౌరులు వచ్చి కూడ గలరా ? చూపిన నవ్వగలరా ? భేష్, భేష్ నన్ను ఆపకు. నీక్రొవ్వఱుగ దేని ఎట్లాగైనా శత్రువుల నెదుర్కో; అంటూ భీతితో పరుగెత్తిపోయాడట. ఈమాటల్లో తెలుగుదనం ఉట్టిపడుతూంది. 'నీక్రొవ్వఱుగదేని' అన్నమాట అచ్చమైన తెలుగు నాటిమాట. కీచకుడు ద్రౌపదిని అవమానించిన సందర్భంలో ప్రళయోగ్రానల సన్నిభమైన కోపాటోప ఘూర్ణిత మనస్కుడైన భీముని తిక్కన వర్ణించిన విధం మిక్కిలి సహజ సుందరమై సందర్భ శుద్ధితో ఒప్పారుతూంది !

'నేలయు నింగియుఁ దాళముల్గాఁ జేసి
యేపునరేఁగి వాయించి యాడఁ
గుల పర్వతంబులు గూర్చి యొండొంటితోఁ
దాఁకంగ వీఁకమైఁ దన్నియాడ
నేడు సాగరములు నిక్కడక్కడఁ బెట్టి
పెలుచని రొంపిమై నలఁది కొనఁగ
దిక్కులు నాలుగు నొక్క చోటికిఁదెచ్చి
పిసికి పిండలిసేసి పిడుచ గొనఁగ

మిగిలి బ్రహ్మాండ భాండంబు పగులవేయ
నప్పళించుచుఁ బ్రళయకాలానలమున
గండరించిన రూపంబు కరణి భీముఁ
డతి భయంకరాకారత నతిశయిల్లె"

(విరాటపర్వము — 2-134)

అవమానితయయిన భార్య దుఃఖస్థితిని గాంచిన భర్త మానసిక పరిస్థితిని తిక్కన ఎంతో విస్పష్టరేఖలతో చిత్రించి అవమానించిన దుర్మార్గుని హతమార్ప దలచిన అతని క్రోధస్ఫూర్తిని అవగతం చేశా డీ పద్యంలో. శబ్దాడంబరంలేక సమాస భూయిష్ఠరచనలేక, తెలుగు పలుకులనే వాడి భీముని క్రోధ ఘూర్ణిత మానసాన్ని స్పష్టం చేయడం గమనించదగ్గది. అదే మహాశిల్పి అయిన రసజ్ఞుడైన కవి లక్షణం! భారతం అనువాదమే అయినా తిక్కన చేతి ఘంటంనుంచి జాలువార్చి స్వతంత్రమై వెలసింది ఇట్లే శ్రీనాథునిలోను తెలుగుదనానికీ, నుడికారానికీ, కొదవ లేదు. అందుకు చక్కటి ఉదాహరణ ఈ పద్యం —

'తల్లి మదేక పుత్రక, పెద్ద, కన్నుల
గాన, దిప్పుడు మూడుకాళ్ళ ముసలి,
ఇల్లాలు కడుసాధ్వి, ఏమియు నెఱుగదు,
పరమ పాతివ్రత్య భవ్యచరిత,
వెనుక ముందరలేరు నెనరైన చుట్టంబు,
లేవడి యె తేని జీవనంబు,
కొనక కన్న సంతానంబు శిశువులు,
జీవనస్థితి కేన తావలంబు,
కృపఁదలఁపగదవయ్య యో నృప వరేణ్య!
అభయమీవయ్య యో తుహినాంశువంశ!
కావగదవయ్య! ఆర్తార్తి కల్పశాఖి!
నిగ్రహింపకుమయ్య యో నిషధ రాజ! (శృంగార నైషధం)

నలుడు హంసను పట్టుకొన్నప్పుడు, నలునితో హంస పల్కిన ఈ మాటల్లో తెలుగు తీయందనమూ, పలుకుబళ్ళూ స్పష్టం.

తెలుగులోని స్వతంత్ర కావ్య రచనా కాలమే ప్రబంధ యుగం. శ్రీకృష్ణదేవరాయల కాలంలోని ప్రబంధాలు అపూర్వమై వెలసినవి. కృష్ణదేవరాయలు స్వయంగా రాజకవి, కవిరాజునై ప్రబంధ రచనకు దోహదం చేశాడు. పెద్దనాదులు వివిధ ప్రబంధ రచనాధురీణులై తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నంచేశారు. పూర్వోక్తమైనట్లు పులకండంవంటి తెలుగులో ఆముక్తమాల్యదను రచించి ధన్యుడయ్యాడు రాయలు. మచ్చుకు—

"శయ పూజాం బుజముల్ ఘటింఁదడఁబడన్, జన్దోయిలేఁగౌనుపై
దయఁదప్పన్ బసుపాకి, పొగడపుఁ బానంబొప్పఁ జెంగల్వడి
గ్గియ నీరచ్యుత మజ్జనార్థము గటింగీలించి, దివ్య ప్రబం
ధయుగాస్యల్ ద్రవిడాంగనల్ నడుతురుద్యానంపులోత్రోవలన్"

(ఆముక్తమాల్యద — 1-56)

ఇదెంత సహజసుందర వర్ణనమో సహృదయైకవేద్యం ! సుగాత్రి శాలీనుని పరిజేరి అనిన మాటలు.

"అకటా ! యేమని దూఱుదాన మిము ? నాథా ! వేగుజామయ్యెఁ బొం
దికగాఁ బాదము లొత్తరమ్మనుట గానీ, యొంటి యేమోకదా ?
నికటక్షోణికి నేఁగు దెమ్మనుటగానీ, కొంత నెయ్యంపు టూ
నికతోఁ గన్నులు విచ్చి చూచుటయు కానీ, లేద యొక్కింతమున్"

(కళాపూర్ణోదయము — 4-116)

ఇందులో పింగళి సూరన సుగాత్రి మానసికవేదనను సుస్పష్టంచేశాడు. ఇది తెలుగు తీయందనానికి చక్కటి ఉదాహరణ. ఇట్లే ఈ ప్రబంధ యుగంలోని మన

మగుదుముగాక !"[13] ఇలాంటి మన తెలుగు భాష ఆధునిక విజ్ఞానాన్ని సర్వత్రజ
నీకానికి పంచిపెడుతూ అధికారభాషగా వ్యవహరించే తరుణంవచ్చింది సర్వవిధాల
సమర్థవంతంగా పై కార్యనిర్వహణ గావించినప్పుడే "దేశ భాషలందు తెలుగు
లెస్స" అన్న మాటలు సార్థకం కాగలవు। అలాంటి మన ఆకాంక్ష తప్పక ఫలిస్తుం
దని ఆశించవచ్చు !

[అఖిల భారత తెలుగు సాంస్కృతికోత్సవాల ప్రత్యేక సంచిక, 23-3-1974]

13. పై ఎనిమిదో సూచికలోనిదే — పుట 106.

# త్రిపురాంతకోదాహరణము - ఒక పరిశీలన

సుప్రసిద్ధ ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటైన శ్రీశైలం పేరెన్నికగన్న పవిత్ర శైవక్షేత్రం. అందు మల్లికార్జున నామంతో సకలపాప సంహారి త్రిపురారి వెలిశాడు. ఈ శ్రీశైలమునకు నలుగడల నాలుగు వాకిళ్లగలవు తూర్పున త్రిపురాంతకం, పశ్చిమంలో బ్రహ్మేశ్వరం, ఉత్తరంలో మాహేశ్వరం, దక్షిణాన సిద్ధవటం అనునవిగలవు. వాటిలో వరుసగా త్రిపురాంతకుడు, బ్రహ్మేశ్వరుడు, మాహేశ్వరుడు, సిద్ధవటేశ్వరుడు—అనేవారు అధిష్ఠానేశ్వరులు. అందు త్రిపురాంతకాన కథానాథుఁడైన త్రిపురాంతకునిపై రావిపాటి త్రిపురాంతక కవి త్రిపురాంతకోదాహరణమనే నామంతో ఉదాహరణం రచించినాడు. త్రిపురాంతక నికటస్థ పర్వతానికి కుమారగిరి యనే పేరుంది.

త్రిపురాంతక కవి కాలాదికాన్ని గూర్చి, అతని గ్రంథాల గూర్చి కీ॥ శే॥ మానవల్లి రామకృష్ణకవిగారూ, నిడుదవోలు వేంకటరావుగారూ — బహుధా పరిశోధించి అనేకామూల్య విషయాల్ని కనుగొన్నారు త్రిపురాంతక మాతని జన్మస్థలం. కాలం 14 వ శతాబ్ది ఇతడు త్రిపురాంతకోదాహరణమేగాక అంబికాశతకం, చంద్రతారావళి, మదన విజయాలను వాటిని ఆంధ్రంలోను, శ్రీనాథుని క్రీడాభిరామానికి మాతృక అయిన ప్రేమాభిరామాన్ని సంస్కృతంలో రచించాడు కాని త్రిపురాంతకోదాహరణం మాత్రమే సమగ్రంగా లభిస్తుంది. మిగిలిన వాటిలో కొన్ని పద్యాలు మాత్రమే లభించాయి. వాటిలో త్రిపురాంతకుని కవితా వైశిష్ట్యం గోచరిస్తూంటుంది.

ఆంధ్ర వాఙ్మయమున దేశికాఖ్యలలో ద్విపద రచనలు, శతకాలు, ఉదాహరణాలు, యక్షగానాలు — ముఖ్యమైనవి. వీటిలో ఉదాహరణం లలితపద సంయోజన కలిత మనోజ్ఞ లఘుకృతి. పాల్కురికి రచించిన బసవోదాహరణమే ప్రథమోదాహరణం. ఇతడు సంస్కృతంలోను బసవోదాహరణం రచించాడు. త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణం ద్వితీయం. తరువాత తెలుగులో అనేకోదాహరణాలు వెలశాయి. వేంకటేశ్వరోదాహరణం, హనుమోదాహరణం, శ్రీకృష్ణోదాహరణం,

— త్రిపురాసుర సంహారంలో విష్ణువు బాణముగ నుపయోగింపబడెను. యుద్ధానంతరం బాధామైన విష్ణువును లక్ష్మీదేవి 'చెంతకుఁ జేర్చి' యనుటను "శ్రీచను దోయిపై శరముఁ జేర్చి" యని రచించి తన సున్నితమైన శృంగార ప్రియత్వాన్ని విస్పష్టం జేశాడు త్రిపురాంతకుడు ఇట్టిది అతని శృంగారంలోని ఆసక్తి

మనోహర వర్ణనలు గావించడం కవులన్న వారందరికి సాధ్యమయ్యే పని కాదు. కవితా నిర్భర హృదయుడైన కవి మాత్రమే అది చేయగలడు త్రిపురాంతకుడు విశాలమైన విషయాల్ని గ్రహించి, ఉత్కళికలలో మనోజ్ఞమైన వర్ణనలు గావించి, సహృదయ హృదయాల కానందం గల్గించి, మెప్పించినాడనటంలో సందేహంలేదు. కిరాతార్జునీయం, శివుడు మన్మధుని జయించటం, త్రిపురాసుర సంహారం, గుండయకథ దక్షాధ్వరధ్వంసం — మున్నగు విషయాలను వర్ణించి తన వర్ణనా వైదగ్ధ్యాన్ని ప్రకటించాడు. తృతీయావిభక్తిలోని ఉత్కళికలో త్రిపురాసుర సంహారం అభివర్ణితం.

"ఇల రథంబు లీలనొప్ప । నలువ నిగమ హరుల నొప్ప ।
బోసఁగ చాపనారిఁబట్టి । పసిడికొండ నెక్కుపెట్టి ।
బడధి నిద్రవోవు శరము । దొడఁగి నేలఁ గూలఁబురము
తిసియున్న జోదుచేత । దాస వరకణాదుచేత"

— ఇందు శివుఁడు త్రిపురాసురులను సంహరించిన విధం ఇంత సంక్షిప్తంగా మనోజ్ఞంగా వర్ణించడం ఇతరులకు కష్టసాధ్యమే. మచ్చుకి మరో ఉదాహరణ. పంచమీ విభక్తిలోని ఉత్కళిలో —

"తనకినకలోఁబుట్టి । కనలిదక్షునిఁ గొట్టి
యదరిపేల్పులఁ బరచి । తొడరి జన్నము చెఱచి
వీరభద్రుఁడు వచ్చి । చేరి మ్రొక్కి మెచ్చి
అలరు నిత్యుని వలన । దళితదైత్యుని వలన"

— అని దక్షాధ్వరధ్వంస వర్ణన మిక్కిలి హృదయంగమం. దీనిని కాదన గల సహృదయుడుంటాడా? ఇట్టిది ఉత్తమ వర్ణనా వైదగ్ధ్యం. ఇచట త్రిపురాంతకుని

అర్ధనారీశ్వర వర్ణన పేర్కొన్న దగ్గరి ద్వితీయా విభక్తి యందంనంగా వర్ణించాడు.

ఉ॥ "పామును హారమున్, నెలయుఁ బాపట పేసయు, నేలు మల్లికా
దామము, తోలుదుప్పలువ, దట్టపు భూతియుఁ జందనంబుమై
సామునఁ జాలనందముగ సన్నిధిఁజేసిన జాడఁగంటినే
నామదిలోఁ గుమారగిరి నాథుని శైలసుతాసనాథునిన్ —

ఇందులోని అర్ధనారీశ్వర వర్ణన శ్రీనాథుని భీమ ఖండంలోని

సీ॥ చంద్ర బింబానన చంద్ర రేఖామౌళి
నీలకుండల భార నీలగళుఁడు"

అన్న వర్ణనతో నేమాత్రము తీసిపోదనటం సత్యదూరంగాదు.

చమత్కారయుత రచనా పాటవం త్రిపురాంతకుని కవితా లక్షణాల్లో ఒకటి. చమత్కారానికి, త్రిపురాంతకోదాహరణమంతా ఉదాహరణమే. అందువర్ణితమైన ప్రతివిషయమూ, ప్రతి సన్నివేశమూ సహృదయ హృదయాలని హరించివేస్తాయి. శివుడు "శైలజాముఖ చంద్రరోచుల - చవుల దవిలెడు నవచకోరమ"ట. 'భావ వీథులఁగలసి పలుకులఁ బట్టి చెప్పగరాని చక్కటి', 'ఆలురేకుల మంత్ర కుసుమము —నందు వెలిగెడు చంచరీక ము'నట. త్రిపురదహన సమయంలో బాణమైన విష్ణువును' జలధి నిద్రవోవు శరమని చమత్కరించాడు. ఈశ్వరుడు దిగంబరుడని చెప్పడానికి — "మఱియును మెఱయఁగ దిశలనియెడు నునుమడుగులు గట్టిన శృంగారి" అనీ, శివుడు త్యాగి అనడానికి "ఏటికి బోటికి జడలును నొడలును — నిచ్చిన జగదేక త్యాగికి" అనీ చమత్కార చారువుగా రచించాడు. ఇలాంటి ఉదాహరణల నెన్నింటినైన జూపవచ్చు.

శివకవులలో ప్రసిద్ధుడైన పాల్కురికి సోమనాథుడు జానుతెనుగునే ప్రయోగిస్తాననీ, అల్పాక్షరాలతో అనల్పార్థరచనగావిస్తాననీ ప్రతిన బూని సాధించ లేక

పోయాడు. కాని అట్టి ప్రతినలేకుండానే తల్లక్ష్యాల్ని సాధించినవాడు తిక్కనార్యుడు. అదే విధంగా త్రిపురాంతకుడూ అలతి అలతి తెలుగు పలుకులతో త్రిపురాంతకోదాహరణం రచించాడు. ఇందుకీ లఘుకావ్యమంతా ఉదాహరణమే. అంతేగాక "జూటభాస్వత్తుహినధాముఁడు" వంటి సంస్కృత సమాసాలు లేకపోలేదు. సమాస జటిలమైన రచన కుదాహరణగా క్రింది పద్యం పేర్కొనవచ్చు. 'చంద్రతారావళి'లో—

మ॥ "చరమక్ష్మాధర చాపసింహముఖదంష్ట్రా కోటియో నాగ శం
బర శార్దూల నఖంబు నాఁగఁ దిమిరేభ ప్రస్ఫురద్గర్వ సం
హరణ క్రూరతరాంకుశంబనఁగ నుద్యల్లీల మీరేఖ ని
త్యరుచిం బోల్పగఁ బెంపగున్విదియ చంద్రా ! రోహిణీవల్లభా!"

అని వర్ణించాడు. ఇట్లు మనోజ్ఞమైన కవితా లక్షణాల కొలవాలమైనదేః రచనల కెక్కువ ప్రాధాన్యం రాలేదు. అందుకు కారణం నిడదవోలు వేంకటరావు గారి విధంగా పేర్కొన్నారు. "పద కవిత యందలి యనాదరణముచే సంస్కృతాలంకారికులును, వారి ననుసరించి తెలుఁగు లాక్షణికులు నుదాహరణములను క్షుద్ర కావ్యములలోఁ జేర్చిరి". అయినా ఇతర కావ్యాలతో ఇవి తీసిపోవు. "ప్రాచీన కాలమున వెలసిన యుదాహరణములు ప్రశస్త కవితా సమన్వితములై కావ్య గౌరవమును బడసినవి. పరిమాణమునఁ జిన్నవయ్యును ప్రతిభా సంపత్తిని మిన్నలై శబ్దార్థ ప్రతిపత్తిని గలిగియున్న"వని వారే నుడివియున్నారు. ఉత్తమ కవితా లక్షణాలతో కూడిన ఉదాహరణం రచించి తరించాడు త్రిపురాంతకుడు.

ఇట విశ్వనాథ సత్యనారాయణగారు ఉదాహరణాఁగూర్చి చెప్పిన మాట లను సంధించడం అవసరం.

"ఉదాహరణ కావ్యముయొక్క గొప్పదనమిట్లను కొందును.
జగత్తయుఁ గ్రియారూపము
సర్వక్రియయుఁ బరమేశ్వరునందుఁ బర్యవసించును.
ధాతువు సర్వదా విభక్త్యాశ్రయము.
ఏ విభక్తికో సంబంధము లేక క్రియయుండదు.

అందుచేత అన్ని విభక్తులతోఁ బరమేశ్వరుఁ జెప్పినపుడు భగవంతుఁడు సర్వ క్రియా స్థాన భూతుఁడని వ్యంగ్యము. ఇది యుదాహరణ కావ్య రహస్యము."

కనుకనే సార్వ విభక్తికపద్యంతో ముగించడం సముచితమని భావిస్తాను

శా॥ "నీ వాద్యుండవు, నిన్నుఁ దెల్పుఁ జదువుల్ నీచేత మేలొంద నీ
కై వాక్పూజ లొనర్తు, నీ వలన బ్రహ్మాండావళుల్ పుట్టు నీ
కే వేల్పుల్సరి, యన్యదైవ భజనంబే నొల్ల, నీ యందు మ
ద్భావంబుందదగుఁ గుమార గిరినాథా ! చంద్ర చూడామణీ!"

(శ్రీశైలప్రభ, ఫిబ్రవరి, 1966)

# శ్రీ కృష్ణదేవరాయల లోకవృత్త పరిశీలన

శ్రీ కృష్ణదేవరాయలు సాహితీ సమరాంగణ సార్వభౌమ బిరుదాంకితుడు. కాబట్టి కదనరంగంలో అరివీర భయంకరుడై విజేత అయినట్లే, కలం బట్టి కవితా రంగంలో సైతం కవి పండిత లోకాన్ని మెప్పించి ఘనత వహించినాడు రాయలు రాజ కవియేకాక, కవిరాజును. భువన విజయనామక సభాంగణంలో కవుల సమూహంలో తేజో విరాజమానుండై ప్రకాశించినవాడు సర్వకళాభిజ్ఞుడు. సర్వోత్తమ కవి. సొంతంగా తాను కవి కావడంవల్ల కవితా మర్మమెరిగి కవులను పోషించి, ఆంధ్ర వాఙ్మయంలో ప్రబంధ కవితాసృష్టికి కారకుడై ఆంధ్ర ప్రజలకు చిరస్మరణీయుడైన కవితల్లజుడు. ఆంధ్ర ప్రబంధాల్లో మిక్కిలి ప్రౌఢప్రబంధం రాయల ఆముక్తమాల్యద. సంస్కృత సమాస భూయిష్ఠ రచనలోను, అలతి యలతి తెలుగు పలుకుల ప్రయోగంతో కూడిన రచనలోను సిద్ధహస్తుడు రాయలు అందునా యితడు లోకవృత్త పరిశీలనా దక్షుడు. నిశితమైన ప్రకృతి పరిశీలనలో ఆంధ్ర వాఙ్మయంలోనే యింతటి కవి మరొక్కడు లేడంటే సాహసం కాజాలదు. రాయల లోకవృత్త పరిశీలనా దక్షతను దిఙ్మాత్రంగా పరిశీలించడమే ఈ వ్యాసోద్దేశం.

కవికి ముఖ్యంగా ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసాలనే మూడు లక్షణాలవసరమన్నది లాక్షణికమతం. నవనవోన్మేషశాలిని అయిన ప్రజ్ఞయే ప్రతిభ "ప్రజ్ఞానవనవోన్మేషశాలినీ ప్రతిభామతా" అని కదా! ఇది కవిలో స్వయం సిద్ధమైన గుణం దీనికితోడు వ్యుత్పత్తి అత్యవసరం. బహుగ్రంథ పఠన జన్య జ్ఞానం వ్యుత్పత్తి అనగా శాస్త్ర పరిజ్ఞానం దీనిలోనే అంతర్లీనమైన మరో అంశం సైతంవుంది. అది లోకవృత్త పరిశీలన; సదవగాహన, వీటికి తోడు అభ్యాసముంటే తప్పక కవి కర్మ రాణిస్తుంది అందుకే మమ్మటుడు తన కావ్యప్రకాశంలో

"శక్తిర్నిపుణతాలోక శాస్త్రకావ్యాద్యవేక్షణాత్ !
కావ్యజ్ఞ శిక్ష యాభ్యాస ఇతిహేతుస్తదుద్భవే"

—అని నిర్వచించినాడు.

అనన్య సామాన్యమైన ప్రతిభా సంపదతోపాటు, పాండిత్య ప్రకర్ష, అనితర సాధ్యమైన లోకవృత్త పరిజ్ఞానం మొదలైన వాటితో విలసితుడు కృష్ణదేవరాయలు. లోకవృత్తాన్ని నిశితంగా పరిశీలించి, తదుచితంగా రచన సాగించినవాడు. చీమ మొదలు సర్వజీవకోటి సృష్టికర్త అయిన బ్రహ్మ వరకు, సర్వవిషయ సమ్యక్పరిశీలనతో రాయల ఆముక్తమాల్యదలో మనం దర్శించగలం.

మహా రాజాధిరాజులు మొదలుకొని అతి సామాన్యులైన ఆరెకుల వరకుగల సమస్త ప్రజాజీవన విధానాన్ని సమ్యక్పరిశీలన గావించి సంపూర్ణంగా గ్రహించి తదుచితరీతిని ఆముక్తమాల్యదలో వర్ణించి కృతకృత్యుడయ్యాడు రాయలు

అనాటి ప్రజలు ఎంతటి ప్రవృత్తి భోగాసక్తులో అంతటి నివృత్తి భోగం లోను అభినివేశం కలవారు. ఈ విషయం పాండ్యరాజు, విష్ణుచిత్త, యామున, ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానాలలో స్పష్టమవుతుంది. రాజవైభవ వర్ణనలకు పాండ్య రాజుకథ, యామునాచార్యుడు ప్రభువైన వెనుకటి కథ ముఖ్యోదాహరణలు. అనాటి శిష్యులూ విష్ణుభక్తి పరాయణులూ అయిన బ్రాహ్మణుల జీవనవిధానం వాళ్ళ ఆతిధ్య భ్యాగతులను విష్ణు స్వరూపులుగా ఎంచిన విధం సంపూర్ణంగా చిత్రించాడు రాయలు. "ఎదురేగి సాష్టాంగ మెరగి పాద్యంబిచ్చి నారికేళ కటాసనముల నునిచి" (1-76) అన్న పద్యంలో విలుబుత్తూరిలోని భాగవతులు అతిధులుగా విచ్చేసిన భాగవతుల కర్పించిన ఆతిధ్యం సర్వం స్పష్టంచేశాడు రాయలు. భాగవతోత్తముడు విష్ణుచిత్తుడు. ఈతని అతిధి పూజావిధానం అమోఘం —

"న్యాయార్జిత విత్తంబున
నా యోగేశ్వరులకు పెట్టు నన్నం బ్రాహ్మ
లేయ పటీరాచల ప
ద్యాయాతయాత వైష్ణవావలికెల్లన్. (1 79)

అట్టిది అతని ఆతిధ్యం. "గగనము నీటిబుగ్గ కెనగా జడివట్టిననాళ్ళ...." (1-80) అనే పద్యంలో విష్ణుచిత్తుడు వర్షాకాలంలో భార్య కన్నులకు పొగ తగల నీక, అతిధుల కర్పించిన భోజనాదికం వర్ణితం. "తెలనులి వెచ్చయోగిరము ..." (1-81) పద్యంలో వేసవిలోను, "ఘనుగుందావి " (1 82) పద్యంలో శీతా

కాలంలోను అతడు చేసిన సంతర్పణలు ఆయా కాలోచితంగా ఉన్నట్లు అభివర్ణితం. ఆనాటి స్నానాదికాలు "కదళీ గభీర" (1-83) అన్న పద్యంలో వివరించబడ్డాయి. వీటన్నింట శ్రీకృష్ణదేవరాయలకు గల కాలోచిత భోజన స్నానాదుల గూర్చిన పరిచయం అభివ్యక్తమవుతుంది. అట్లే పాండ్యుని పట్టణంలో పరదేశి విప్రుడు పొందిన అతిథి సత్కారం "పరిపక్వ సురభి రంభా ఫలంబులతోడ .... (2-73) పద్యంలో మనోహరంగా చిత్రితం ఇందు పానకం వేసవి కాలోచితంగా ఉంది. ఆ విప్రుడు" మాత్ర సంచితలాడగా పెట్టుకొన్నాడట!" మరి పరదేశికదా! తదుచితం గానే రాయలు వర్ణించాడు.

అచ్యుత మజ్జనార్థం ద్రవిడాంగనలు నీరు తెచ్చే విధానం —

"శయ పూజాంబుజముల్ ఘటిందడబడన్ జన్దోయిలేఁగొనుపై

దయదప్పన్ బసుపాడి, పొగడపు బాదం బొప్ప జెంగల్వడి

గ్గియ నీరచ్యుత మజ్జనార్థము గటింగీలించి, దివ్యప్రబం

ధ యుగాస్యల్ ద్రవిడాంగనల్ నడుతురుద్యానంపు లో త్రోవలన్".(1-56)

పద్యంలో ఎంతో నిసర్గమనోజ్ఞంగా స్వభావోక్తిలో వర్ణించాడు రాయలు. ఇట్లే ద్రవిడ కన్యలు ఎండుగులు కావలా కాయడాన్ని సైతం "కలమపుటెండుగుల్" (1-75) పద్యంలో ఎంతో స్వాభావికంగా వర్ణించాడు. ఈనాడు గూడ ఈలాంటి దృశ్యాలు పల్లెపట్టుల్లో మనం చూడగలం కాకపోతే 'రురుశాబం' (దుప్పి పిల్లి) మనకు గోచరించకపోవచ్చు. అందుకు బదులు కోళ్ళు, బాతులు, దూడలు, మేక పిల్లలు మొదలైనవి కనిపించకపోవు. కనుక ఇది స్వాభావిక మనడం లో సందేహం లేదు ఇట్టిది రాయల లోకవృత్త పరిశీలనా దక్షత.

వర్షాకాలంలో రాత్రి సమయమందలి బాటసారులస్థితి "రయమున...." (4-1-1) పద్యంలో వర్ణితం. ఇది ఈనాడూ మనం పల్లెలలో చూడగలం. అట్లే డి వట్టిన నాళ్ళలో రెడ్ల భోజనం, జీవన విధానం "గురుగుం జెంచలి దుమ్మి ..." (4-134) అన్న పద్యంలో ఎంతో మనోహరంగా రాయలు వర్ణించి తన లోకజ్ఞ తను ప్రకటించాడు. ఇందులోని గురుగు, చెంచలి, తుమ్మి, లేత తగిరిసాకు, చింత చివురులతో కూరలు వండుకోవడం, 'క్రేపుల్మేయిన్నాకు' తూండడం మేక ఎరువుతో

కుంపటి పెట్టుకొని మంచంమీద కూర్చోవడం, మొదలైనవన్నీ రాయల లోకవృత్త సంబంధ నిశిత పరిశీలనకు పరమ నిదర్శనాలు. "వసతుల్వెల్వ్యకి " (4-133) అన్న పద్యంలో వర్షాకాలంలో కాపు వడతులు పొలాల్లోని భర్తల కోసం అంబళ్ళు కొనిపోయే వర్ణన లానాడు రైతుల ఇళ్ళలో సామాన్యమే ! ఇట్లే వేసవిలో గ్రామికులు ఏతమెత్తుతూ పాటలు పాడే సన్నివేశాన్ని ఎంతో మనోజ్ఞంగా "ప్రాతర్వేళల నట్టివెట్ట ..." (2-55) పద్యంలో వర్ణించాడు దీనిచే గ్రామిక జనులగూర్చి సైతం రాయలు ఎరుగునన్న విషయం స్పష్టం.

ఆరెకుల అమాయకత్వాన్ని ఎంతో స్వాభావికంగా రాయలు"తలబక్షచ్ఛట" (1-65) పద్యంలో వర్ణించడం జరిగింది. బాతులు తలలను రెక్కలలో దూర్చి వరి మళ్ళ కాలువల మధ్యభాగాలలో నిద్రించడం, వాటిని గాంచి ద్విజుల 'పిండీకృత శాటిక' లని ఆరెకులు తలంచడం, వాటిని వారి కర్పించదలంచి, వారు గ్రహింపబోగా ఆ బాతులు లేచి వారిపోవడం, ఆరెకుల అమాయకత్వానికి 'శాలి గోపోగ్యఘమఃల్' నవ్వడం ఇవన్నీ రాయల లోకజ్ఞతకు చక్కని ఉదాహరణలు. ఇందులో ఆరెకుల అమాయకత్వాన్ని, వారికి అగ్రజాతిపై గల భక్తిని రాయలు ప్రకటించడమేగాక, ఈ సన్నివేశంవల్ల హాస్యం సైతం పోషించడం గమనించ దగ్గది.

గ్రామీణుల సంగతులిట్లుండగా నాగరకులైన పుష్పలావికా పల్లవుల సంభాషణలు శ్లేషాత్మకమై ఆముక్తమాల్యదలో గలవు. "వెలది, యీనీదండ వెలయెంత?...." (2-19) అంటూ విటులడగడం, పుష్పలావికలు నర్మగర్భితంగా "నా దండకును వె బెట్ట నెవ్వనితరంబు" — అని సమాధాన మివ్వడం మధురాపురంలో జరిగినట్లు వర్ణితం ! కాని ఇదే రాయలు తన పట్టణంలో స్వయంగా చూచిన దనడంలో సందేహంలేదు.

ప్రకృతిలోని సర్వవస్తువులా, తిర్యక్కులా స్వభావాదుల్ని పరిశీలించినవాడు రాయలు. ఈ వస్తు పరిజ్ఞానం రాయల కవితకు పన్నె బెట్టింది

విల్లిబుత్తూరు వర్ణనలోని "అలఘుబకంబునం " (1-7.)అనే పద్యంలో రాయల సూక్ష్మ పరిశీలన అభివ్యక్తమవుతుంది. ఆ పట్టణంలోని మామిడి తోటలలో "పరాతన తీర్థ కుండము"లున్నాయట ! వాటి మీద తొగలు పూచి ఉన్నాయని

చెప్పడంలో ఆశ్చర్యంలేదు. అంతరదామర ఉందని చెప్పడం విశేషం! నీటిలోపల 'వలుద వాలుగ మొత్తం' పోరుతూ ఉండడం 'సిరుకోళ్ళు' "కొలకొల"మనే శబ్దం చేస్తూ 'క్రుంకు మెడ గుంపులు దోపగా' ఉండడం ఎంతో మనోజ్ఞంగా వర్ణితం. ఇవి రాయల సూక్ష్మ పరిశీలనకు పరమనిదర్శనాలు.

ఇలాగే గ్రీష్మర్తు వర్ణనలో "నిర్ఝర ప్రబల వేణిక లింక జత్రాలఁ బేరిన ప్రాచి పెన్నేటు లెగసె" (2–46) అని వర్ణించబడ్డవి. అంటే సెలయేళ్ళ పెద్ద ప్రవాహాలు గ్రీష్మాగమనంతో ఇంకిపోగా చత్రాలమీద పేరిన ప్రాచి 'పెన్నేటు లెగసి' నదట. ఇది రాయల లోకజ్ఞతలోని నిశిత పరిశీలనకు చక్కటి నిదర్శనం.

వర్షర్తు వర్ణనలోని "రవి జూచి కుడుచువారలకును . " (3–123) పద్యమంతటా రాయల లోకజ్ఞత స్ఫురిస్తుంది. అందులోను 'అతిథి సంఘంబునకు నీనినట్టి యెనుప కదుపులేగల గుమికి నా కట్టులెసగె, మట్టి మిద్దెలవారికి మరుపనులకు నెలత బాసిన వారికి నిదుర చెడియె"—అని చెప్పడంలో ఎంతగానో సూక్ష్మ పరిశీలన విదితమవుతుంది.

మాలదాసరి వటవృక్ష సమీపంలో చూసిన సన్నివేశం" — ఎలనీటి బొండలంబులు వోలె" (6–17) అనే పద్యంలో రాయల లోకవృత్త సంబంధి సూక్ష్మ పరిశీలన సుస్పష్టమవుతుంది. ఇట్లే "ఇడిసిన యిడుపుల యొడల (6– 3)" "ముంగాళ్ళ జాగి" (6-18) — అనే పద్యాలన్నింటా రాయల లోకజ్ఞత సువిదితమవుతూంది

చీమలు, కప్పలు; పక్షులు మొదలైన వాటి స్వభావాదుల్ని స్పష్టంగా గుర్తించిన వాడు రాయలు.

గ్రీష్మర్తు వర్ణనలో గ్రుడ్డుతోపాటు ఎర్రచీమలు చెరుకుగానుగల కడకు చేయుతున్నాయా అన్నట్లు ప్రజలు కలరని ఎంతోమనోహరంగా అభివర్ణించాడు రాయలు. ఉత్ప్రేక్షాలంకారంలో. "తోట బిగయుండి...." (2–70) పద్యంలో 'బావి సృష్టికి'ని అనగా రాబోవు వర్షాన్ని పురస్కరించుకొని గ్రుడ్లను రక్షించడానికి పదిలమైన ప్రదేశానికి వెళ్ళడం చీమలకు సహజం. ఈ విషయాన్ని సైతం [illegible]రించాడు రాయలు.

మొసళ్ళు, చేపలు, కుక్కలు, కొంగలు మొదలైన వాటికి సంబంధించిన విషయజ్ఞానం 2–53,54 పద్యాల్లో స్పష్టంగా గోచరిస్తుంది. 4–108లో భేకధ్వనులు 4–111లో మేడిపండ్ల నుంచి వెలువడు దోమలు, 4–118లో వర్షాకాలంలో పక్షులస్థితి మొదలైన వాటి వర్ణనలు రాయల అతిశయితమైన లోకజ్ఞతకు పరమ నిదర్శనాలు.

ఇంకా "అగ్గిబొబ్బలు" (2–56) చాపట్టు (2–60); మసిపాత మానికంబై (6–5) అనే ప్రయోగాల్లోను రాయల లోకజ్ఞత సువిదితమవుతుంది.

లోకజ్ఞతతోపాటు రాయల అనల్ప కల్పనా శిల్పం సైతం అభివ్యక్తమవుతుంది 'లకుముకి పిట్టలు వీధుల బావులలో చేపలకోసం గభాలున పడిలేస్తుండగా, గేహేందిర ద్రావిడీ పరిచితిం జెండాడు చందంబునన్' (1–57) ఉన్నదట. ఇది ఎంతో మనోహర కల్పన. సూక్ష్మపరిశీలనతోపాటు ఈ కల్పన రాయల లోకజ్ఞతను స్పష్టం చేస్తుంది.

పోకచెక్కలు, తమలపాకులు, సున్నము కలిసి ఎరుపును పొందే విషయాన్ని "ఘనకనురక్తి హెచ్చ" (1–70) ఎంతో మనోహరంగా శ్లేషతో వర్ణించాడు కవి. లోకవృత్తాన్ని జోడించి చేసిన ఈ కల్పన రాయల నిశిత పరిశీలనకు నిదర్శనం.

మోదుగమొగ్గ కుసుమబుతువనే మంత్రసాని మరునకు బొడ్డుగోసిన కొడవలో అన్నట్లుందని "అవనినపుడు " (5–112) అన్న పద్యంలో రూపకాను ప్రాణితోత్ప్రేక్షలో కల్పించి చేసిన వర్ణన రాయల లోకజ్ఞతకు పరాంకోటి అనవలసి ఉంది.

సామాన్యంగా వేసవి కాలంలో చలివేంద్రాల్లో అధ్వగులకు నీరు బోయడం సహజ విషయం. దానిమీద (2–57, 58, 59) పద్యాల్లో చేసిన కల్పన అనన్య సామాన్యం.

సార్వభౌముడై ఉండీ కూడ రాయలు పల్లెటూలు ఎప్పుడు తొక్కాడో, ఏమో తెలియదు.

"అపమార్గత సరుగుచు మా
ర్గపు ధా మార్గవపు గంటకంబుల గాళ్ళన్
విపరీతత నూడ్చుచు నే
రుపున న్పల్లెరు లీడ్చి త్రోయుచు జనుచున్" (6-14)

అన్న పద్యంలో పల్లేరులగూర్చిన రాయల సూక్ష్మాతిసూక్ష్మ పరిశీలన మనకు స్పష్టంగా తెలుస్తుంది.

రాయల కవితలో వర్ణనా వైదగ్ధ్యంలో సైతం రాయల లోకజ్ఞత స్పష్టమవు తుంది. మూర్తి స్వరూప స్వభావాదుల్ని స్పష్టంచేస్తూ దృశ్య సాక్షాత్కారం గావించడం రాయల కవితలోని విశిష్టతలలోని విశిష్టత. వసంత, గ్రీష్మ, వర్ష, శరదృతు వర్ణనలలో వర్ణనావైదగ్ధ్యంతోపాటు లోకజ్ఞతను రాయలు ప్రకటించి ఉండడం సువిదితం. మూర్తి చిత్రణలో సైతం ఈలాంటి లోకజ్ఞత స్పష్టంగా తెలుస్తుంది. మాలదాసరి మూర్తి చిత్రణ —

"చమురైన తోల్కుబుసంబు కెక్కియును ని
    తడి శంఖ చక్ర కుండలము లమర,
దివె దారికొమ్ము దోల్తిత్తియు జోడషు
    మెడమీది మొగలాకు గొడుగు దనర
మత్పాద రక్షయు మావుపెన్వేరక గు
    ట్టిన యోటి తిపిరి దండెయును మెరయఁ
జిటి తాళములు సంకపుటిక నొక్కొక్కమాటు
    గతిరయంబున దాకి కలపి మొరయ,
వలుద వనమాల కంటియు మలినతనువు
బట్టి తిరుమన్ను బెదురుగెంపుట్టు జూపు
బసుపుతోడితోలు వల్లంబు నెసగమెసగ
వచ్చు సేవింప సురియాళు వైష్ణవుండు. (6-6)

— పద్యంలో కన్నులకు గట్టినట్లుంది ఇందుకు హేతువు మాలదాసరి స్వరూప స్వభావాలు. వేషభాషలు మొదలైన వాటి నన్నింటినీ సూక్ష్మంగా పరిశీలించిన రాయల బుద్ధి నైశిత్యమే ! "మృతమర్త్యురెంటాన నిడ్డజాలక ...." (6–19) "కంఠ కన్నులవాని ...." (6–20) అనే పద్యాలలోని బ్రహ్మరాక్షసుని మూర్తి చిత్రణ అనన్య సామాన్యం. ఇట్లే "నీలమేఘము డాలు దీలు సేయగజాలు మెరుగు జామన చాయమేని తోడ...." (1–12) పద్యంలోని తెలుగు వల్లభరాయని వర్ణన మిక్కిలి మనోజ్ఞం. ఇలాంటి ఉదాహరణ లెన్నైనా చూపించవచ్చు. సమస్త ప్రకృతి వర్ణన, ఆయా వ్యక్తుల శీల స్వభావాదుల్ని సుస్పష్టరేఖలతో అభివర్ణించడం రాయల లోకజ్ఞతను నిరూపిస్తున్నాయి రాయలలో మనస్తత్వ చిత్రీకరణ నైతం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది మాలదాసరి బ్రహ్మరాక్షసుల సంభాషణలో రాయల లోకజ్ఞత తెల్లమవుతుంది. బ్రహ్మరాక్షసుడు దాసరిని చంపడానికి ఉద్యుక్తుడై "అసియు బాత్రి యుందే" బ౦చడం, 'కహకహ నవ్వడం' అమృతమైనను జవులజాత్యన్న సమమే?" అనడం, 'మాలదాసరి' కృష్ణ స్మరణంబు చేయడం, బ్రహ్మరాక్షసుడు దాసరి 'చెక్కలి గొట్టడం' — ఈ మొదలైనవన్నీ రాయల లోకజ్ఞతకు పరమ నిదర్శనాలు.

ఇలాగా ఆముక్తమాల్యదలో శ్రీ కృష్ణదేవరాయలకు గల ప్రకృతి పరిశీలనా దక్షత, సూక్ష్మాతి సూక్ష్మ విషయ సంగ్రహణ లోకవృత్తాన్ని జోడించిన అనన్య సామాన్యమైన కల్పనా శిల్పనైపుణ్యం, వర్ణనా విదగ్ధ్యం మొదలైన గుణాలన్నీ అతనికి గల సర్వంకషపాండిత్య ప్రకర్షకు వన్నెబెట్టుతున్నాయి. ఇదే రాయలలోని ప్రత్యేకత !

(ఆంధ్రప్రభ, 22-9-1974)

# ప్రవర, విష్ణుచిత్తుల ధర్మ పత్నులు

ఆంధ్ర ప్రబంధోద్యాన వనంలో పుష్పించి దశదిశలా పరిమళాలు వెదజల్లిన రెండు అపూర్వ అమరపుష్పాలు, మనుచరిత్ర, ఆముక్తమాల్యద అనే ప్రబంధాలు. అల్లసాని పెద్దన, శ్రీకృష్ణదేవరాయలు, మనుచరిత్ర. ఆముక్తమాల్యదలలోని ప్రధాన పాత్రలైన ప్రవర విష్ణుచిత్తుల రూపురేఖలు, శీలస్వభావాదులను మహోన్నతంగా తీర్చిదిద్దారు

"ఆపురిబాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి భా
షాపరశేషభోగి వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మ దీ
క్షా పరతంత్రు డంబురుహగర్భ కులాభరణం బనారతా
ధ్యాపన తత్పరుండు ప్రవరాఖ్యు డలేఖ్య తనూవిలాసుడై."

(మనుచరిత్ర — 1-52)

— అన్న పద్యంలో పెద్దన కన్నులకు గట్టినట్లు ప్రవరుని వర్ణించి, ఇంకా "అలేఖ్యతనూ విలాసు డంటాడు. ఇలాగే —

"అందుండుందన్వయ సద్మ పద్మవదనుండద్వంద్వ(ద్ర)శాంత స్మో
గాంఘ్రా బద్ధ మధు ద్విషద్విరదు డన్వర్థాభిధానుం డురు
చ్ఛందో బృంద తదంత వాగవగమా సంజాత తజ్జన్యని
ష్పందద్వైత సుసంవిదాలయుడు నిష్ఠ న్విష్ణుచిత్తుండనన్."

(ఆముక్తమాల్యద —1-77)

— అనే ఈ పద్యంలో కృష్ణదేవరాయలు విష్ణుచిత్తుని వర్ణించాడు. తరువాత ప్రవర విష్ణుచిత్తుల చేష్టలచేత వారి ఉత్తమ శీలస్వభావాదులు సుస్పష్టం చేయబడ్డాయి. ప్రవర విష్ణుచిత్తులలో పోలికలు గలవు. ఇద్దరు భగవద్భక్తి పరాయణులు, అతిథి

సేవాతత్పరులు, ఏకపత్నీవ్రతులు నిత్యకర్మానుష్ఠాతలు. రెండు ప్రబంధాల్లోను వీరిద్దరు ప్రధాన భూమికలు అయినప్పటికీ వీరి ధర్మపత్నులకు అధిక ప్రాముఖ్య మున్నట్లులేదు. పెద్దనగాని, రాయలుగాని, అత్యధిక ప్రాధాన్యమిచ్చి ఈ పాత్రలను తీర్చిదిద్దలేదు. కారణం వారి ధర్మపత్నుల కంటే ప్రవర విష్ణుచిత్తులకే ఆ రెండు ప్రబంధాల్లోను ప్రాముఖ్యముండడమే. అంటే వారి ధర్మపత్నులు అప్రధాన పాత్రలు.

అప్రధాన పాత్రలకైనా ఏదో కొంత ప్రాధాన్యమున్నట్లు రచించడంలో తెనాలి రామకృష్ణుడు అందెవేసినచేయి. అంటే రేఖా చిత్రరచనలో రామకృష్ణున కతడేసాటి. అంత సుస్పష్టరేఖలతో రేఖా చిత్రరచన పెద్దన, రాయలు చేయలేక పోయినా అక్కడక్కడ చూచాయగా ప్రవర విష్ణుచిత్తుల ధర్మపత్నుల గూర్చి విలిఖించి నట్టివాటిని పురస్కరించుకొని వారిద్దరిని మనం పోల్చుకోవలసి ఉంది ఆ ధర్మపత్నులిద్దరి రూప చిత్రాల్ని పరిశీలించడమే ఈ వ్యాసోద్దేశం.

ప్రవరుని ధర్మపత్ని పేరు సోమిదమ్మ ప్రవరుడు సోమయాజి, కనుక అతని ధర్మపత్ని సోమిదేవి – సోమిదమ్మ. కాని విష్ణుచిత్తుని ధర్మపత్నికి పేరు కూర్చలేదు రాయలు. ఆమె అనామధేయ పెద్దన 'యౌవనమందు ' (మను-1-53) పద్యంలో 'కమనీయ కౌతుక శ్రీవిధికూకటుల్ గొలిచి. చేసిన కూరిమి సోమిదమ్మ, అని వర్ణించాడు. అంటే ఈడుజోడు చూసి పెండ్లి చేసిన ప్రేమోపేత అయిన సోమిదేవి యని అర్థం. అలాంటి సోమిదమ్మ "సౌఖ్యావహయై భజింపన్" — భర్తకు సుఖాన్ని గూర్చునదై సేవచేస్తూండినది. ఇట్టి ధర్మపత్ని ఉండబట్టే ప్రవరుడు సర్వకర్మ నిరతుడై ఆనందమయమైన సంసారం సాగిస్తూ, భగవద్భక్తి పరాయణుడై అతిధ్యభ్యాగతి సేవాపరతంత్రుడై ఉండడానికి వీలైంది. అందుకే ఆ సోమిదేవి ఉత్తమ ధర్మపత్ని. భర్త కన్నివిధాలా సౌఖ్యావహ అయి ఉండడమే ధర్మపత్ని పరమధర్మం సోమిదమ్మలో దీనికి కొదవలేదు ఈ విధంగా సౌఖ్యావహఅయి ఉందని విష్ణుచిత్తుని సహధర్మచారిణిని గూర్చి రాయలు వాచ్యంచేయకపోయినా ఆమె భర్తకు అత్యంత సౌఖ్యావహ అనడంలో సందేహంలేదు.

'అభ్యాగత సేవా పరతంత్ర సకల జీవనుడు' ప్రవరుడే కనుకనే అతని ధర్మపత్ని సోమిదమ్మ 'అన్నపూర్ణకుద్ది' అట !

"వండనలయదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి
యతిథు లేతీర నడికిరే యైన బెట్టు
వలయు భోజ్యంబు లింట నవ్వారిగాగ (మను — 1-56)

అట్టిది ఆమె సహనం. అట్టిది ఆమె భర్త్రభిమతానుసార వర్తన; భర్తమాటే తనమాట. వండడంలో ఆమెకు అలసట లేదు. ఎంతమంది అతిథులు వచ్చినా, అర్ధరాత్రిలో వచ్చినాసరే, అవ్వారిగా ఆ అతిథులు కోరిన వంటకాలు వండిపెడుతుందట. కనుకనే ఆమె అన్నపూర్ణతో సమానురాలు అన్నాడు పెద్దన. పెద్దన ఈ విధంగా సోమిదమ్మ పరంగానే ఈవిశేషణాలన్నీ చెప్పాడు. కాని రాయలు విష్ణుచిత్తున కనుకూలవతియనే సంగతి స్పష్టంచేసినా, సమస్త విషయాలూ అంటే అతనికి అతిధ్యభ్యాగతుల మీద గల స్నేహపరాయణత్వాన్ని సర్వం వర్ణించి విష్ణుచిత్తున కెలాగా అనుకూలంగా వుందో వాచ్యం చేయకుండా చెప్పగలిగాడు. అదే రాయలలోని విశిష్టత. ఈ క్రింది పద్యాల్లో ఈ విషయం స్పష్టమవుతూంది. "న్యాయార్జిత విత్తంబున ...", 'గగనము నీటి బుగ్గకెనగా ', 'తెలినులివెచ్చ యోగిరము. ', 'పునుగుంవావి ....', 'కదళ గభీరపుష్పఫలి కాచ్పట ' ఆ విష్ణునిధిగేహసీమ....,' 'ఇత్తెఅంగును . ' (ఆముక్తమాల్యద, 1-79-85) విష్ణుచిత్తుడు హిమాచలమలయాచలాలమధ్య మార్గస్థులై వచ్చేపోయే వైష్ణవాళికి ఆతిథ్యం యిస్తూవుండేవాడు జడివట్టిన నాళ్ళలోను, వేసవిలోను శీతాకాలంలోను ఉచితరీతిని భోజనాదులు అమర్చేవాడు. అంటే అతని ధర్మపత్ని అంతగా అనుకూలంగా వుండబట్టే ఈ విధమైన అతిథి సత్కారం విష్ణుచిత్తుడు చేయగలిగేవాడని స్పష్టమవుతుంది. నిజంగా అదంతా ఆ యిల్లాలి చలువ "గగనము నీటి బుగ్గకెనగా జడివట్టిన నాళ్ళ భార్య కన్పొగ సొరకుండ నారికెడ పుంబొరెయుల్దవ్రలించివండ" అన్నప్పుడు నిజంగా విష్ణుచిత్తునకు గల అతిథి సేవాపరాయణత్వం, అందుకు తగిన అన్నపానాదుల ఏర్పాటు, అందునా భార్యకేవిధంగాను బాధ కలుగకుండా కన్నులకు పొగ చొరనీక ఎండనీటి కొబ్బరిబోండ్లాల్ని ఎండించి పెట్టేవాడని తెలుస్తుంది అందుచేత ఎలాంటి ఆయాసము లేకుండా వంటా వార్పూ ముగించగలిగేది ఆ ఇల్లాలు. దానితో విష్ణుచిత్తుడు అతిథి సత్కారాలు కొరతలేకుండా చేయగలిగేవాడు "ఆవిష్ణునిధి గేహసీమనడురేయాలించి"నా గూడా విష్ణు కథలు. ద్రావిడ ప్రబంధ పఠనం, దయతో భుజించవలసిందనే

ఆతని ధర్మపత్ని "భక్తి దోపకు సాధ్వి .... (ఆముక్తమాల్యద 2 97) అనే పద్యంలో ప్రయాణానికి అవసరమైన సంబారాలన్నింటిని తయారుచేసి పంపినదట. ఇక్కడ "భక్తిన్", 'సాధ్వి' పదాలు ఎంతో సాభిప్రాయంతో ఉపయోగించబడ్డాయి. భర్తమీద కల అతిశయితమైన భక్తితో ఆమె వస్తు సముదాయాన్ని సమకూర్చింది. అంతేకాక "ఆమె సాధ్వి" — మహాపతివ్రత అని పేర్కొనడం ఆ మహాభాగ్యురాలి ఉత్తమ గుణాల్ని చెప్పడం. ఈరెండు పదాలేచాలు ఆమె ఎంతటి ధర్మపత్నో స్పష్టం చేయడానికి అంతకు ముందు ఆమెను గూర్చి ప్రత్యక్షంగా గాక, పరోక్షంగా అంటే విష్ణుచిత్తుని గూర్చి చెపుతూ ఆమె వైశిష్ట్యాన్ని వివరించినాడు రాయలు. ఈ సందర్భంలో మాత్రం పై పదద్వయ ప్రయోగంతో ఆమె పాతివ్రత్యాన్ని స్పష్టం చేయగల రాయలపాత్ర చిత్రణ విశిష్టమైంది.

భర్తృప్రేమ కింతగా నోచుకున్న ఈ ఇల్లాలికి సంతానం లేదు. బహుశః ఆమె నిస్సంతాన కావడంవల్ల వేదనచెంది వుండవచ్చు "తులసీ వనసీమ లభించిన బాలను" విష్ణుచిత్తుడు —

"కానిపోయి ధర్మ గేహిని
కనురక్తి నొసంగ బొంగి యాయమయును జే
పు నిజ స్తన్యంబున లలి
బెనిచె న్గోమొప్ప .... (ఆముక్తమాల్యద 5-6)

సంతాన రహితయయిన ధర్మగేహినికి - అంటే ధర్మపత్ని చేతికిచ్చాడట భర్త. ఆ పసిబిడ్డను చూచిన ఆ ఇల్లాలు పొంగిపోయినదట. వెంటనే ఆమె "చేపు నిజస్తన్యంబున" ఎంతో ప్రేమతో పెంచిందట ఆ బాలికను. ఈ విధంగా పెంచి పెద్దదానిని చేసినా గూడా, పుత్రిక గోదాదేవి ఆరూఢయౌవన అయినదనిగాని, ఆమె శ్రీరంగేశునిపై మరులుగొన్నదనిగాని, విరహం అనుభవిస్తూందని గాని ఆ యిల్లాలు ఎరుగనే ఎరుగదు. గోదాదేవి అనుభవిస్తూన్న విరహం తండ్రి విష్ణుచిత్తుడే చూడడం జరిగింది. కాని అతడు సైతం అది విరహమని ఎరుగక ఏదో తపమేమోయని

తలపోయడం, విష్ణుపున కొసంగతి వివరించడం జరుగుతుంది. ఇందాతని అమాయకత్వం ప్రస్ఫుటమవుతుంది శ్రీరంగేశు చెంతకు పుత్రిని గొనిపోతాడు విష్ణుచిత్తుడు. అపుడామెను తన అర్ధాంగిని చేసుకోదలచిన రంగనాథుడు 'బ్రహ్మరుద్రుల బ్రాహ్మి గౌరిని' ఆ కన్యను అడిగించడానికి విష్ణుచిత్తుని వద్దకు పంపుతాడు. తన పట్టణానికి రావలసిందనీ, అది సముదాచారమనీ, ఆ పెండ్లి పెద్దలకు విష్ణుచిత్తుడు తెలియజెబుతాడు. కాని ఈ సందర్భంలో అతని ధర్మపత్ని సంగతి లేనేలేదు. శ్రీనాథుని హరవిలాసంలో ఈశ్వరుడు పార్వతిని వివాహమాడదలచి అరుంధతీ సహితంగా సప్తర్షులను పెండ్లి పెద్దలుగా హిమవంతుని కడకు పంపగా, వారావిషయం పర్వతరాజుకు తెలియజేసినప్పుడు హిమవంతుడు భార్యముఖం అవలోకించి సంతోషాంతరంగుడయ్యాడట. అంటే పుత్రిక వివాహవేళ తండ్రి కంటే గూడ తల్లికే ఎక్కువ ప్రాధాన్యమనీ —

"భూమిధరరాజు సంపూర్ణ కాముడయ్యె
ముదముతో మేనకాదేవి మొగము సూచి
కన్యకాదాన వేళల గలదు చనవు
క్షితిగృహస్థులకంటె సద్గేహినులకు" (4-68)

అని శ్రీనాథుడు వివరించాడు. కానీ అలాంటి ప్రాధాన్యం సైతం విష్ణుచిత్తుని 'సద్గేహి'నికి లభించలేదు. ఈ సందర్భంలో కృష్ణదేవరాయలు ఆమెకంత ప్రాధాన్య మొసగలేదని తెలుస్తుంది. కాని వివాహ సమయంలో మాత్రం 'ఆయ్యాళ్వారు దేవేరియుం దానును ధారవోయగా' ఆ కన్యారత్నాన్ని శ్రీరంగనాథుడు పరిగ్రహించాడట. 'కన్యాదాన వేళ విష్ణుచిత్తునితోపాటు అతని ధర్మపత్ని గూడ ధారవోసింది. అందుచేత, చివరకి ఆమెకి సైతం ప్రాధాన్యమొందన్న సంగతిని రాయలు స్వల్పంగా తెలియజేశాడు వివాహ సంప్రదింపులన్నీ భార్యతో మాట్లాడే విష్ణుచిత్తుడు చేశాడని అర్థం అవుతుంది. కనుక రాయలు అప్రధానపాత్ర అయినా విష్ణుచిత్తుని ధర్మపత్నిని కొంత ప్రాధాన్యమున్నట్లు చిత్రించడం జరిగింది.

ఈ విధంగా పెద్దన, రాయలు ప్రధాన పాత్రలైన ప్రవర, విష్ణుచిత్తులను మనోజ్ఞంగా విస్పష్టరేఖలతో వర్ణించినప్పటికీ వారిధర్మపత్నులను మాత్రం అప్రధాన

పాత్రలుగానే వర్ణించాడు సందర్భోచితంగా చెప్పిన కొన్ని మాటలవల్ల వాళ్ళ పతివ్రతత్వాన్ని మనం గుర్తించగలిగాం. భర్తలు భగవద్భక్తి పరాయణులై వుండగా తదుచితరీతిని వారి ధర్మపత్నులు భర్తల కనుకూలవతులై ప్రవర్తించి సహధర్మచారిణి అన్న పదాన్ని సార్థకం చేశారు. ఈ రెండు ప్రబంధాల్లోనూ ప్రవర విష్ణుచిత్తులకే ప్రాధాన్యం వారి ధర్మపత్నులు భర్తలకు ఛాయలులాగా వర్తించినవారేగాని ఎదుటబడి భర్తల ప్రాధాన్యాన్ని తగ్గించలేదు. అదే స్త్రీ ధర్మం. పైగా ఉత్తమ సాధ్వీ ధర్మం. ఈ విషయాలను మనసునందుంచుకొన్నవారు గనుకనే పెద్దనగాని, రాయలుగాని తమ ప్రబంధాల్లో ప్రవర విష్ణుచిత్తులను సర్వవిధాలా ఉచితరీతిని వర్ణించి ప్రాముఖ్యాన్నిచ్చినప్పటికీ వాళ్ళ ధర్మపత్నులను మాత్రం ఛాయా మాత్రంగా వర్ణించి కవిరాజు, రాజకవి – ఇద్దరు తమ ప్రతిభలను ప్రకటించుకొన్నారు !

(ఆంధ్రప్రభ, 17-2-1974)

# వటవృక్ష వర్ణన - ధూర్జటి, కృష్ణదేవరాయలు

వటవృక్షం అనగానే మనకు బ్రహ్మరాక్షసులు గుర్తువస్తారు. మర్రిచెట్టుకీ మంత్రాల మారిగాళ్ళకు సంబంధం గోచరిస్తుంది. భూతభేతాళ పిశాచాదులకి మర్రి నిలయం. పైగా ఆ భూతభేతాళ పిశాచాదుల రహస్యాలు ఈ మర్రితో ముడివడి ఉండడం విశేషం. ఈ సంగతి మనకు పుక్కిటి పురాణాల్లోను; కట్టుకథల్లోను మాత్రమేకాక, మన శిష్టసాహిత్యంలో సైతం ప్రఖ్యాతమే. విక్రమార్కుని కథల్లోని భేతాళుడికీ, ఈ మర్రికీ సంబంధంఉంది. అలాగే బాలనాగమ్మ కథలో మర్రి, దానిలో ఒక చిలుక, చిలుక ప్రాణ-తో మాయలమరాఠీ ప్రాణం ముడివడి ఉండడం మనకు సువిదితమే.

మన సాహిత్యంలోని వటవృక్షాల్ని గూర్చి తెలుసుకొనే ముందు ఇప్పటికే ప్రసిద్ధికెక్కిన మర్రిచెట్ల గురించి ముచ్చటించుకోవడం అనవసరమేమీకాదు. భారత దేశంలో ఈనాటికీ ప్రసిద్ధి వహించిన వటవృక్షాలున్నాయి మద్రాసు అడయారులో ఒక ప్రసిద్ధ వటవృక్షముంది; అలాగే కలకత్తా నగరంలో మరొకటీ ఉంది. ఇక మన రాష్ట్రంలో రాయలసీమలో అనంతపురం జిల్లా కదిరి తాలూకాలోని గూటిబయలులో ఒకటి, తెలంగాణా పిల్లలమర్రిలో మరొకటీ ఉన్నాయి. వీటన్నింటిలో మహావట వృక్షం కదిరి గూటిబయలులోనిది; తిమ్మమ్మ మర్రిమాను అని దీని పేరు; ఇది ప్రపంచ ప్రఖ్యాతి పొందింది. అడయారులోని దానికంటే. కలకత్తాలోని దానికంటే కూడా ఇది పెద్దది సుమారు అరున్నర ఎకరాల విస్తీర్ణంలో ఇది వ్యాపించి ఉంది. మరి ఎందరు బ్రహ్మరాక్షసులు దీన్ని ఆశ్రయించి ఉన్నారో మనకు తెలియదు. కానీ ఒకటి మాత్రం వాస్తవం తిమ్మమ్మ మర్రి కింద నిద్రించిన వారికి మాత్రం శుభాలు చేకూరుతాయన్న ప్రగాఢ విశ్వాసం మాత్రం ప్రజల్లోఉంది.

ఇది ఇలా ఉండగా తెలుగు ప్రబంధకవుల్లో ఒక రాజకవీ, మరో కవిరాజు వటవృక్షబ్రహ్మరాక్షసుల్ని అభివర్ణించి, తమ వర్ణనా వైదగ్ధ్యాన్ని ప్రకటించు కొన్నారు. శ్రీకృష్ణదేవరాయలు మాలదాసరి కథలోను, ధూర్జటి నత్కీరుని చరిత్ర

లోను ఈ వటవృక్ష బ్రహ్మరాక్షసుల్ని సందర్భోచితంగా వర్ణించారు. వాటిని క్లుప్తంగా పరిశీలిద్దాం.

ఆముక్తమాల్యదలోని మాలదాసరి కథ రాయల స్వభావానికి చక్కటి నిదర్శనం. మాలదాసరి మంగళకైశిక రాగంలో శ్రీ విష్ణువును అనునిత్యమూ స్తోత్రం చేస్తూ ఉండేవాడు. ఒకనాటి అర్ధరాత్రి సమయంలో పిల్లి రావడంతో కోడి కొక్కొరుకో మంది. అది విన్న మాలదాసరి తెల్లవారుతూందని తలచి స్తుత్యర్థం వెళ్ళుతాడు. కన్ను పొడుచుకొన్నా కానరాని కటిక చీకటిలో దారితప్పి తిరిగాడు. తెలతెలవారుతూండగా ఎదుట ఒక వటవృక్షం కనిపించింది.

"కాంచెన్వైష్ణవుఁడర్ధ యోజన జటాఘాటోత్థ శాఖోపశా
ఖాంచజ్ఞాట చరన్మరుద్రయ దవీయః ప్రేషితోద్యచ్ఛ దో
దంచత్కీటకృత వ్రణచ్ఛలనలిప్యాపాదితాధ్వన్య ని
ష్పంచారాత్త మహాఫలోపమఫల స్ఫాయద్వటక్ష్మాజమున్." (6–15)

— ఆ మాలదాసరి రెండు యోజనాల పర్యంతం వ్యాపించిన శాఖోపశాఖల సమూహంలో సంచరిస్తూన్న గాలి వల్ల దూరంగా తోసివేయబడ్డ ఆసలలో ఉన్న కీటకాలు తొలిచిన రంధ్రాలనే వ్రాతచేత కూర్చబడ్డ బాటసారుల సంచారం లేకపోవడంతో మహాపుణ్యంతో సమానమైన పండ్లతో విస్తరించి ఉన్న వటవృక్షాన్ని చూశాడు. ఈ పద్యం శ్రీకృష్ణదేవరాయల వర్ణనా వైదగ్ధ్యానికీ, సంస్కృత సమాస భూయిష్ఠ రచనా పాటవానికీ, నారికేళపాకానికీ, ఓజోగుణ వైశిష్ట్యానికీ చక్కటి ఉదాహరణ. ఆ వటవృక్షాన్ని ఆశ్రయించి బ్రహ్మరాక్షసుడు ఉండడం సహజమే కదా ? కాబట్టి రాయలు, బ్రహ్మరాక్షసుని చాలా మనోజ్ఞంగా వర్ణించడం గమనించదగ్గ విషయం :

"మృతమర్త్యు రెంటాన నిడ్డఁజాలక నెత్రు
రంజిల్లు పెనుబొడ్డు ముంజివానిఁ
బల్లి చీమల వక్రభల్లాతకియుఁబోలె
నెట్టి దుప్పటి నొప్పు కట్టివాని,

వ్యత్తసహస్తిమస్తాభఁ బాయగు గడ్డ
మును ద్రంష్ట్రికలఁ బొల్చు మొగమువానిఁ
గడుదుర్గ నికుతుట్టి గతిఁ జొంగలోఁ బాండు
రతమించు కపిల కూర్చంచువాని,

నెఱకుఁ దెఱువరిఁగన శాఖ లెక్క జాఱు
ప్రేవు జందెంబు గసరిపైఁ బెట్టువాని,
ప్రేలుడగు బొజ్జగల బూర గాలి వానిఁ
జెంబుతలవాని నవటుకచంబు వాని "

"కండ కన్నుల వాని, నాఁకటను బండ
తిట్ల బేతాళికల సారెఁ దిట్టువాని,
నగగరిమవాని, నన్వర్థనాముఁ గుంభ
జానువను నొక్క ద్విజనిశాచరునిఁ గనియె." (6–19,20)

— ప్రబంధ కవిత అంటే వర్ణనలనే అర్థం కదా ? పైగా ప్రబంధకవులు ప్రబంధ కన్యా వర్ణనలతోనే అలసి సొలసి పోయినవాళ్ళు రాయలు అలాకాక, ఒక వ్యక్తి — అందునా ఒక బ్రహ్మరాక్షసుని వర్ణించడంలో తన సహజ నిశిత పరిశీలనను జోడించినట్లు స్పష్టం. ఈ వర్ణన మనకు కన్నులకు కట్టినట్లుండి సహృదయ రంజకం చేస్తుంది

ఇలాగే అష్టదిగ్గజాలలోని మదేలమైన ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో నత్కీరుని కథలో వటవృక్ష బ్రహ్మరాక్షసుల వర్ణన చేయడం గమనించవచ్చు. నత్కీరుడు శివునిచే శపించబడి కుష్ఠురోగగ్రస్తుడై, తద్విముక్తికోసం కైలాస పర్వతదర్శనార్థం వెళ్ళుతూంటాడు. దక్షిణ దేశయాత్ర ముగించి ఉత్తర దేశంలోని కాశీవిశ్వేశ్వరుని సందర్శించి, ఐదు క్రోసుల దూరం వెళ్ళాక, భయంకరారణ్యంలో పయనిస్తూ దప్పిగొని ఎదుట సరస్సును చూసి, సంతోషాంతరంగుడై, ఆ సరస్సు పక్కనే ఉన్న వటవృక్షాన్ని చూస్తాడు :

" తన పలాశశ్రేణి ధరకంతటికిఁ బచ్చ
పట్టుఁ బుట్టంపు మేల్కట్టుగాఁ గఁ
దనయూర్ధ్వ శాఖావితానంబు సురలకు
మరకతరచిత హర్మ్యములుగాఁ గఁ
దన ప్రేలుఁ గొమ్మలు మునులకుఁ గల్పిత
పర్ణశాలా కలాపములుగాఁ గఁ
దన దిశాంత భ్రాంత ఘనవిటపచ్ఛాయ
వలయాద్రి హరిణ శాద్వలముగాఁ గ,

వాలఖిల్య మునీశ్వరావాసమైన
రోహణము రీతిఁ జిత్రమూర్తి దేహమగుచు,
గయఁ బ్రసిద్ధి వహించు నక్షయ వటంబు
చందమున నున్న యొక మఱ్ఱి క్రిందికేగి." (3-198)

— ఇందు ధూర్జటి వటవృక్షాన్ని ఎంతో మనోజ్ఞంగా వర్ణించాడు. చల్లటి ఆ వటవృక్షచ్ఛాయ గూర్చుండి, ఆ చెట్టు నుంచి రాలిన పండుటాకులు సరస్సులోని నీళ్ళలో పడినవి చేపలుగాను, గట్టుపై పడ్డవి పక్షులుగాను, అటు సగం, ఇటు సగం పడ్డవి సగం చేప, సగం పక్షి రూపంపొంది లోపలికి బయటికి లాగుతూన్న చమత్కారం చూసి పరవశత్వం చెంది ఉంటాడు. అలా ఉండగా బ్రహ్మరాక్షసుడు కనిపిస్తాడు :

" క్రూర నిరీక్షణ ప్రబల క్రుద్ధులు, కోఱలు, నూర్ధ్వ కేశముల్
నీరదనీల గాత్రమును, నిష్ఠుర వాక్యము లట్టహాసముల్,
ఘోరవకంఠనిస్వనము, భీకర హేతియు, మానవాస్థి హా
రారవముల్సెలంగ, వికటాకృతితో నొక భూతమాతనిన్." (3-200)

పట్టుకొంటుంది ఇలాగా కళ్ళకు గట్టినట్లు సహజరీతిని బ్రహ్మరాక్షసుని వర్ణన చేశాడు ధూర్జటి.

రాయలు వటవృక్ష వర్ణనకి శార్దూల వృత్తాన్ని గ్రహించగా, ధూర్జటి సీస పద్యాన్ని స్వీకరించాడు; బ్రహ్మరాక్షస వర్ణనకి సీసం చాలక తేటగీతిని రాయలు గ్రహించగా, ధూర్జటి మాత్రం ఒకే ఒక ఉత్పలమాల వృత్తాన్ని తీసుకొన్నాడు. వటవృక్ష వర్ణన రాయల సహజమైన ఓజోగుణ సమన్వితమై ఉంది. ధూర్జటి సరళ రీతిని వర్ణించాడు. రాయలది నారికేళ పాకంకాగా, ధూర్జటిది ద్రాక్షాపాకం. బ్రహ్మ రాక్షస వర్ణనలో రాయల పదప్రయోగ దక్షత ప్రస్ఫుటం. కొంత అర్థకాఠిన్యమూ ఉన్న మాట వాస్తవమే అయితే సాహిత్యం ఆలోచనామృతం కదా మరి ? సదవ గాహన చేసుకొంటే బ్రహ్మరాక్షసుని మూర్తి మన కళ్ళకుగట్టి, రాయల పదప్రయోగ దక్షత స్పష్టమై, అమితానందాన్ని ప్రసాదిస్తుంది. అయినా ధూర్జటి సులభశైలిలోనే బ్రహ్మరాక్షసుని వర్ణించాడు. ఇలాగా వటవృక్ష బ్రహ్మరాక్షసుల వర్ణనలో తమతమ ప్రత్యేకతల్ని రాయలు, ధూర్జటి ప్రకటించడం స్పష్టం. అవి రాయల, ధూర్జటి — ఇద్దరి మహోన్నత వ్యక్తిత్వాల్ని సైతం సుస్పష్టం చేస్తూండడం మనం గమనించ వచ్చు. వటవృక్షాలకు, వాటి ననుసరించి ఉన్న బ్రహ్మరాక్షసులకు గల సంబంధం ఇందువల్ల వ్యక్తమవుతూంది. కథానుగుణంగా చేయబడ్డ ఈ సహజ వర్ణనలు సహృదయ రంజకమై ఒప్పారుతున్నాయనడంలో అత్యుక్తిలేదు !

(సమాలోచన, 1-11-1979)

# వేసవి వర్ణన
## శ్రీ కృష్ణదేవరాయలు, రఘునాథరాయలు

శ్రీ కృష్ణదేవరాయలు రఘునాథనాయకునికి అన్ని విధాలా ఆదర్శపురుషుడు పైపెచ్చు కృష్ణదేవరాయలతో అన్ని విషయాల్లోనూ సరితూగ గలవాడు రఘునాథుడు కృష్ణదేవరాయలకు 'సాహితీ సమరాంగణ సార్వభౌముడ'న్నది బిరుదు. అలాగే ఇది రఘునాథునకు సైతం వర్తిసుంది. అటు కదనరంగంలోనూ ఇటు కవితారంగం లోనూ అసామాన్య శేముషీ వైభవాన్ని ప్రకటించి అశేష ధైర్యసాహసాల్ని వెలువరించి చక్కటి కవిత్వం చెప్పిన విజేతలై విజయ దుందుభులు మ్రోగించిన మహా రసిక కవులు వీరులూనూ. రాయలకు 'భువన విజయం'లాగా; నాయకునకు "ఇందిరా మందిరం" విద్వద్గోష్ఠులకు ఉపకరించింది. ఇద్దరు తీసుకొన్న వస్తువుల్లో, చేసిన రచనా విధానంలో విలక్షణత గోచరిస్తుంది. ఇద్దరూ రాజకవులు; కవిరాజులును; కృష్ణదేవరాయలు తదితర సమకాలిక కవుల కంటే విలక్షణంగా ఆముక్తమాల్యదను రచించి తరించాడు. మోహశృంగారం తన కాలం కవుల కావ్యాల్లో మోహరించి ఉండగా రఘునాథుడు రామాయణం రచించిన ఆదికవి వాల్మీకి చరిత్రనే రచించి తన తను ప్రకటించుకొన్నాడు. ఈ ఇద్దరు కవి తల్లజులు తమ ప్రబంధాల్లో చేసిన ...ను పరిశీలిద్దాం

ప్రబంధాలకు అష్టాదశవర్ణనలు జీవానిలాలు. తద్విరహితంగా ప్రబంధాలని ...చుకోవు. ఈ అష్టాదశ వర్ణనల్లో ఋతువర్ణనలు ప్రాధాన్యం వహిస్తాయి. కథకు ...నుగుణంగా; ఔచిత్యంతో ఈ ఋతు వర్ణనచేత తన ప్రత్యేకతను నిలబెట్టుకొన్నవాడు శ్రీ కృష్ణదేవరాయలు. సందర్భోచితమై అతికినట్లు గ్రీష్మ, వర్ష, శర, ద్వసంత వర్ణనలు ఆముక్తమాల్యదలో చేసిన విధం పరిశీలిస్తే కృష్ణదేవరాయల విశిష్టత గోచరిస్తుంది ఇలాగే ఔచితీ సహంగా, అవసరమైన వర్ణనలు మాత్రమే చేసినవాడు రఘునాథరాయలు. వాల్మీకి చరిత్రలో గ్రీష్మ వసంత ఋతువర్ణనలు మాత్రమే ఉన్నాయి ఇవి సందర్భోచితమై, కథకు అతికినట్లుండి సముచితంగా ఉన్నాయి. ఇదే రఘునాథుని విశిష్టత.

పాండ్య రాజైన మత్స్యధ్వజ మహారాజు సామ్రాజ్య వైభవం అనుభవిస్తూన్న సమయంలో వేసవి వర్ణన ఆముక్తమాల్యద రెండో ఆశ్వాసంలో అమోఘంగా చేశాడు కృష్ణదేవరాయలు, 25 పద్యాల్లో విపులంగా సాగింది వర్ణన. సప్తర్షులు తీర్థ సందర్శనార్థమై బయలుదేరి ఆయా తీర్థాల్ని సందర్శిస్తూ కాశీ పట్టణం దర్శించి మణి కర్ణికలో స్నానాలుచేసి కాశీ విశ్వేశ్వరుని సేవించే లోపల వేసవి ఆరంభమైనట్లు వాల్మీకి చరిత్ర రెండో ఆశ్వాసంలో అభివర్ణించాడు రఘునాథరాయలు. 1½ పద్యాల్లో వుంది వర్ణన. శ్రీ కృష్ణదేవరాయలు ఈ వేసవి వర్ణనలో ఉత్ప్రేక్షాలంకారాన్నే ఎక్కువగా ఆశ్రయించినా, స్వభావోక్తిని సైతం ఏడెనిమిది పద్యాల్లో ప్రయోగించడం విశేషం. పైపెచ్చు రాయల లోకజ్ఞత అడుగడుగునా కనిపించి మనలను ఆశ్చర్య చకితుల్ని చేసి ఆనందవార్ధిలో ముంచి తేలుస్తుంది. ఇది రాయల ప్రత్యేకత. రఘునాథుడు రాయల్ని అనుసరించినా తన ప్రత్యేకతను సైతం నిలబెట్టు కొన్నాడు.

వేసవి రాగానే నదీ ప్రవాహాలు ఇంకిపోగా చక్రాలలో పేరిన పాచి పెద్దగా బీటలు వారిందని (2-46) వర్ణించాడు రాయలు. ఇది స్వభావోక్తి. ఇందు రాయల లోకజ్ఞత స్పష్టమౌతుంది "ఎండమావులవల్ల అన్ని దిక్కులు భైరవుని కోసం ఉదికిన చీరలారగట్టిన చాకిరేవులో" అన్నట్లు (2-46) గోచరించాయని రాయలు ఉత్ప్రేక్షించడం మనోజ్ఞం. ఇలాగే రఘునాథుడు భైరవుని త్రినేత్రాగ్నిలోని వేడిమే లోకమంతా వ్యాపించిందో అన్నట్లు "గ్రీష్మమతి భీష్మంబై" (2-71) తోచిందని ఉత్ప్రేక్షించాడు. ఉత్ప్రేక్షలోనూ లోక సామాన్యమైన ఉతికిన గుడ్డలు, చాకిరేవు చెప్పడంలో రాయల లోకజ్ఞత మూలంగా సహజత వ్యక్తమౌతుంది. వేసవిని నీళ్ళు సూర్యరశ్మిచే హరింపబడగా మొరపెట్టుకొంటూ వెళ్ళుతున్న పాడునావులో అన్నట్లు సుళ్ళు తిరుగుతున్న సుడిగాలులు వ్యాపించాయని (2-48) రాయలనగా —

"సుడిగాలి ధూళిఁ జుట్టుచు
వడిగా నందంద తిరిగె వలయంబగుచున్
బుడమి యను బరణిఁ దెరఁదెరి
గెడు కీలనఁ జాలనట్టి గ్రీష్మము నందున్" (3-78)

అని వర్ణించాడు.

6)

ఇంతకంటే కృష్ణదేవరాయలు —

"పడమర వెట్టు నయ్యుడుకు ప్రాశన మొల్లక కూటి పేదలై
బడలిక నూడునచ్చిలువ ప్రగ్గములన్ రవి యాజ్ఞ మాటికిన్
ముడియిడం బిచ్చుగుంటు రథమున్నిలుపన్పయనంబు సాగమిన్
జడను వహించె నాఁగ దివసంబులు దీర్ఘములయ్యె నత్తరిన్" (2-49)

పద్యంలో పగటి పూటలు దీర్ఘం కావడానికి హేతువు నుత్ప్రేక్షించాడు పశ్చిమ దిక్కునకు వీస్తున్న గాలి వేడిగావడంవల్ల దాని నాహారంగా స్వీకరించక. కూటికి పేదలై బడలికచేత ముళ్ళు వీడిపోతూన్న రథాశ్వాల పగ్గాలైన సర్పాల ముడి విడవడానికి సూర్యునాజ్ఞతో సారెసారెకు రథసారథి అనూరుడు రథం నిలపడంవల్ల ప్రయాణ వేగం మందగించెనేమో అన్నట్లు గ్రీష్మకాల మందలి పగటిపూటలు దీర్ఘమయ్యాయట. ఇలాగే ఉత్ప్రేక్షాలంకారంలో పగటి పూటలు దీర్ఘంకావడానికి గల కారణాన్ని రఘునాథుడిలా వర్ణించాడు.

"బడిచనుదెంచు చాయ ధరఁ బాంథుల తాపము తీరనక్కడ
క్కడఁ తరుజాల మూలములఁ గ్రమ్మరుచు నిల్వఁగ దాని గ్రుచ్చి కో
వడిఁ గరపాళియొత్తి దినవల్లభుఁడల్లన సాఁగె నాఁగన
య్యెడ నతి దీర్ఘభావము వహించె నహంబుఁ హోమహో గ్రతన్"

(2-73) బాటసారులను ఎండ వేడిమి నుంచి రక్షించడానికి ఛాయాదేవి చెట్ల మూలల్లోని నిలచిపోతూ వుండగా; ఆమెను తన కరాలతో గ్రహించి తనతోపాటు కొనిపోవడానికో అన్నట్లు సూర్యుడు సాగాడట. అందుచేత ఆలస్యమైంది. ఆ ఆల స్యంతో అహస్సులు దీర్ఘమయ్యాయన్న కారణం చెప్పాడు రఘునాథుడు. అందు 'పయనంబు సాగమిన్ జడను వహించెనాఁగ దివసంబులు దీర్ఘములయ్యె నత్తరిన్!' ఇందు "అల్లనసాఁగె నాఁగ నయ్యెడ నతిదీర్ఘము వహించె నహంబు లహోమ హోగ్రతన్"! రెంటిలోనూ ఉత్ప్రేక్షాలంకారమే ఉన్నా రాయల కంటే సహజంగా సరళంగా చెప్పాడు రఘునాథుడు. ఇది ఈతని స్వతంత్రత ఇంకా సూర్యుని వేడిమి కాల్చగా గాలివల్ల పైకెగసిన బూడిద సమూహమో అన్నట్లు బూరుగ దూది ఆకాశ

ాడు రాయలు. కాగా పద్యన్యానికి లంచమివ్వడానికి బంగారు
కె త్తినవేమో అన్నట్లున్నాయట (2-52) నీరింకిన నదులు.

ీన పగటి బీటెండ దాఁకి
ంన వేఁబొండు మల్లె పొదల
టలై కడు దొడ్డలగుచుఁ
గ్గలగము లగ్గిబొబ్బలట్ల' (2-56)

డం రాయలకే చేతనౌతుంది. కాగా —

ావి క్రియ నావిరెగయఁ బగటి
ంకాఱకుండ భూమండలమునఁ
ుఁ బండు వెన్నెలచకోర
జాఁపట్టు వోసినట్టు' (2-60)

యల లోకజ్ఞతకు నిదర్శనం. అతిశయించిన ఆవిరో
డిమి ఆరని భూమిపై మాపటివేళ చకోర పక్షులకోసం
ండు వెన్నెల వొప్పిందని రాయలు ఎంతో చక్కగా ఉత్ప్రే

ెడిదంపు వెట్టకతన
ుర్చి సారెకు ల స్తకంబు
'దె సవరింప వసముగాక
చెఱకు విల్పుడమిఁ బడియె". (2-65)

డు రాయలు. రాయల ఈ పద్యంలోని మొదటి పాదం
డు రఘునాథుడు.

"అట్టి వేసవి బెడిదంపు వెట్ట కతన
నేలనందంద విరిసిన నెఱియలందుఁ
దరణి పాదంబు లెడ నెడఁ దవుల మెల్లఁ
దివిచి కొనిపోవ దివసంబు దీర్ఘమయ్యె" (2-74)

అయితే ఇక్కడ విషయం వేరు. "బడి చనుదెంచు (2-73) పద్యంలోని భావాన్నే మరో విధంగా చెప్పుకొన్నాడు రఘునాథుడు. ఏమైనా రాయల మీద ఎంతో గౌరవం ఉంటే గానీ ఆ పాదాన్ని రఘునాథుడు యథాతథంగా గ్రహించడు గదా ? ఆ మాత్రం రచించడం చేతకాక కాదు. ఆ రచన మీది గౌరవమే ఇంతచేసింది. "తరుణుల్" (2-66) అన్న రాయల పద్యంలో చక్కని ఉత్ప్రేక్ష ఉంది. ఇది మనోజ్ఞమైన భావన. "గ్రామ గ్రామంబున" (2-89) పద్యంలో వేసవిలో భూమిపై కుంపటిలో తామరలో అన్నట్లు చలివేందిరాలున్నాయట. "తోటఁబగలుండి" (6-70) పద్యంలో వర్షాన్ని సూచించడానికి గుడ్డుతో కూడా వచ్చే ఎఱ్ఱచీమలలో అన్నట్లు ప్రజ లున్నారంటాడు రాయలు. ఇవన్నీ ఉత్ప్రేక్షాలంకారానికి ఉదాహరణలు.

ఇక రాయలు స్వభావోక్తిలో చక్కగా గ్రీష్మ వర్ణన చేయడం గమనిద్దాం. ఎడ నెడ నారికేళ పాకమే ఉన్నా స్వభావోక్తి అలంకార ప్రయోగం చేయడంలో సమర్థుడు రాయలు. వేసవి వర్ణనలో ఈ స్వభావోక్తికి జోటు కల్పించడం విశేషమన్నది పూర్వోక్తం. చేపల వాసనలతో ఒదిగి వుండి, నత్తగుల్లలు, ఎండ్రకాయలను తింటూన్న కొంగలతో చెరువులలోని నీరు జానుదఘ్నమైందన్న విషయం "నులివాడు" (2-53) లోనూ; నీళ్ళుండగా పెద్దపెద్ద చేపలను తిన్న పెద్ద కొంగలు వేసవిని నీళ్ళింకిపోగా బొమ్మిడాలనే చిన్న చేపలను సైతం తిన్నాయని "మీటగు మీలనెల్ల" (2-54) పద్యంలోనూ చక్కగా వర్ణించాడు రాయలు. ఇంతకంటే ముఖ్యంగా ఏతాం ఎత్తేప్పుడు ఉదయాన బొక్కెనల శబ్దం మద్దెల ధ్వనిలాగ ఉండగా, ఏతాం తొక్కేవాళ్ళు పాడుతూన్న పాటలు ఎంతో మనోజ్ఞంగా వున్నాయంటూ "ప్రాతర్వేళల నట్టి వెట్ట సొగసై" (2-55) పద్యంలో వర్ణించిన రాయల లోకజ్ఞత స్పష్టం కాగా,

"తారుణ్యాతిగ చూతనూత్న ఫలయుక్తైలాభిఘారస్వన
ద్ధారా ధూపిత శుష్యదంబు హృతమాత్స్యచ్ఛేద పాకోద్గతో
దారంపుంగన రార్చు భోగులకు సంధ్యావేళలంగేళి కాం
తారాభ్యంతర వాలుకాస్థిత హిమాంతర్నారికేళాంబువుల్" (2-68)

పద్యంలో వేసవిలో భోగులు కొత్తమామిడి ముక్కల్ని తాలింపువేసి వండిన చేపల కూరతో భోజనం చేయగా కలిగిన కనువుపోయేట్లు ఉద్యానవనాల్లో ఇసుకలో పాతిపెట్టిన కొబ్బరి కాయల్ని బయటకు తీసి వాటి నీళ్ళను సాయంకాలం తాగుతూంటారు అంటాడు రాయలు. ఇది బహుశః రాయల అనుభవమే ఇలాగే రఘునాథుడు సైతం —

"పటపట వగిలెం గుంభిని
తటపట పథికుల మనంబు తల్లడ పడియెన్
చిటచిట నెగసెన్ దవశిఖి
కటకట గ్రీష్మం బొకింత కనఁబకు నంతన్." (2-72)

అని స్వభావోక్తిని చక్కగా ప్రయోగించడం గమనించదగ్గది

రాయలు వేసవి వర్ణన సందర్భంలో హాస్యాన్ని పరిపోషించి ఉండడం మరీ విశేషం. ఇందు తన శృంగార ప్రియత్వానికి లేదా రసికతకు హాస్యం ఆధారభూత మైంది.

"తొడిబడ నమ్మలక్కలని తూలుచు దీనత దోయిలొగ్గుచున్
వడమటి తేరఁదేర నలవాక్యము లెన్నక మోము గుబ్బలున్
గడుకొను కక్షదీప్తులు నెగాదిగ గన్గొను చిట్టకంపుఁ ద్రా
గుడఁగని సన్నల న్నగిరిక్రోల్పక పాంథుఁ బ్రపా ప్రపాలికల్" (2-59)

వేసవిలో బాటసారులు దాహంతో "అమ్మా, అక్కా" అంటూ దీనంగా దోసి లొగ్గివచ్చి చలివేందిరాల్లోని స్త్రీలు నీరుపోయగా తాగి, కొంత సేదదీరిన ఆ బాట

సారులు ఆ స్త్రీల కన్నులు, ముఖాలు, స్తనాలు, కక్ష భాగాలు చూస్తుండగా ఆ స్త్రీలు నవ్వారట. వారి కాముకత్వాన్ని గమనించి ఇందు హాస్యం సైతం పోషించడం రాయలకే సాధ్యమైంది.

ఇలాగా శ్రీకృష్ణదేవరాయలు అనన్య సామాన్యంగా ఋతువర్ణన చేయడం లోనూ, ప్రతిభా లోకజ్ఞతల్ని ప్రకటిస్తూ వేసవి వర్ణన గావించడంలోనూ తన ప్రత్యేకతను నిలబెట్టుకొన్నట్లు స్పష్టం. ఆదే రీతిని రఘునాథరాయలు సైతం ఎడనెడ అనుసరించినా కృష్ణదేవరాయలతో అన్ని విధాలా సాదృశ్యాన్ని, స్వతంత్రతను చూపినట్లు సువ్యక్తమైంది. శ్రీకృష్ణదేవరాయ, రఘునాథ రాయలిద్దరూ రాజకవులే గాదు, కవిరాజులూనూ అనడం అతిశయోక్తిగాదు; స్వభావోక్తి !

(సమాలోచన, 1-5-1979)

# అర్థాంతరన్యాసాలంకారము -

# పెద్దన తిమ్మనలు

అలంకారాలు కావ్య కన్యకు చక్కటి అలంకారాలు. స్వతస్సిద్ధంగానే ఒక వ్యక్తి సౌందర్య సముపేత అయి ఉండవచ్చుగాక. కానీ భూషణాలవల్ల సౌందర్యం ఇనుమడిస్తుందనడం ప్రకృతిలో విరుద్ధమేమీ కాదు. అలాగే నిరలంకృత అంగన కావ్య లలన మనోజ్ఞురాలే అయినా, ఈ అలంకారాలతో సహృదయ హృదయాల్ని రంజింప చేస్తుందనడం సముచితమే; అర్థాలంకారాలన్నింటా అర్థాంతరన్యాసాలంకారానికి ఒక ప్రత్యేకత ఉంది. లోక సామాన్య విషయాన్ని చెప్పి విశేష విషయంతో సమర్థించడంగాని, విశేష విషయాన్ని లోక సామాన్య విషయంతో సమర్థించడం గానీ అర్థాంతర న్యాసాలంకారం: లోకసామాన్య విషయ మనగానే అందరికీ అందుబాటులో ఉండే విషయ మన్నది స్పష్టం కనుకనే తక్కిన అలంకారాలకంటే దీనికి ప్రత్యేకత ఉందనడం. ఈ అర్థాంతర న్యాసాలంకారాన్ని అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మనలు ప్రయోగించిన విధం దిఙ్మాత్రంగా పరిశీలించడమే ఈ చర్చా సారాంశం.

ఇతివృత్త నిర్మాణ దక్షతా, పాత్రపోషణ సామర్థ్యమూ, ఆలంకారిక రచనా నైపుణ్యమూ మొదలైన వాటితోపాటు పాత్ర చిత్రణా చణత్వం ప్రబంధ కవులకు తప్పనిసరి అయిన విశిష్ట గుణం. ఈ పాత్ర చిత్రణలో సిద్ధహస్తులు అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మనలు. పురుషుని ఔన్నత్యాన్ని మనుచరిత్రలో ప్రతిపాదించి - తదుచిత పాత్రచిత్రణ చేశాడు పెద్దన. స్త్రీ అధికారాన్ని పారిజాతాపహరణంలో తెలిపి దానికి అనుగుణ పాత్రపోషణ గావించాడు తిమ్మన. వాస్తవానికి ఆ యా కథావస్తువుల్లోనే ఆ వైపరీత్యం ఉంది. దీన్ననుసరించే పాత్రపోషణ చేయబడింది. వరూధినిని ప్రవరుడు "పొమ్మంచున్", తోయడమూ సత్యభామ కృష్ణుని తలను వామపాదంతో తొలగదోయడమూ - అన్న రెండు ఘట్టాలు మనుచరిత్రా, పారిజాతాపహరణాలకు ఆయువుపట్టులు. వీటి మీదనే ఆ రెండు కథలూ ఆధార

పడ్డాయి. ప్రవరుడు వరూధినీ వశంవదుడైతే, సత్య అంతటి కోపాన్ని కృష్ణునిపై చూపకపోతే ఆరెండు కథలూ అలా నడిచేవి కావు. వీటి మూలంగానే మనుచరిత్రలో పురుషుని ఔన్నత్యమూ; పారిజాతాపహరణంలో స్త్రీ ఆధిక్యమూ నిరూపితం

పెద్దన అర్థాంతరన్యాసాలంకారాన్ని చాలాచోట్ల ప్రయోగించాడు మను చరిత్రలో ఈ అలంకారాన్ని సందర్భోచితంగా, అతికినట్లు ప్రయోగించడంలో అందె వేసిన చేయి ఇతడు. ప్రవరుడు హిమవత్పర్వత విశేషాలు తిలకిస్తూ ఉండగా పాదలేపనం 'నీహారవారి బెరసి' కరిగిపోతుంది కరిగిపోయిన సంగతి ప్రవరునికి తెలియదప్పుడు. ఆ సందర్భంలో 'దైవకృతమున కిల నసాధ్యంబు గలదె' అన్నాడు కవి. పాదలేపనం కరిగిపోయిందని తెలిసిన ప్రవరుడు 'బుద్ధి జాడ్య జనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్' అని తన్నుతాను నిందించుకొనే సమయంలో అనుకొంటాడు. మోహపరవశ అయిన వరూధిని ఎన్నో విధాలుగా ప్రవరుని వశపరచుకో జూచింది. కానీ ప్రవరుడు మాత్రం లొంగలేదు 'ఆనందో బ్రహ్మ' అని, 'ప్రాజదువు' చెప్పింది 'ఈ పాండిత్యము నీకుఁదక్క మఱి యెందేఁగంటిమే, కామశాస్త్రోపాధ్యాయిని నావచించెదవు.' అనీ, 'మోహలక్ష్మి పత్యాగము సూత్ర పంక్తి కివె పో మీ సంప్రదాయార్థముల్' అనీ భంగ్యంతరంగా నిందించీ 'నా కరణుల్ దర్భలు నగ్నులున్ ప్రియము లైనట్లన్యముల్'గావు అనీ తన లక్ష్యాన్ని ఎరిగించీ, 'ఒడల్ తిరమే' అని హెచ్చరించీ; చివరికి 'ఇట్టి తుచ్ఛ సుఖముల్ మీసాలపై తేనియల్ చెప్పకు'మనీ త్రోసిపుచ్చాడు ప్రవరుడు. వరూధిని 'మాటలేక హృదయాబ్జము జల్లన మోము వెల్లనై కనలుచు, నీరు దేఱు తెలిగన్నుల నాతనిఁ బుల్కు పుల్కునం గనుగొని', 'తలయూచి' అక్కటా ! వనిత తనంతఁ దావలచి వచ్చినఁ జుల్కన గాదె యేరికిన్' అని స్త్రీ సహజ ధోరణిలో మిక్కిలి వాపోతుంది అయినా. 'నీ పై బంధ మూడదన్' నిట్టూర్పు లతిశయించగా, కొప్పువీడి పూలు రాలుతూండగా, పులకిత గాత్ర అయి 'అనునయాలాపదీనాస్యయై' 'రతి సంరంభము మీఱ'గా 'పైపాటునన్', 'ప్రాంచద్భూషణ బాహుమూల రుచితోఁ జాలిండ్లు పొంగారఁబై యంచుల్ మోవఁగ గౌఁగిలించి యధరం బాసించింది. వరూధిని. వెంటనే ఆ బ్రాహ్మణుడు 'హా ! శ్రీహరీ !' అంటూ 'ఓర మోమిడి' ఆమె రెండు భుజాలూ అంటి 'పొమ్మంచున్ ద్రోశాడట ! ఈ సందర్భంలోనే "కలంచునే సతుల మాయల్ ధీర చిత్తంబులన్" అంటూ కవి అర్థాంతరన్యాసాలంకారంలో ప్రవరుని సమర్థిస్తున్నాడు ధీరుల

మనస్సులను స్త్రీల మాయలు కలంచలేవంటాడు కవి. సామాన్య మానవుడైన ప్రవరుడు, దేవకన్య, సౌందర్యరాశీ అయిన వరూధిని పైపాటునరాగా త్రోసిపుచ్చడం విశేష విషయం. ఈ విశేష విషయాన్ని ధీర చిత్తులను స్త్రీల మాయలు కలంచలేవన్న సామాన్య విషయంతో సమర్థిస్తున్నాడు పెద్దన. ప్రవరుడు 'పొమ్మంచున్' వరూధినిని త్రోయడంలోనే ఈ కథావస్తువు సమస్తమూ ఆధార పడిందన్నది పూర్వోక్తం. పైగా ఆయా పాత్రల మనస్తత్వాలూ దీని మూలంగానే సువ్యక్తమవుతాయి. తుచ్ఛ సుఖాలపై ఆశలేని ప్రవరుడూ, అపురూప సౌందర్య లబ్ధి అయిన వరూధినీ — ఈ రెండు పాత్రల చిత్తవృత్తులు అవగతమవుతాయి. ప్రవర సౌందర్య లోలుపా, విరహవ్యథా భరిత మనస్కా అయిన వరూధినిని మాయా ప్రవరుడు చేజిక్కించుకో గలుగుతాడు ఆ వెనుక. దానితోనే తరువాత కథ నడిచింది. ప్రవరుని ధీర మనస్కతను ఈ అర్థాంతరన్యాసాలంకార ప్రయోగంతో చక్కగా వ్యంజించాడు పెద్దన. తన్మూలంగా పురుషుని ఔన్నత్యాన్ని చక్కగా చిత్రీకరించాడీ మహాకవి. ఇలాగే మనుచరిత్ర అంతటా ఈ సూత్రం పాటించబడినట్లు స్పష్టం.

తిమ్మన ఈ అర్థాంతరన్యాసాలంకారాన్ని ఎక్కువగా ప్రయోగించలేదనే చెప్పాలి. అయినా వాడిన కొన్ని పట్టులందు మాత్రం అది ఎంతో ప్రాధాన్యం కలిగి ఉండడం విశేషం. నారద మహర్షి తెచ్చియిచ్చిన పారిజాత పుష్పం, కృష్ణుడు రుక్మిణి కిచ్చాడన్న వార్త చెలి వల్ల విన్న సత్యభామ "ప్రేటువడ్డ యురగాంగన," అయినది. "నేయివోయ భగ్గనదరికొన్న భీషణ హుతాశన కీలయనంగ" లేచింది. కృష్ణుని ధూర్త గోపాలుడని నిందించింది. సవతు లందరిలోను పెద్దగా గౌరవింపబడింది తాను. ఈవాడు తన్ను గురించి వాళ్ళంతా గుసగుస లాడుతూంటే చూడ గలనా ? అని బాధపడింది; ఇంత కాలమూ తనపై కృష్ణుడు చూపిన ప్రేమ కేవలం బూటకమని తలంచింది. చివరికి —

"పతిప్రాణ సదృశ బంధువు,
పతిదైవం, బేడుగడయుఁ బతిసతులకు, స
ద్గతియె కడుమేర దప్పిన
గతి కుల కాంతలకు పేఱుగలదే చెపుమా!"

7)

**అనీ —**

"ధనమిచ్చి పుచ్చుకొన్నను
మనమున నోర్వంగ వచ్చు; మగఁడింతులకున్
జనవిచ్చి పుచ్చుకొన్నను
మనవచ్చునె ? యింక నేటి మాటలు చెలియా !" (1-96, 97)

అనీ స్త్రీకి సహజంగా బాధాకరమైన వాటిని పేర్కొని మిక్కిలి వగచింది. ఇంక ఏ మాత్రమూ ఆ కోప భారాన్ని మోయలేని సత్యభామ కోపగృహం చేరింది. అప్పుడామె "హరిచందన కోటరమునకు నాగతరుణియుఁబోలె" వెళ్ళిందట. భూషణ రహిత అయి, "మాసిన చీర గట్టుకొని, మౌనముతోడ లోగానిలి "చీకటింట కద కంకటిపై జలదాంత చంద్రరేఖా సదృశాంగియై" "గాఢ మనోజ విషాద వేదనన్", పొర్లుతూంది.

ఈ సందర్భంలో ఆమెకు కలిగిన బాధాధిక్యాన్ని ఎంతో చక్కగా వర్ణించాడు తిమ్మన. "మదహస్తి హస్తగత పద్మినియుంబలె" ఉన్నదట ఆమె ఆ సమయంలో కృష్ణుడు వచ్చాడు. భవనం కళారహితంగా ఉంది. పూర్వపు శోభ లేదు. సత్య ఎక్కడా కనిపించక పోగా కోప గృహం చేరాడు కృష్ణుడు. అక్కడ ముసుగు వైచుకొని ఉన్న ఆమెను చూచి; ఒక చెలి చేతిలోని వీవన తీసుకొని విసరుతూండగా, పారిజాత పరిమళానికి ఆశ్చర్యపోయింది సత్య. ఒక్కసారి చూసి, పెల్లుబికి వచ్చే క్రోధంతో మళ్ళీ ముసుగు పెట్టింది. ఆ మానవతి "మాన క్రోధములచేఁ గుమారిల చింతా దీనగతి"నుండగా, కృష్ణుడనునయించ నారంభించాడు అన్నీ చెప్పి "నీ పనిచిన పంపుసేయుటయ ప్రాభవమౌటది నీ వెఱుంగవే ?" అని బుజ్జగించ యత్నించాడు. చివరికి "మధురాధరామృతమూ" "బాహుపరీరంభమూ" కాకపోయినా "ఒక్కింత నీ నిలువాలుంగడ కంట, జూడు" మంటూ నిలువలేక సత్య 'పై చెఱంగు ఁడియ బట్టబోయాడు. కోప భారంతోనూ, విరహ వ్యథతోనూ బాధాక్రాంత మనస్క అయిన సత్యభామ సహించలేక 'చేవిరిదమ్మి వ్రేయుటకు ఫ్రీ యుంకించి జంకించిన'దట. ఆమె కోప భారాన్ని పోగొట్ట గలదీ, తనకిక మిగిలిందీ నమస్కారమే. అంచేతనే కృష్ణుడు తన కిరీటములోని మణి పంక్తికివన్నె బెట్టుతూన్న సత్యభామ ఎఱ్ఱనైన పాదాలకు 'అర్మిల మ్రొక్కె, మ్రొక్కినన్' —

"జలజాతాసన వాసవాది సురపూజా భాజనంబై తన
ర్చులతాంతాయుధు కన్నతండ్రి శిరమచ్చో వామపాదంబునం
దొలఁగం ద్రోచె లతాంగి; యట్లయగు నాథుల్నేరముల్సేయఁ బే
రలుకం జెందిన యట్టి కాంత లుచిత వ్యాపారముల్నేర్తురే". (1–121)

సత్యభామ 'వామపాదం బునం దొలఁగం ద్రోచింది'; ఆ తోచింది కృష్ణుని తలను; ఆ కృష్ణుడో, బ్రహ్మ, ఇంద్రుడూ మొదలైన సర్వ దేవతలకు పూజా పాత్రుడూ, మన్మథుని కన్న తండ్రీ అయినవాడు. అలాంటి కృష్ణుని తలను వామ పాదంతో తొలగ దోయడం దోషంకాదా ! అంటే 'అట్లయగు', అది అంతే అంటూ సమర్థిస్తున్నాడు కవి. భర్తలు తప్పిదాలు చేస్తే 'పేరలుకం జెందిన కాంతలు'— అత్యధిక కోపగ్రస్థలైన భార్యలు 'ఉచిత వ్యాపారముల్ నేర్తురే ?'— ఇది ఉచి తమూ, అనుచితమూ అన్న వివేకం కలిగి ఉంటారా ? అంటూ సమర్థిస్తున్నాడు కవి. కానీ వాసవాని కిది ద్రోహమేనని కవి హృదయంలో ఎక్కడో ఉందనడం ఉచిత వ్యాపారముల్ నేర్తురే,' అనడం వల్ల ద్యోతకమవుతూంది. అయినా అది అంతే అంటూ సమర్థిస్తున్నాడు కవి. సత్యా పాద తాడనంతో కృష్ణునకు గగుర్పాటు కలిగిందట. పైగా 'నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁ గిన్కఁ బూని తాఁ చినయది నాకు మన్ననయ,' అని వాచ్యం చేశాడు. ఇంకా 'చెల్వగు నీ పద పల్లవంబు మత్తను పులకాగ్రకంటక వితానముఁ దాకిన నొచ్చునంచు నేననియెద' 'ఇఁకనైన అలుక మానవుగదా' అనీ బుజ్జగించాడు. దానితో ఆమె కోపంతో మిక్కిలి నిందించింది కృష్ణుని; చివరికి స్త్రీ సహజ రీతిని దుఃఖించింది. కుహనా గోపాలుడు సత్యపాద నమస్కారంచేయడమూ, ఆమె వామపాదంతో తాడనం చేయ డమూ, ముఖ్యసంఘటన. దీన్ని కవి అర్థాంతరన్యాసాలంకారంలో సమర్థించడం మరీ ముఖ్యమైనది. తాపుదిన్న కృష్ణుని చేత ఒక పారిజాత పుష్పమే గాదు, స్వర్గంలోని పారిజాత వృక్షాన్నే వ్రేళ్ళతో పెకిలించుకొని వచ్చి తన పెరట్లో నాటించుకొన గలి గింది సత్య. తన్మూలంగా స్త్రీ ఔన్నత్యాన్ని నిలబెట్టుకొంది.

కాగా మనుచరిత్రలో పురుషుని ఆధిక్యమూ, పారిజాతాపహరణంలో స్త్రీ గొప్పదనమూ అడుగడుగునా ప్రతిపాదితం. మాయా ప్రవరుని చేత 'ఒక్కొక్క వేళఁ బద్మముఖులొల్లమి సేయుదు రొక్క వేళఁ బెన్మక్కువ నాదరింతురు, క్షణ

క్షణముల్ జవరాంధ్ర చిత్తముల్', అని స్త్రీలు చపల చిత్తులనీ, వారి స్వభావాన్ని వ్యక్తపరుస్తూ అనిపిస్తాడు పెద్దన. దీనికి వ్యతిరేకంగా పురుషులే చపల స్వభావు అంటూ సత్యభామ చేత 'శరదంబుద చలచిత్తులు పురుషులెవో వారి నమ్మబోలునె చెలియా ?' అని చెప్పిస్తాడు తిమ్మన.

ఇలాగా అర్థాంతరన్యాసాలంకార ప్రయోగంతో ప్రముఖ ప్రబంధాలైన మను చరిత్ర, పారిజాతాపహరణాల్లో చక్కగా ఆ సన్నివేశాల్ని నిర్వహించి, కథకుపక్క రించేలా చేసి, పాత్రల చిత్తవృత్తులను సుస్పష్టం గావించారు పెద్దన, తిమ్మన మహా కవులు.

(స్రవంతి, డిశంబరు 1975)

# పరమేశ్వర భక్తి పరతంత్రుడు - ధూర్జటి

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలోని అష్టదిగ్గజ కవులలో ఒక కవీభం ధూర్జటి; అదీ నిరంకుశమదేభం. విశిష్టమూ, ప్రత్యేకమూ అయిన వ్యక్తిత్వం గలవాడు ధూర్జటి. స్వతంత్ర ప్రవృత్తి అతని జీవితంలో అడుగడుగున కన్పిస్తుంది. అందుకు నిదర్శనం — అతని మతమూ, తదనుగుణమైన రచనలు తన ప్రభువు వైష్ణవుడు; వైష్ణవ మతసంబంధమైన విష్ణుచిత్తీయమనే ప్రబంధ కర్త. సాటి కవులు ఇంచు మించు వైష్ణవులు. కానీ ధూర్జటి మాత్రం తన ప్రభువును గాని, తదితర కవులను గాని, లెక్కచేయక పరమేశ్వరుని తన ఇష్ట దైవంగ ఎంచుకున్నవాడు. అతడు శైవుడైనను పాల్కురికి సోమనాథుని వలె వీరశైవుడు మాత్రం కాడు. ఇతర కవులు చిన్న కథలను ప్రపంచించి, లేదా కల్పించి స్వకపోల కల్పనలచే ప్రబంధాలు రచించగ ధూర్జటి హరవిలాసాలను ప్రకటించే శ్రీకాళహస్తి మాహాత్మ్యం ప్రబంధంగ రచించాడు. తన కావ్యాన్ని రాయలకుగాక తన ఇష్టదైవమైన శ్రీకాళహస్తీశ్వరునికే సమర్పించాడు

శా॥ "వాగర్థంబులు శ్రోతృ వక్తలు, జగద్వంద్యుండు నద్వైత వి
ద్యా గోష్ఠిన్ వివరింప నీశ్వరుడ కాదా మత్ప్రబంధాధిప
త్యాగణ్యార్హుడు వేయికంటు గలదే యీమాట లేలంచుఁజే
తోగమ్యుండగు కాళహస్తి పతి నాథుంగా సమర్థించితిన్" (1-7)

— అని కృత్యాదిని తన "సత్కృతి కన్యా రత్నము"నకు తగిన వరుడు శ్రీకాళహస్తీశ్వరుడని తలంచాడు. శ్రీకాళహస్తీశ్వర శతకంలో ఆత్మ నివేదనం గోచరిస్తుంది. శివసాయుజ్యం పొందాలన్న అతని తపన విశదమవుతుంది.

"అవాచీన స్థాణు నగరం"బని పేరెన్నిక గన్నది శ్రీకాళహస్తి క్షేత్రం. ఇందు లూత, భుజంగ, మాతంగాలు ముక్తిపొందడంవల్ల వాటి పేరు మీదుగా 'శ్రీకాళ హస్తి' యని ప్రసిద్ధి కెక్కినది. ఈ ప్రబంధానికి ముందు వెనుకల క్షేత్రమాహాత్మ్య లను దెలుపు స్థల పురాణాలు వెలిశాయి. ఎఱ్ఱాప్రెగ్గడ నృసింహపురాణము, శ్రీనాథుని

భీమ ఖండమను నామాంతరము గల భీమేశ్వర పురాణము; తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము అనేవి ముఖ్యం అహోబల నృసింహక్షేత్ర మాహాత్మ్యం దెలిపే నృసింహ పురాణం, పాండురంగ మాహాత్మ్యము అనే రెండు వైష్ణవ మత ప్రధానాలు. శ్రీనాథ ధూర్జటులలో పోలికలు గలవు. ఇరువురు స్వతంత్రులు; ఇరువురు అచంచల హర భక్తి పరతంత్రులు; ఇరువురు మహా కవులు. స్థల పురాణాల్లో అశేష కీర్తి గడించిన కావ్యం భీమేశ్వర పురాణం. దక్షిణ కాశి యన బరగిన ద్రాక్షారామంలో నెలకొన్న హరుని లీలా మహిమల వ్యక్తంచేసే కావ్యం. ధూర్జటి దక్షిణ కైలాస మనబడు శ్రీకాళహస్తియం దధివసించిన పరమేశ్వరుని విలాసాన్ని వర్ణించే శ్రీ కాళహస్తి మాహత్మ్యం రచించాడు. కించిద్భేదము గలదు. శ్రీనాథుడు మరణాసన్న సమయం వరకు ఇహ సుఖములకై ప్రాకులాడినట్లు తెలుస్తుంది. ధూర్జటి సర్వ సౌఖ్యా లనుభవించినా చివరి దశలో సర్వం సర్వేశ్వరునకు సమర్పించి నట్లవగతమవుతుంది. ఇట్లీతని జీవితం భోగం నుంచి త్యాగానికి; ప్రవృత్తి నుంచి నివృత్తికి మరలినట్లు' గోచరిస్తుంది. ఇతర కవులు లౌకిక సుఖాలకై భగవంతుని వేడుకొనగ ఇతడు పారమార్థిక సౌఖ్యాలకై పరమేశ్వరుని ప్రార్థించాడు ఇందుకు తన శ్రీకాళహస్తీశ్వర శతకంలోని పద్యాలన్నీ ఉదాహరణలే. మచ్చు కొక్క పద్యం.

శా॥ "రోసీరోయదు కామినీ జనము తారుణ్యోరు సౌఖ్యంబులన్
పాసీపాయదు పుత్రమిత్ర జన సంపద్భ్రాంతి వాఛాలతల్
కోసీకోయదు నామనంబకట ! నీకుంప్రీతిగా సత్క్రియల్
చేసీచేయదు దీని త్రుళ్ళణపవే ! శ్రీకాళహస్తీశ్వరా !"

— ఎన్ని సౌఖ్యా లనుభవించినా, ఎన్ని సంపదలున్నా తనివిలేని మనోగర్వాన్నణచి ముక్తిని ప్రసాదించు మని శ్రీకాళహస్తీశ్వరుని వేడుకొంటున్నాడు ధూర్జటి.

ఇతడు తన నామం చేతను, భక్తి తత్పరతను ప్రకటించాడు. శివుడు మాయా జంగమ రూపంలోవచ్చి తన భక్తులు శివసాయుజ్యం పొందిన విధం యాదవరాజుతో చెప్పటమే శ్రీకాళహస్తి మాహాత్మ్యంలోని ఇతివృత్తం. ఇందలి కథలన్నీ శివభక్తి పారమ్యాలై ఉన్నాయి. శ్రీకాళహస్తుల కథలు, తిన్నడు, వేశ్యకన్యలు, నత్కీరుడు

అను భక్తుల కథలు ముఖ్యం. తిర్యక్కులైన శ్రీకాళహస్తులు తమ అచంచల భక్తి ప్రతిపత్తిని వెల్లడించాయి. తిన్నడు మూఢభక్తి గలవాడైనను దృఢ సంకల్పం గలవాడు. రాతియందు సర్వేశ్వరుని సందర్శించినవాడు. వేశ్యాకులంలో జన్మించిన వేశ్య కన్య లిరువురు తమ వృత్తి నసహ్యించుకొని పరమేశ్వర సాన్నిధ్యంకోసం పాటుపడ్డారు. నత్కీరుడు కవి, పండితుడు. అయినా శ్రీకాళహస్తులవలె గాని, తిన్నని వలెగాని సులభంగా శివైక్యం పొందలేక పోయాడు ఇందువల్ల భగవంతుడు అమాయకుడైన భక్తునకట్లు తక్కిన వారికి సాక్షాత్కరించడని విశదమవుతుంది. ఇందలి శివభక్తులలో ధూర్జటి వ్యక్తిత్వం ప్రతిబింబించింది. ముఖ్యంగా నత్కీరుడే ధూర్జటి అని తోస్తుంది.

అతులిత భక్తి సంపన్నమైన ప్రతి ప్రాణి శివపూజకి హరసాయుజ్యానికి అర్హమే అని ధూర్జటి వివరించాడు. తిర్యక్కులైన సాలీడు, కాళం; హస్తి — అను వాటికి ఆటవికుడై అనాగరికుడైన తిన్ననికి వేశ్యకుల జాతలైన వేశ్యాంగనలకు, సర్వజ్ఞాన సంపన్నుడైన నత్కీరునకు — శివుడు ముక్తి నిచ్చాడు ఇందులో తిర్యక్కులు, మానవులను భేదంగాని, మూఢులు జ్ఞానియనే విభేదం గాని, నీచోత్తమ కులమనే వర్ణ విభేదంగాని లేదు భగవంతుని దృష్టిలో అందరు సమానులే అయినా ముక్తికి ఆత్మనివేదనైక భక్తి అవసరం.

ధూర్జటికి సర్వమూ ఈశ్వరమయమే. ఏది వర్ణించినా శివపరంగానే ఉంటుంది. అతని పరమేశ్వర దృఢభక్తి అట్టిది.

చం॥ పరిచిత బంధనైపుణి, నపారకళానుభవ ప్రసక్తి, నా
దర సవివేక సంపద, సదాళుకవాక్య సుధానుభూతి, మో
హరహిత వృత్తిఁ బ్రస్ఫురదనంగ రహస్య విచారబుద్ధి, న
వ్వురమున కామినీ జనము పొల్తురు యోగిజనంబు పోలికన్" (1-24)

— శ్రీకాళహస్తి పుర వర్ణన లోనిదీ పద్యం. శ్రీకాళహస్తి పురంలోని కామినీ జనులు యోగి జనులుగా కవికి దర్శన మిచ్చారు. అతని యోగనిష్ఠాగరిష్ఠత కిది చక్కటి ఉదాహరణ.

ఈ కవి సర్వంలోను ధూర్జటికి దర్శిస్తాడు సమస్త వస్తువులు ధర్మాలు, శివసందర్భాలుగనే కనిపిస్తాయి.

"ఉదయ గ్రావము పానవట్ట మభిషేకోచ ప్రవాహంబు వా
ర్ధి, దరీ ధ్వాంతము ధూపధూమము, జ్వల ద్దీప ప్రభారాజి కౌ
ముది, తారానివహంబు లర్చిత సుమంబుల్గాఁ దమోదూర సౌ
ఖ్యదమై శీతగభస్తి బింబ శివ లింగం బొప్పుఁ బ్రాచీ దిశన్" (2-133)

— శివ పూజా నిమగ్నమైన భుజంగ మాతంగాలు తమ పూజా విఘ్నానికి కోప దుఃఖాలచే కృంగి మరుదినం ప్రాతః కాలమే ఒకటి కంటె మరొకటి ముందుగా శివుని సన్నిధి కరిగి శత్రు నాశనంచేసి వ్రతం సఫలం గావించుకోవాలని తలంచుతాయి. ఎప్పుడు సూర్యుడస్తమిస్తాడా, ఎప్పుడు తెల్లవారుతుందా అని తంపోస్తూ ఉంటాయి. ఆ సమయ లో సూర్యుడు క్రుంగగనే పై పద్యంలో చంద్రు డుదయించిన వర్ణన కలదు. ఉదయ పర్వతం పానవట్టంగాను, సముద్రమభిషేక జలంగాను, సూర్యాస్తమయంతో వ్యాపిస్తున్న చీకటి ధూపధూమంగాను; నక్షత్ర సమూహాలు శివ పూజకై సమర్పించిన పుష్పాలుగాను, చంద్ర బింబం శివలింగంగాను కవికి గోచరించాయి. ఇందలి వర్ణన అతి మనోహరమూ, మంజులమూ, సహృదయ భావనైక వేద్యమూను. ఇందు వర్ణనాచణ చమత్కార రచనతోపాటు శివభక్తి పారమ్యాన్ని విశదీకరించబడింది.

తన పూజకు హాని కలుగుటచేత కాళనాగము కుపితమై చింతించి సర్వపౌంఖము విడనాడి —

"నిద్రవోయెడు సుఖమెల్ల నేల గలపి,
ప్రతి దినంబును దాఁజేయు రత్నపూజ,
శివునిపై నుండ కుండినఁ జింతనొంది,
రాత్రి శివరాత్రిగా జాగరమ్ముఁ జేసెఁ" (2-119)

— నట! కాలసర్పానికి నిద్రరాని రాత్రి కవికి శివరాత్రిగా దోచిందట!

గర్భం ధరించిన తిన్నని తల్లి తండె వర్ణనమూ, తిన్నని జననమూ మొదలైన విషయాలను శివ పరంగా కవి వర్ణించాడు. శైలజాధిపుకరుణవల్ల —

"భసితాంగ రాగ శోభా విలాసంబుతోఁ
ప్రతివచ్చు నాననఁ బొందు గరిమ;
కంఠ హాలాహల కాళిమ చ్ఛవితోడ
నెనవచ్చు గుబ్బ చన్మొనల నలుపు,
పరశివాకృతితోడ సరివచ్చు నణుతరం
బనఁజాలి ఘనతరం బైన నడుము;
స్వస్వరూప విచార సంప్రాప్త శాంతితో
మార్పడు చిత్తైధ మాన జడిమ;

సరభసానంగ సంక్రీడ జరుగనీక
దౌహృదము గర్భమున నున్న తనయుఁ డీశుఁ
డై ప్రకాశింపఁ గలఁడని యపుడు తెలుపు
కరణి పెంపొందె నమ్మంద గామినికిని." (3-22)

— ఇందలి మనోజ్ఞ వర్ణన రసిక జనైక వేద్యం !

"శుభ ముహూర్తంబున నిభరాజ గామిని శివభక్తి మునుపైన శిశువుఁ గనియె" (3–27) తిన్నడు జన్మించాడు. ఆ బాలుడు "శివభక్తి రహితమై చెడియె జగంబని నవ్వీన ట్లొయ్యన నవ్వసాగె"ను. "విశ్వపతిత త్త్వమను మణి వెదకురీతి దర్పకారి జగత్పూర్ణుఁదాకు భీతి నడుగు వెట్టెడుగతిఁ దప్పటడుగువెట్టె" "ఇట్లు ప్రతిదిన ప్రవర్ధ మానంబులగు నతని గుణంబులకు శివభక్తి లక్షణోపమానంబులై చెలువొంద" బాలుడు పెరుగుతున్నాడు. తలిదండ్రులు తిన్నడని నామకరణం గావిం

చారు. ఇట్లు కవి తిన్నని జననాదికాన్ని నీలకంఠుని పరంగా రచించాడు. ఇట్టివే మనోహర శివ పరాలైన వర్ణనలు గావించిన మరొక కవి పాల్కురికి సోమనాథుడు. అతడు భవుడు తన్నావరింప వీరావేశాన్ని వర్ణించాడు. కాని ధూర్జటి వీరావేశంతో గాక నిజమైన భక్తి ప్రతిపత్తిని వ్యక్తం జేస్తూ సర్వం శివపరంగా వర్ణించాడు.

చివరకు సంఘంలో చిన్న చూపు చూడబడిన వేశ్యల్లోను పరమేశ్వరుని దర్శించినవాడు ధూర్జటి. మాణిక్యవల్లి అనే వారవనితకు "కన్యకలిర్వురు శివభక్తి తనువు లెత్తిన పగిదిన్" జన్మించారట. వారి బాల్యచేష్ట లతి మనోహరం. అవన్నీ పరమేశ్వర పరంగానే వర్ణితం

ఉ॥ "ఆ పసిబిడ్డ లేమి జననాంతర వాసనయో, కనుంగవం
జూపు లిగుర్చుచో శివునిఁ జూడఁ దలంతురు, పల్కనేర్చుచోఁ
దాపస మానసాంబుధి సుధాకరు శంకరు రూప వర్ణనా
లాపములాడఁ బోదురు, కళానిధి శేఖర భక్తియు క్తలై (4– 8)

ఆటలలో గూడా "కన్యకామణుల చిత్తమాడు నర్ధేందు శేఖరునందు నెపుడు." వారు "వేడ్కఁ జేసిన పనులన్నియున్ శివునిసేవ యొనర్పగ; బిడ్డ పాట్లుగా మన మున నూహసేయుదురు". ఇట్టి ఈశ్వర సేవాసక్తలైన వారాంగనలను "మానునె తొల్లిటి జన్మవాసనల్" అని కవి అర్థాంతర న్యాసంతో సమర్థించాడు నిజమే! "కన్యకలిద్దఱు శివభక్తి తనువులెత్తిన పగిదిన్" జన్మించారు కనుక తదనుగుణంగా ప్రవర్తించడం యుక్తమేగదా ?

ధూర్జటి శైవుడు. పోతన వైష్ణవుడు. కాని వారి భక్తి తత్వంలో పోలిక గలదు. గ్రహించిన మతాలలో భేదమున్నా ఇద్దరూ తాము నమ్మిన భగవంతుని యందు త్రికరణ శుద్ధిగా ఆత్మార్పణం గావించి లీనమైనవారు. మార్గాలేవైనా లక్ష్యం మాత్రమొక్కటే అనే విషయం వ్యక్తమవుతుంది.

వేశ్యమాత "ధనముగలిగిన జంగమార్చన మొనర్ప శివున కఖిలోపచారములన్ సేయవచ్చు" గనుక విటులను లాలించి సరస వినోదాల దేల్చి ధనం గడించాలని

బోధించగా పుత్రికలు వేశ్యావృత్తిపై యేవగింపును, పరమేశ్వర భక్తి యందాసక్తిని వ్యక్తం చేస్తూ తల్లికిచ్చిన సమాధానం ఉదాహరింప దగ్గది.

సీ॥ "శివునపేక్షించిన చిత్తంబు చిత్తజా
యత్తమై విటులపై నాస పడునె,
పరశివస్తుతి కథాభాషలు వినువీను
లానునే-కుంటెన లాడుపలుకు,
శివ్వరేశ్వరమూర్తి నీక్షింపఁగోరెడు
చూపన్యరూపంబుఁ జూడఁజనునె,
ముక్తివల్లభు నసురక్తిఁ గూడఁ దలంచు
కాయంబు గూడునె కాముకులను,
హరుని భవహరు శ్రీకాళహస్తి నిలయు,
వినుతి యొనరించు జిహ్వకు మనుజతతికిఁ
బ్రియముఁ జెప్పంగ బోవునె నయముమీఱ
వారధర్మోపదేశంబు వలదు తల్లి" (4–39)

— ఈ పద్యం వీనుల బడిన వెంటనే పోతన మనస్మృతి పథంలో మెదలు తాడు. పోతన భాగవతంలో హిరణ్య కశిపునకు ప్రహ్లాదుడు చెప్పిన –

"మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు బోవునే మదనములకు"

— అనే పద్యం గుర్తుకు వస్తుంది.

ధూర్జటి పోతన వలెనే భగవంతుని ఒక పర్యాయ ముచ్చరించి తనివి చెందని వాడు. భగవన్నామ స్మరణంలోనే పారవశ్యం చెందెడివాడు.

"విశ్వపతి ! విశ్వకల్పక !
విశ్వాత్మక ! విశ్వసాక్షి ! విశ్వంభర ! యో
విశ్వజని స్థితిలయకర !
విశ్వాధికుఁడనఁగ నిన్ను విందు మహేశా" (1-78)

అని పరమేశ్వరుడు తనకు ప్రత్యక్షమై నప్పుడు వశిష్ఠుడు చేసిన స్తుతి ఇది. ఇది ధూర్జటి గావించిన స్తోత్రమే అనవచ్చు.

ఒక కవి అంతస్సత్వాన్ని విశదీకరించే పట్టులు అశ్వాసాంత పద్యాలు. ధూర్జటి శివభక్తి పారమ్యానికి ఆశ్వాసాంతంలోని ప్రతి పద్యమూ ఉదాహరణమే. అదిగాక అభవుని యందుగల ఆత్మ నివేదనైక భక్తి తత్పరత కతని శ్రీకాళహస్తీశ్వర శతకం ముఖ్య నిదర్శనం ఇందు కందులోని ప్రథమ పద్యమే చక్కటి ఉదాహరణ.

శా॥ శ్రీవిద్యుత్కలితా జవంజవ మహాపాపాంబు ధా
రా వేగంబున మన్మనోబ్జ సముదీర్ణత్వంబు గోల్పోయి తిం
దేవా ! మీ కరుణా శరత్సమయ మింతే జాలుఁజిద్భావనా
సేవందామర తంపరై మనియెదన్ శ్రీకాళహస్తీశ్వరా !

— అని శివుని వేడుకొంటున్నాడు.

ఇలాగా ధూర్జటి మహాకవి అచంచల పరమేశ్వర భక్తి తత్పరుడు గనుకనే పర్వంలోనూ సర్వేశ్వరుని సాక్షాత్కరింప జేసుకొన్నాడు. సాక్షాత్కరింప జేసుకోవడమే గాదు ! శివసాయుజ్యం పొంది ధన్యుడయ్యాడు !

కృత్యాదిని ధూర్జటి కవి —

ఉ॥ ఈ శుభ కావ్య రత్నమున కీశు నధీశునిఁ జేసినన్ మహా
దేశిక సార్వభౌముడు మదింబ్రమదంబు వహించి ధూర్జటీ!
నీ శివభక్తి కావ్య సరణిం గడు ధన్యతఁబొంద నవ్య భా
షా శతధా నిగుంఫన రసస్థితి నొప్పు దలిర్పఁ జెప్పుమీ" (1 8)

— అని తన దేశికునిచే చెప్పించు కొన్నట్లు, అతని శివభక్తి వల్ల వాసి కెక్కిన కావ్యమూ, కావ్యం చేత ప్రసిద్ధికి వచ్చిన శివభక్తీ, కలకాలమూ ఆంధ్ర లోకాన్ని అలరిస్తూ ఉంటుంది!

(శ్రీ శైలప్రభ, జనవరి 1966)

# వసుచరిత్రలో వ్యోమయాన వర్ణన

గగనయానం వసుచరిత్రలో రామరాజభూషణుడు వర్ణించడం గమనించ దగ్గ విషయం. మంజువాణి ఆకాశయానం చేసి వచ్చిన విషయం ఇందు వర్ణితం. విజ్ఞాన శాస్త్రాభివృద్ధి మూలంగా ఈనాడు అభివృద్ధి చెందిన దేశాలు వ్యోమయాన విషయంలో పోటీ పడుతూన్న సంగతి మనకు తెలిసిందే. అమెరికా ప్రయోగించిన వ్యోమనౌకలో వెళ్ళిన వాళ్ళు చంద్రోపరితలంపై దిగి అక్కడి మట్టి తేవడంతో ఎంతో సంచలనం ప్రారంభమైంది. చంద్రమండలానికి వెళ్ళాలన్న కుతూహలం గలవాళ్ళు దరఖాస్తులు పెట్టడానికి ఎగబడ్డారన్న సంగతి మనకు సువిదితమే. ఈ మధ్యనే 'సోయుజ్-25' ను ఇద్దరు వ్యక్తులతో రోదసిలో పరిభ్రమింప వదలడం మరో విశేషం. దీని మూలంగా అనేక విషయాల అధ్యయనంచేసి వాతావరణ రహస్యాల్ని బయటపెట్ట వీలవుతుందని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఈ కలలు పండి ఫలిం, చాలన్నది అభినవమానవుని అభిమతం.

ఈనాడు విజ్ఞాన శాస్త్రాధ్యయనంవల్ల శాస్త్రజ్ఞుడు మేధను, ధనాన్ని వెచ్చించి సాధి చిన ప్రగతి వ్యోమయానం. ప్రాచీన భారతీయ శాస్త్రాల్లో, సాహిత్యంలో ఇదంతా వాస్తవమని చెప్పడానికి దగిన ఆధారాలున్నాయి. కానీ శాస్త్ర విజ్ఞానాన్ని మనం సంక్రమింప జేసుకోలేక పోయామంటారు విజ్ఞులు. నిజమే. క్షుద్రశక్తుల మాట అలా ఉంచి అణిమాది అష్టసిద్ధులు పూర్వం ఉండేవి. జల స్తంభన విద్య భారతం లోనిదే హనుమంతుడు సముద్రం లంఘించడం, సంజీవనీ పర్వతం కొనిరావడం— రామాయణంలోని సంగతే. కామరూపధారణ సైతం ఎడనెడ కాన్పించకపోదు.

ఇది ఇలా ఉండగా ఆకాశయానం మన సాహిత్యంలో అక్కడక్కడా గోచ రిస్తుంది. కాళిదాస కృత 'అభిజ్ఞాన శాకుంతలం' సప్తమాంకంలో ఇంద్రుని వీడ్కో లంది తిరిగివస్తూ మాతలి చోదిత రథంలో పయనిస్తూ ఆకాశంలోంచి భూమిని తిల కిస్తాడు దుష్యంతుడు. ముక్కు తిమ్మన పారిజాతాపహరణం ద్వితీయాశ్వాసంలో

గరుత్మంతునిపై ఆరూఢులై పారిజాతం కొని రావడానికి వెళుతూ సత్యాకృష్ణులు దేవలోకాన్ని సందర్శిస్తారు. ఇలాగే పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నం ప్రథమాశ్వాసంలో మాతలితోపాటు ఇంద్రుడు బయలుదేరి శ్రీకృష్ణ సందర్శనార్థం భూలోకానికి వస్తూ ఆకాశంలోంచి తిలకించి ద్వారకాపుర వర్ణనతో ఆనందిస్తాడు. ఇలాగే ఇంకా ఎన్నో.

వసుచరిత్రలో రామరాజభూషణుడు అన్ని విషయాలలోను తన పూర్వుల కంటే శ్రేష్ఠుడనిపించుకోవడానికో అన్నట్లు తన ప్రతిభా వ్యుత్పత్తుల్ని ప్రకటించడం గమనించదగ్గ విషయం. సంగీత సాహిత్య మర్మజ్ఞుడేగాక, శాస్త్ర విజ్ఞాన పరిజ్ఞాని రామరాజభూషణుడన్న సంగతి గూడా పలుచోట్ల అనేక విషయాల్లో స్పష్ట మవుతుంది. వసుచరిత్ర నాల్గో ఆశ్వాసంలో మంజువాణిచేత గగనయానం చేయించి తన ప్రతిభను ప్రకటించుకొన్నాడు రామరాజభూషణుడు. ఆకాశంలోనికి వెళ్ళి భూమినో, స్వర్గాన్నో తన పూర్వ కవులు చూచినట్లు వర్ణిస్తే రామరాజభూషణుడు పైకి ఆకాశంలోకి ఎగిసినప్పుడు కిందిభాగం ఎలా కనిపించిందీ, మళ్ళీ దిగుతూండగా ఎలా కనిపించింది సూక్ష్మ పరిశీలనతో వర్ణించాడు. తన్మూలంగా తదితర పూర్వ కవుల కంటే తానెలా శ్రేష్ఠుడెనదీ, తన ప్రతిభ ఏమిటీ, తన వ్యుత్పన్నత ఎలాంటిదీ అన్న సంగతులు స్పష్టంచేశాడు. ఇదే మన విచికిత్సకు మూలం; విజ్ఞానదాయకం. పరామర్శకు సావకాశం.

మంజువాణికి గగనయానశక్తినీ, కామరూపధారణశక్తినీ కల్పించాడు రామరాజభూషణుడు. గిరిక వసురాజుపై బాళిగొని, విరహవ్యథను అనుభవిస్తూండగా మంజువాణి —

"అబ్జముఖులార ! యేఁబోయి యచల కన్య
యుత్తలముఁ దెల్పి, వసురాజు చిత్త మరసి
వత్తు నత్యంత శుభవార్తఁ దెత్తు నను చుఁ
గొమ్మ హారంబు పూని" — (4-25)

వెళ్ళింది. తరవాత వసురాజు దగ్గరనుంచి వచ్చానని చెప్పింది. మంజువాణి "కార్య వేగమ్మున నంబరోత్పతన కౌశలం" పొందానని తెలిపి, అధిష్ఠాన పురవర్ణన

విటీవిట కృత్యాలు, రాజశయన మందిరం, తాను పాంచాలికా రూపం ధరించడం, రాజు విరహం మొదలైన వాటిని వివరించి, రాజు ఇచ్చిన పద్మరాగమణి ఖచిత మైన ఉంగరాన్నిచ్చింది గిరికకు. దానివల్ల విరహ తాపోపశమనం పొందింది గిరిక.

ఆకాశాని కెగిరే నేర్పును పొంది పైకెగిరిపోతూండగా తన కిందటి భూభాగం, తదితర వస్తుతతి సర్వం ఎలా కనిపించిందీ తన అనుభవాన్ని స్పష్టంగా చెప్పింది మంజువాణి —

"బడివాయకిల నగప్రతతితో జివ్వన । నెగిరినట్లై తోచు మగువలార,
పైపై సమీరణార్భటి నింగి భోరన । నరచినట్లై తోచు నతివలార,
నిఖిల భూములు జవనిక వాప దారున । నెదిరినట్లై తోచు నింతులార,
చనఁ జనఁ వెడదయై శశిమేనుగ్రక్కున । బెరిగినట్లై తోచుఁదరుణులార,

గొండ లచ్చనగండ్లయి నిండు చెరువు
లెల్ల నద్దంపు బిళ్లలై యేర్లు ముత్తి
యంపు సరులై యరణ్యంపు గుంపు లెల్ల
నారులై తోఁచుఁబోడవున నారులార" [4-59]

— పైకెగురగానే తనతోపాటు పర్వతాలతో భూమి ఎగిరివస్తూన్నట్లు, పైపైని గాలి ఆర్భాటంతో ఆకాశం అరుస్తున్నట్లు, తెర తొలగించగనే నమస్తలోకాలు కనిపిస్తున్నట్లు, ఇంకా పైకిపోతూ ఉండగా చంద్రుని ఆకారం పెరిగి పెద్దదై గోచరించినట్లూ, కొండలు అచ్చనగాయల్లాగా, నిండు చెరువులు అద్దం బిళ్ళల్లాగా, నదులు ముత్యాల సరాల్లాగా, వనాలన్నీ నారులాగా చిన్నవిగా కనిపించాయనీ మంజువాణి చెప్పింది. ఈనాడు విమానం ఎగిరి వెళ్ళుతూండగా (Take off) కనిపించినట్లుగానే ఉంది మంజువాణిచేత చెప్పించిన రామరాజభూషణుని వర్ణన. తానేమీ పైకెగురలేదు. కనీ భావించాడు. కవి ప్రతిభ కిది చక్కటి నిదర్శనం తాను పైకెగిరిన కాలదీ

క్రమంగా సమస్తమూ ఎలా కనిపించిందీ ఎంతో సహజంగా వర్ణించాడు కవి. అధిష్ఠానపురం పైభాగానికి వెళ్ళింది మంజువాణి. ఇంకా పైనే ఉండడంవల్ల —

"పురములు దుర్గముల్ శిబిరముల్ వ్రేలిపేటలు నూళ్లు పల్లియల్
ధరపయిఁ గుప్పవోసిన విధంబున" (4 60)

కనిపించడంవల్ల ఏది ఏమిటన్నది స్పష్టంగా తెలియరాలేదు."కొంత సేపరయుటకై విసిశృలతరాకృతినుండి నడట. నిర్ణయించి వసురాజు పట్టణమైన అధిష్ఠానపురం జాడ తెలుసుకొని వేగిరపాటున వెళ్ళిందట.

"పోవఁబోవఁగఁ దోఁచెఁబురరమామకుటమ్మాల్యంబులై భర్మ
హర్మ్య ధ్వజంబు
లేఁగనేఁగ నెదిర్చె గృహదేవతామౌళి । కలితాబ్జ కళికలై కలశతతులు
చేరఁజేరఁదలిర్చె పీరలక్ష్మీవాస । వనజాత దళములై వప్రశిఖలు
చనఁజనఁ దులకించె జగతీ సతికాంచి । హీరపర్వంబులై తోరణంబు
లరుగనరుగంగఁజూపట్టె సిరియనంత । తనువులై మల్ల ఖురళికాభినయవాటి
కాకళితురంగశాలికా గంధవిపణి।కాముకార్పిత మణిపుత్రికాచయంబు"
(4–61)

ఆకాశంలోంచి కిందికిందికి దిగుతూండగా పట్టణ సంబంధి సర్వం దృగ్గోచరమైంది మంజువాణికి. మొదట ఆ పురలక్ష్మి కిరీటంలోని పుష్పమాలలా అన్నట్లు బంగారు మేడలపైనున్న ధ్వజాలు కనిపించాయట. ఇంకా దిగుతూండగా, గృహదేవత శిరస్సుమీది తామరమొగ్గలా అన్నట్లున్న గృహాల పైభాగంలోని కలశాలు గోచరించాయట మరింత దగ్గరగా దిగుతూండగా లక్ష్మీదేవి నివాసమైన తమ్మిరేకులా అన్నట్లు కోటకొమ్మలు కనిపించాయట. మరీ దగ్గరగా వెళ్ళగా భూకాంత వజ్రాల మొలనూలా అన్నట్లు బయటిద్వారాలు దృగ్గోచరమయ్యాయట. ఇంకా దగ్గరగా వెళ్ళుతుండగా లక్ష్మీదేవి అనేక రూపాలా అన్నట్లు సాముగరిడీల, పరిమళ ద్రవ్య

విపణుల, ముగదలలో నిల్పిన రత్న ప్రతిమల సమూహాలు కనిపించాయట. రామ రాజభూషణుడు చక్కగా రూపకోత్ప్రేక్షలో వర్ణించారు ఆ పట్టణ సంపదను మంజువాణి క్రమంగా ఆకాశంలోంచి దిగుతూండగా కనిపించిన విధానం సుస్పష్టమయింది. ఇంతకంటే మంజువాణి గిరిక దగ్గరకు పద్మరాగ ముద్రికతో వెళ్ళినప్పుడు —

"ఇది తమ్మికంటిపై నీసరించిననిశా । ధవుఁదోలు లోకబాంధవుని పొడవు
పొడవుగాదిది తల్లిపడతికెత్తఁగఁదెచ్చు । రక్తరాజీవ నీరాజనార్చి
యర్చిగాదిది సహజానురక్తినగాత్మ । జనుబ్రోవఁగదియు నోషధులచాయ
చాయగాదిది కూఁతుచంద మారయవచ్చు । కోలాహలుని రక్తకూట దీప్తి
దీప్తిమాత్రంబుగాదిది దివ్యధామ। మనుచుఁజెలులాడకొన వచ్చె నంత నాన్ర
పార్చిత నవాబ్జరాగ ముద్రాంగుళీయ। రంజితాత్మీయ పాణియై మంజువాణి"
(4-56)

ఈ పద్యంలో ఆ మణికాంతి దగ్గరకు రాగా రాగా కనిపించిన విధంగూడా చక్కగా వర్ణితం. మొదట ఆ ముద్రిక కాంతి ఉదయరాగంలోగా, ఇంకాస్త దగ్గరకు రాగా శుక్రమతి గిరిక కిచ్చే ఎర్రగల్వల నివాళిలాగా, మరింత దగ్గరకురాగా కోలాహల పర్వతంలోని ఓషధుల కాంతిలాగా మరీ చేరువకు చేదుకోగా పద్మరాగ మణులతో నిర్మించబడ్డ భవనంలాగా-సమీపించినకొద్దీ కాంతి అతిశయించి దృగ్గోచర మైందని తెలుస్తూంది.

మంజువాణి ఇంకా పైనే ఉన్నప్పుడు సర్వమూ భూమిపై కుప్పపోసినట్లుండి వసురాజు పట్టణమేదో పోల్చుకోవడం కష్టమయిందట. క్రమంగా కిందికి దిగగా పట్టణం మనోజ్ఞంగా కనిపించింది. అంగడివీధికి దిగి అందలి సుగంధద్రవ్యం పరిమళాలవల్ల "ఉపశమిత గగన శ్రమ" అయిందట మంజువాణి. "అదిగో ఇదిగో వింత పీడ" అంటూ తలారులు హడావిడి పడుతూండగా, పావురాలు గూండ్లకేగక వినువీధికెగసిపోగా, నెమళ్ళు రెక్కలార్చి రొదచేయగా ఒక చంద్రశాలపై వాలి ఉందట మంజువాణి. అప్పుడు ప్రోలు ప్రశాంత ఘోషమై పూర్ణసమాధిజెలంగినదట. క్రమక్రమంగా "ధరావతీర్ణనైతి" నన్నది మంజువాణి; రాజాంతఃపురం ప్రవేశించింది;

రత్న ప్రతిమల్లో ఒకతై, ఆమె వసురాజు విరహవ్యథను గమనించింది; గిరిక ముత్యాలహారం రాజుకర్పించి, సంతోషంకూర్చి, గిరిక పడుతూన్న విరహబాధను స్పష్టంచేసింది వసురాజు ఇచ్చిన పద్మరాగ ముద్రికాంగుళీయం తెచ్చి గిరిక కిచ్చి, గిరికా వసురాజులకు త్వరలో వివాహం జరగగలదని ఊరడించింది.

ఇలాగా గగనయానం వసుచరిత్రలో ఏనాడో వర్ణించి, తన ప్రతిభను ప్రకటించినవాడు రామరాజభూషణుడు అది అతని భావనకు చక్కటి నిదర్శనం. తెలుగు సాహిత్యానికి జయపతాక!

(ఆంధ్రప్రభ–మార్చి 11, 1978)

# తెనాలి రామకృష్ణుని రేఖాచిత్రం - నిగమశర్మ భార్య

తెనాలి రామకృష్ణుని రేఖా చిత్రాలు అనేకం. అందులో ముగ్ధమనోహరంగా చిత్రితమైన అపురూపరేఖా చిత్రం నిగమశర్మ భార్య.

కళాపిపాసి అయిన చిత్రకారుడు తన మేధాసంపత్తిచే అనేక చిత్ర విచిత్ర వర్ణాలతో పలురకాల చిత్రాలను చిత్రించవచ్చు. వాటిలో రంగుల చిక్కదనం బొమ్మల చక్కదనానికి చాలా వరకు ఉపకరించవచ్చు; సమగ్రమైన అంగాంగ చిత్రణలో సమష్టిమూర్తి చిత్రణ సహృదయ హృదయావర్జకమై చూచిన ఒక్క చూపులో ఆనందాపాది అయి ఉండవచ్చు. ఉపయోగించిన రంగులు సముచితరీతిని సమ్మేళన పరచిన వాటి కలయికలు, మూర్తి అవయవ సౌష్ఠవ సంపాదనలో సంపూర్ణత్వానికి సహకరించవచ్చు. తన్మూలంగానే చూచేవాళ్ళ హృదయాలను ఆ చిత్రం అట్టే ఆకట్టుకోగలదు. అంతకంటే రంగుల ఆధిక్యంగానీ, పలురకాల రంగులు పులమడంగానీ లేని కేవల రేఖాచిత్రాలు పై వాటికంటే మిక్కిలి ఆనందాన్ని కలిగిస్తాయనడంలో సందేహం లేదు. రంగుల మూలంగా మన మనస్సు కొంతవరకు సంతృప్తిపడే అవకాశం ఉంది వర్ణ చిత్రాలలో. కానీ రేఖాచిత్రంలో అలాంటి అవకాశం లేదు. అయినా భావ నిర్భరంగా చిత్రించ బడి, చూపరుల ఊహలకే వదలి వేయబడినప్పుడు నారూహించిన కొలదీ అనంత భావాలు అభిగమ్యమానం కావడం రేఖా చిత్రంలోని పరమ రహస్యం! అలాంటి రేఖాచిత్రమే నిగమశర్మ భార్య పాత్ర. పాఠకులూహించిన కొలదీ ఆమె సౌశీల్యం అభిగమ్య మానమై మనస్సు లానందతుందిలా లౌతాయి. ఈ రహస్యం బాగా గుర్తించినవాడు తెనాలి రామకృష్ణుడు.

కనుక కేవల కవియేగాదు రామకృష్ణుడు, ఉత్తమ శ్రేణికి చెందిన చిత్రకారుడు కూడ! పైగా రేఖాచిత్ర రచనలో అందెవేసిన చేయి! ఒక జనశ్రుతి సర్వవందిత జన విదితమే. అది ఇది. "ఎవరో యొక చిత్రకారుని వేళాకోళము చేయుటకై

తానును చిత్రించగలనని చెప్పి, గోడనిండ తోకలు వ్రాసి గుర్రములా ప్రక్కనున్న వని చెప్పి రాయలవారిని. నవ్వించినవాడట రామకృష్ణుకు వాని కవిత్వమందేమో యీ ధర్మము చాల గానవచ్చుచున్నది". [శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు సారస్వతా లోకం – పు. 80] దీనినే మనం ప్రస్తుతం రేఖాచిత్ర రచన అంటున్నాం. పై జనశ్రుతి నిజమవునో కాదో మనకు తెలియకపోయినా, రామకృష్ణుని కవిత్వంలో మాత్రం ఈ రేఖాచిత్ర రచన సర్వత్ర దృగ్గోచర మవుతుంది పరిశీలించి, అనుభ వించి, ఆనందించగలవారికి !

'నిగమశర్మోపాఖ్యానము'లో పేర్లు గల వారిద్దరే: నిగమశర్మ, అతని తండ్రి సభాపతి. తక్కిన పాత్రలన్నీ నామరహితాలే. నామ సహితులైన సభాపతి, అంత కంటే నిగమశర్మ పలురకాల రంగుల మేళనింపుతో చిత్రితమైన, సంపూర్ణమైన తైల వర్ణచిత్రాలు. నామరహిత పాత్రలలో సైతం కొన్ని యిలాంటి తైలవర్ణ చిత్రాలు, జలవర్ణచిత్రాలు ఉన్నాయి. అలాంటి వాటికి నిగమశర్మ అక్క, నిగమశర్మ తల్లి, కాపు, కాపు కోడలు, మాలవనిత, ఆమె పుత్రులు ఉదాహరణలు. ఇందులోని నిగమ శర్మ అక్కను గూర్చి "ఈ చల్లని తల్లి పేరేమో తెనాలి రామకృష్ణ కవి మనకు తెలుపలేదు. ఆతనికే తెలియదేమో! వాల్మీకి అగస్త్యునికి పేరులేని యన్న నొకనిని సృజించెను. అతనికా పేరొక్కటేకాదు, మరేదియులేదు ఈయమసృష్టి అట్టిదికాదు, రామకృష్ణు దమృతలేఖిని దిద్దితీర్చి యాడించిన పుత్తడి బొమ్మయిది". [సారస్వతా లోకం – పుట 80) అన్న రాళ్ళపల్లి వారి మాటలు అక్షరాలా నిజం ! ఇక నిగమ శర్మ భార్య, నిగమశర్మ అక్క భర్త, కాపు కొడుకు అనే పాత్రలు రేఖాచిత్రాలు అందుకే నిగమశర్మ అక్క భర్త నుద్దేశించి 'ఇక భర్త! ఇతడు రామకృష్ణ కవి పెద్ద కుంచె నద్ది గోడపై దిద్ది చిత్రించిన తోకలలో నొకటి. భార్య చేతితో తాకినచో గదలును. అంతే" (సారస్వతా లోకం – పు 82) అని చాలా చక్కగా నిర్ణయించి చెప్పారు రాళ్ళపల్లి వారు. నిగమశర్మ భార్య పాత్ర చిత్రణలో రామకృష్ణుని రేఖా చిత్ర రచనా నైపుణ్యం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది ఈమె నామరహిత అయితే కావచ్చుగాక ! రూపరహిత మాత్రంకాదు. తద్వారా ఆమె శీల స్వభావాలు స్పష్టమవు తాయి. ఇదే రామకృష్ణుని రచనా చమత్కారం.

నిగమశర్మ అక్క నుద్దేశించి శ్రీరాళ్ళపల్లి వారు "తెనాలి వాని నిర్మాణములో పేరు పెంపుగల యే యితర వ్యక్తికిని ఈయ నామధేయకు గల జీవకళలో, నయ

నాణ్యములలో పదింట నొక పాలును లేదు"—అన్నారు. అదే విధంగానే రేఖా చిత్రంగా అత్యంత మధుర మనోజ్ఞంగా చిత్రితమైన నిగమశర్మ భార్య రూపురేఖలు పాఠకలోకాన్ని ఆకట్టుకొంటాయి. ఆ రేఖా చిత్రంలోనూ జీవకళకు కొరతలేదు. అయినా నిగమశర్మ అక్క ప్రౌఢ; కానీ నిగమశర్మ భార్య ముగ్ధ. ఈ దృష్టితో ఆమె శీల స్వభావాల్ని పరిశీలిద్దాం.

'నిగమశర్మోపాఖ్యానము'లో నిగమశర్మ భార్య ఒక పదంలో కొన్నిచోట్ల, ఒక వాక్యంలో మరికొన్ని చోట్ల, ఒకపద్యంలో మరొక్కతావున దాదాపు పన్రెండు పర్యాయాలు మాత్రమే ప్రస్తావించబడింది. ఆయా సందర్భాల్లోని ఈ ప్రస్తావనలను పురస్కరించుకొని సమ్యక్పరిశీలన గావిస్తే పాఠక మనోనేత్రాలకు నిగమశర్మ భార్య నిష్కూర్తి రూపు కట్టి మహాముగ్ధగా, అత్తమామల యెడ భయభక్తులు గల కోడలుగా, భర్తృ ప్రేమకు నోచుకోకపోయినా భర్త మాటకు జవదాటని భార్యగా, వదినెపై గౌరవం గల మరదలుగా, కష్ట సహిష్ణుత గలదిగా, వేదనామూర్తిగా, వివిధ భావ గర్భితగా స్పష్టంగా కనిపిస్తుంది.

నిగమశర్మ వివాహం ఎప్పుడు జరిగిందో రామకృష్ణుడు మనకు చెప్పలేదు. కానీ —

> "భార్య పాలింట్లు రిక్తకుంభములు, రోయ
> వెలఁది చనుదోయి నింకకుండలు, కులంబు
> తరుణి ఫాలంబు చవితి చందురుడు, వేశ్య
> నుదుట వానికిఁ బ్రతిపదిందుండు నయ్యె"

— అన్నప్పుడు మాత్రమే నిగమశర్మ వివాహితుడనీ, అతగాడికి ఒక భార్య ఉందనీ మనకు స్పష్టం అవుతుంది. భార్య మీద మమకారం లేక వేశ్యాలోలుడై ఉన్నాడనీ తెలుస్తుంది. పై పద్యంలో ఈ విషయం రామకృష్ణుడు ఎంతో చక్కగా వివరించాడు రూపకాలంకారంలో. నిగమశర్మ భార్య స్వభావం కాని, రూపురేఖలు గానీ మనకిక్కడ తెలియవు.

వేశ్యాలోలుడైన నిగమశర్మ "తనమేనగల సొమ్ము కొడుకక బచ్చింట గుదువ" వైచాడు "తల్లిపై గల పసిండి గిలుబాడి"నాడు "తండ్రికి నిడ్డ పత్రములు దొంగిలి బోయి పోయినంతకు నిచ్చి'' కొంత సంపాదించాడు. చివరికి ఋణగ్రస్తుడయ్యాడు. కానీ ఇక్కడ వీడు తన భార్య నగలను అపహరించినట్లు రామకృష్ణుడు చెప్పలేదు, అపహరించి ఉండడా? అపహరించకుండా ఉండడానికి వీల్లేదు. తలిదండ్రుల నగలనే వదలని నిగమశర్మకు భార్య లెక్కలోనిది కాదుగదా? కనుకనే ఆమె నగలు అపహరించబడినట్లు రామకృష్ణుడు చెప్పలేదేమో! అపహరించినా కాదనలేకపోయింది భార్య అని కూడా తలంచవలసి ఉందిక్కడ. ఆమె స్వభావమే అలాంటిది!

మొట్టమొదటిసారిగా నిగమశర్మ భార్య స్వభావం, రూపురేఖలు స్పష్టమయింది. నిగమశర్మ అక్క "గుట్టికనలంగియు నత్తమామల చిత్తంబు వచ్చునట్లు భక్తిశక్తులు మెఱసిపాటులంబడు మఱందలి సౌందర్యంబు ననివార్య విజృంభణంబగు యౌవనారంభంబును, వనచంద్రికా వైభవంబును, నవకేశపలాశ దోహదంబు నగుటకు వగచి వగచి తెగచి కడుపు చిమ్మలుచుట్ట గన్నీరుట్టి పడ బొట్టు పొరలగు చుండి" నప్పుడు ఇందు ప్రతిపద సార్థక్యం గోచరిస్తూంది. రామకృష్ణుని పదగుంభనం ఇందు నిబద్ధితం "గుట్టిక" అన్నప్పుడు తన సంబంధి రహస్యం ఏమాత్రం బయలు పడనీక అని అర్థం. తన భర్తృదౌష్ట్యాన్నిగానీ, తన వేదననుగానీ, ఇరుగుపొరుగు అమ్మలక్కలకుగానీ, చివరికి వదినకుగానీ చెప్పక, గుట్టుగా తనకుతానే "నలంగిన"ది; కమిలిపోయినది. భర్తను నిలదీసి అడగడానికిగానీ, అత్తమామలతో ఫిర్యాదుచేయడానికిగానీ ఆమె గయ్యాళిగంపకాదు. అందుకే ఆమె "అత్తమామల చిత్తంబుల వచ్చునట్లు భక్తిశక్తులు మెరసి పాటులంబడు"చుండినది. దీనిచే అత్తమామలయెడ ఎంతటి భయభక్తులు, గౌరవ ప్రతిపత్తులు ఆమెకుండినవో స్పష్టంగా తెలుస్తాయి. ఆమె స్వభావ సౌశీల్యాదులు వ్యక్తమవుతాయి. ఆమె అపురూప సౌందర్యవతి. దానికితోడు "అనివార్యవిజృంభణంబగు యౌవనారంభంబు" గలది. కానీ భర్త అనాదరణతో ఇవి "వనచంద్రికా వైభవంబును, నవకేశపలాశ దోహదంబు" నయ్యాయి. "ఈ పాపుని శిక్షించెద" నని తన ఊరినుంచి వచ్చిన నిగమశర్మ అక్క "నిగళిత సన్నాహంబగు గేహంబు యథాపూర్వ నిర్వహణ మనోహరంబుగా ననుసంధించి" నా మరదలి వేదనను మాన్పలేకపోయింది. ఈ సందర్భంలో రాళ్ళపల్లి వారి మాటలుల్లేఖించడమే సమంజసం. "ఇట్లన్నిటను ఆమె జాణతనము సాగినదిగాని తన చిన్న మరదలిని జూచినప్పుడేమి చేయవలయునో తోపలేదు. ఆ వేదనామూర్తి

యెడ తన ధైర్యమెందుకును బనికిరాక వదినె యూరక "వగచి వగచి, తెగచి కడుపుచుమ్మలుచుట్టు కన్నీరుట్టి వడంబొట్టు పొరలగుచుండినది! అనివార్యమగు దుఃఖమునకు హార్దమగు సహానుభూతియే ప్రతీకారము". (పై దే-పు 85) వదిన దుఃఖమింతటిదంటే ఆ ఇల్లాలివేదన ఎంతటిదో సహృదయ హృదయాలు గ్రహించ గలవు. ఇట్లెన్నాళ్ళో దుఃఖంతోనే గడచిపోయాయి. ఒకానొకరోజు "చుక్క తెగిపడిన వడుపున నెక్కడినుండియో యాకస్మికంబుగా నింటికిఁ జలిది వంటకంబుగుడువం జనుదెంచి" నాడు నిగమశర్మ! ఇదే సమయమని తన చాకచక్యంతో, మాటలనేర్పుతో "మీ బావబంతి నారగింతుపుగాక; శాకపాకంబులు నిమిషంబులోనం గావింతునని నిలిపి" వేసినది. ప్రేమాకృష్ట అయినదీ; ఈ సమయంలో ముందుబడడానికి సాహసించలేనిదీ "వెనుక దెసనెడగలసియున్న"ది "తత్కళత్రంబు". ఆవేదనామూర్తి హృదయంలోని సంతోషభావపు మెరుపే ఆమె పెదవులపై చిర్నగవయి తళుక్కున మెరసి ఉండవచ్చు అది మనకెవ్వరికి దృగ్గోచరంకానిది ఇన్నాళ్ళకైనా వచ్చాడుగదా అన్న సంతోషమేగాని వేరు గాదు అవకాశంకోసం ఎదురుచూస్తూండిన వదినవెంటనే మరదలికి "నేత్ర సంజ్ఞ యొసం"గినది. ఇది ఉభయత్రా లాభదాయకం కావడంవల్ల అత్యావశ్యకమని ఆమె తలంపు

వదిన కనుసన్న అంతరార్థమేమిటో గ్రహించగలిగింది మరదలు. ఆమాత్రం ఇంగితజ్ఞానం లేనిదికాదు ఆమె! అందుకే వెంటనే—

"ఆపైదలి ప్రాణేశ్వరు
శ్రీపాద ద్వయము గడిగె శీతలవారిన్
వ్యాపృతనిజనిశ్వాసజ
తాపంబునఁగొంత కొంత తప్తముగాగన్"

దొరకిన అవకాశం జారవిడుచుకుంటే మళ్ళీవస్తుందో రాదో! అనాఘ్రాత, అనాదృత అయినప్పటికీ భర్తను "ప్రాణేశ్వరునిగానే" భావించింది. అదే భారతీయ వనితాధర్మం! "దుర్విదగ్ధు" డైనా సరే భర్త నిగమశర్మ పాదాలు తనకు "శ్రీపాద ద్వయమే!". అలాంటి "శ్రీపాదద్వయము"ను "శీతలవారిన్" గడిగినదట "శీతల వారితో" కడగడంలో విశిష్టతవుంది అది రామకృష్ణుడు బహుజాగరూకతతో

ప్రయోగించిన గడుసు ప్రయోగమే! ఆకలిమంటతోను, విరహ జ్వరంతోను ఎన్నాళ్ళ నుంచో నిగమశర్మ వేగిపున్నాడు. అంతేగాక అతని భార్యలోను శోకాగ్ని ప్రజ్వరిల్లు తూంది గనుక "శీతలవారి"ని కడగినట్లు రచించాడు రామకృష్ణుడు. కనుకనే అనివార్య దుఃఖసంత ప్తస్వాంత అయిన నిగముని భార్య భర్త పాదాలని కడిగి, గుడ్డతో ఒత్తనేలేదు. కేవలం "వ్యాపృతనిజనిశ్వాసజ తాపంబునఁ గొంతకొంత తప్త" మొందట! ఇక్కడ ఇది అతిశయోక్తిగా తోచినా, ఎంతో స్వభావోక్తిగా ఒప్పుతుంది. అస్వాభావికం అని మనం అనలేము! "వ్యాపృత నిజనిశ్వాసజ తాపంబు" అనడం వల్ల తన భర్త దుష్టుడైనప్పటినుంచి ఆమె హృదయంలో అణచిపెట్టుకొన్న వేదన స్ఫురిస్తూంది. దీనివల్ల "గుట్టక నలంగియు" అన్న మాటలలోని అంతరార్థం సమగ్రంగా స్పష్టమవుతూంది. ఆవేదనాభరితమూర్తి మన కన్నులయెదుట కన్పట్టు తూంది. ఇదే రామకృష్ణుని రచనా వైచిత్ర్యంలోని నైపుణ్యం! రేఖాచిత్ర చలత్సౌంద ర్యము గ్రహించగలిగిన సహృదయత ఉండాలేగాని ఈ పద్యానికెంతటి వ్యాఖ్యాన మైనా చేయవచ్చు. అల్పాక్షరాలలో అనల్పార్థ రచనచేయగల చతురమతి రామ కృష్ణుడు! అతని పదగుంభనం అడుగడుగునా గోచరించి మనల్ని దిగ్భ్రమలో ముంచెత్తుతూ ఉంటుంది. "రవిగాననిచో కవిగాంచునేకదా!" అన్న సూక్తికిదే అనంతార్థం! ఇంతజేసి నిగమశర్మ భార్య వేడినిట్టూర్పులు వదలిందని చెప్పాడేగాని, భర్త కనిపించాడుగదా అని శాపనార్థాలతో దీర్ఘాలుతీస్తూ రోదించనారంభించిందని చెప్పలేదు రామకృష్ణుడు. ఈ విధంగా రామకృష్ణుడు ఈ పాత్రను ఎంతో సహృదయ హృదయరంజకంగా పోషించాడు

వదిన కనుసన్నలలో మెలగుతూ ఇల్లాలు భర్తకు తలంటుస్నానం, నూతన వస్త్రధారణం, వెంట్రుకల తడియార్పు, పూలముడుపు, గంధపుమైపూత మొదలైన ఉపచారాలుచేసి జన్మతరించినట్లు తలచింది. ఇలాంటి సన్నివేశంలో ఆమె ఆశలు చిగురించకుండునా? అందుకే భోజనానంతరం "మహానిష్ఠురుఁబోలెఁ దిన్నెపయిచిర్నగ వొప్పగఁ గూర్చుండి" ఉండగా, ఆ అరుగుచెంతనే నిలబడి "వీడ్యముచుట్టి" ఇచ్చినది. ఇప్పుడు వదిన చెప్పనక్కరలేదు ఆమాత్రం తనకు తెలుసుగదా? పైగా భర్తృప్రేమ సంపాదించడానికిదే అవకాశం అనిగూడా ఆమె తెలుసుకొన్నది. అయితే ముందే ఎందుకీమాత్రం సేవలుచేసి, భర్తను చెడువర్తననుంచి తప్పించి, తనకు వశవర్తునిగా

చేసుకోలేకపోయిందని అడగవచ్చు. అప్పుడిలాంటి అవకాశంలేదు. తనకు అండగా ఉండి సహకరించేవాళ్ళులేరు. ఇప్పుడు పడిన సహాయసహకారాలు అమితంగా లభించాయి. అందుకే తదుచితరీతిని వర్తించిందా ఇల్లాలు!

భోజనానంతరం తమ్ముడికి కేశబంధం విప్పి, పరిశుభ్రంచేసి, నిగమశర్మ అక్క చేతులు "గరగరగా" కడుగుకొన్న వెనక వదను గుర్తించి "మరదలు విడె మొసగుచు బసిమిపసిడి వీవన" వీచిందట! తనకు కూర్చిన వదినకు కృతజ్ఞతతో ఆమాత్రం సేవచేయడం మరదలి కనీస ధర్మమేకదా? కనుకనే అవకాశం లభించగనే తన కృతజ్ఞతను ఆమె ప్రకటించుకోగలిగింది దీనిచే ఆమె స్వభావం సువ్యక్తమవుతుంది. ఇదంతా బాగుంది. కానీ నిగమశర్మ ఇల్లుగుల్లచేయగా "పసిమి పసిడి వీవన" ఎక్కడిదన్న ప్రశ్న తలెత్తుతుంది నిజమే! ఇది నిగమశర్మ అక్కచే "జనయిత్రీ దర్శితంబగు మూలవిత్తంబగు నష్టావశిష్టంబగునది గుప్తంబు" చేయబడిన దానిలోనిదని మనం తలంచవలసి ఉంది

నిగమశర్మకు నయబోధచేయ నారంభించింది అక్క. కుశల ప్రశ్నలతో ప్రారంభించి, కర్తవ్య నిర్దేశం చేసింది. ఈ నయబోధలో మరదలి వేదనను గుర్తించి ఉంది పైగా సాటి ఆడదిగా మరదలి హృదయావేదనను గమనించింది — కాన అవకాశం కల్పించుకొని తమ్మునికి భార్యను గూర్చి గుర్తు తెస్తూనే ఉంది. ఆమె నయబోధలోని నైపుణ్య మలాంటిది. రామకృష్ణుని 'పదగుంభన జృంభణ' మంతటి మహత్తర విశిష్టత గలది! వంశప్రశస్తిని తెలిపి, తలిదండ్రులను సంతోష పెట్టలేకపోయావని వివరించి, "అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన యిల్లాలి నిల్లాలితాకార నొల్లవైతి"వని మెల్లగా దెప్పిపొడిచింది అక్క నిగమశర్మను. ఆమె ఈ మాటల్లో ఎంతో అర్థం ఇమిడి ఉంది. "అగ్నిసాక్షిగ బెండ్లియాడిన యిల్లా"లన్నది. అంటే 'సహధర్మచారిణి, అర్థాంగి' అనే అర్థాల్ని స్ఫురింపజేయడం, అలాంటి అగ్నిసాక్షిగా పెండ్లాడిన ఇల్లాలిని వదలిపెట్టి దుఃఖభాగినిగా చేయడం ఉచితం కాదనీ చెప్పడం. ఇట్టి ఇల్లాలికంటే వేశ్యలే నీ కెక్కువయ్యారా! అని దూరడం — అనే అర్థాలన్నీ ఇందులో పొందుపరుపబడి ప్రయుక్తం కావడం విశేషం! పోనీ అగ్నిసాక్షిగా పెండ్లాడినదైనా 'కురూప'కాదే; 'కురూప' అయితే వదలడంలో సామంజస్యం ఉందన వచ్చు. కానీ "ఇల్లాలితాకారన్" అనగా మనోజ్ఞరూపం కలదని చెప్పింది. అంటే అగ్నిసాక్షిగా పెండ్లాడినదీ, అపురూప సౌందర్యోపేత అయినదీ అయిన భార్యను

అనాదరించడం సముచితంకాదని చెప్పింది అక్క. దీనిచే నిగమశర్మ భార్య అపురూప సౌందర్యం మనకు తెలుస్తుంది కదా ?

పై విధంగా ఒక పద్యంలోనూ, ఒకటి రెండు పద్యభాగాల్లోనూ, వాక్యాల్లోనూ నిగమశర్మభార్య స్వరూపస్వభావాలు అభిగమ్యమానం అయ్యాయి. ఇంక ఒక్కొక్క పదంలోనే అనంతార్థంసైతం ఉంది. తన నయబోధ తమ్ముని యెడ వ్యర్థమైనట్లు ఎంచిన అక్క "సామరస్యంబుమీర" అతని భార్యను గుర్తుచేస్తూ —

"పడఁబడఁ బాఱుచున్ పడకువట్టిన తల్లినితండ్రి, నేలలో
వెడలని తమ్ముఁగుఱ్ఱల, నవీనకులాంగన, నోరులేని యా
తొడకుల, బంటుఁబైద, నిడఁద్రోవక ప్రోవఁగ నెందు నీక పా
ల్పడినది, కర్ణుసౌదలనె భారత సంహిత నిల్చు చాడ్పునన్"

— అని కర్ణుసౌదలనె భారత సంహిత నిల్చినట్లు సంసార భారం నిగమశర్మ మీద ఆధారపడి ఉందని చక్కటి సామ్యంతో వివరించింది. ఇచ్చట మరదలిని "నవీనకులాంగన" అని వర్ణించింది. 'నవీన' పద ప్రయోగంతో కొత్తగా కాపురానికి వచ్చిందనీ, ఈ సంసార భారం వహించడానికి వీలులేనిదనీ అర్థం సూచించడం జరిగింది. "కులాంగన" అనగా కులస్త్రీ — సద్వంశ సంజాత' అనీ, ఆమె ఆభిజాత్యాన్ని గూర్చి స్పష్టంచేయడం జరిగింది. ఇలాంటి 'నవీన కులాంగన'ను నిరాకరించటం ధర్మంకాదని ధ్వని.

ఇంక 'సర్వధనం వెచ్చించినా ఫరవాలేదుగానీ, ముక్కారు బంగారు పండునట్టి మాగాణి నమ్మడం భావ్యమా ?' అంటూ అక్క 'నిర్దారుండవే?' అని ప్రశ్నించింది నిగమశర్మను. 'భార్యా సహితుడవుగదా ? చక్కగా సంసారం చేస్తూ గృహస్థువైతే సంతానం కలగకపోతుందా ? భార్యను అనాదరణ చేశావు. ఇది న్యాయమా ?' అని దీని కర్థం. "కులధ్వంసం నీ కర్హమే?" అని హెచ్చరించింది. అంటే తన మరదల్ని గూర్చి గుర్తుచేసి, నిగమశర్మను హెచ్చరించిందని దీని కర్థం. 'నిర్దారుండవే ?' అని అనడంలో ఇంత అర్థం ఇమిడి ఉంది.

అక్క ఉపదేశానుసారం 'వాడన్నపానకాంక్షఁ జాల దినములమందియు మైల బడి బడుగు' కావడంవల్ల వాడిలో ఎంతో మార్పు వచ్చింది.

"రాజాలయమునకు రాకపోకలు సేయు,
మాసిన చదువులు మరలఁ జదువు,
నిన్నాళ్ళనెచ్చెలు లెదురైనఁ దలవంచుఁ,
గులవధూరత్నంబు గుస్తరించు,
నాచార్య జనముఁ బ్రత్యహము సంభావించు,
నర్చావళికి నుపహార మిచ్చు,
నర్చించుఁ గుతపవేళాగతాతిథి కోటిఁ,
బసినేదు, దర్శించుఁ బైరుపచ్చఁ

తండ్రియుద్గమనీయంబు తానెయుదుకు
నత్తికా భర్తతో నవ్వ నల్ప సరణి,
గ్రామకార్యంబుదీర్చు నంగడికి వచ్చి,
తేనెపూసిన కత్తి, ధాత్రీ సురుండు."

— ఇట్లు పూర్వ పద్ధతిలో సన్మార్గ వర్తనుడై నడచుకొంటున్నాడు నిగమ శర్మ. అతనిలో కలిగిన పరిణామంలో ప్రధానమైంది 'కుల వధూ రత్నంబుఁ గుస్తరించడం! 'కులవధువు' అన్నది 'కులాంగన' వంటి ప్రయోగం. అయితే ఇక్కడ మరో విశేషం 'కులవధువులలో రత్నం — ఆమె. అలాంటి 'కుల వధూ రత్నాని'కి తానెంతో గతంలో అన్యాయం ఆచరించానని పశ్చాత్తప్తుడైన నిగమశర్మ ఇప్పుడామెను 'కుస్తరిస్తున్నాడు' (ఓదారుస్తున్నాడు). ఈ 'కుస్తరింపు'లో ఎంతో భావం నిర్భరమై ఉంది. ఆవేదనామూర్తి శోకాన్ని తొలగించడానికి అనునయం ఆరంభించాడన్న మాట! కానీ రామకృష్ణుడు 'తేనె పూసిన కత్తి ధాత్రీసురుండు' అని అంటున్నాడు. అయినా పాపం అమాయకురాలు కావడంవల్ల నిగమశర్మ భార్య తన భర్త 'తేనెపూసిన కత్తి' అన్న సంగతికి అవకాశం ఇవ్వక సంపూర్ణంగా నమ్మింది భర్తను. ఇలా ఎన్నాళ్ళు గడిచాయో ?

మామూలు స్థితికి వచ్చాడనీ, బుద్ధిమంతుడయ్యాడనీ తలంచబడి, ఇంటిలో స్వేచ్ఛగా వదలిపెట్టబడ్డాడు నిగమశర్మ! ఆ స్వేచ్ఛ ననుసరించి "జనయిత్రీ దర్శితం బగు మూలవిత్తంబు నష్టావశిష్టంబగునది" అక్కచే "గుప్తంబు"చేయబడినది సైతం నిగమశర్మ కన్నులబడ్డది ఒకనాటి రాత్రి, అనేకరకాల ఆభరణాలతోపాటు "మాతృభూషలు, అతికామండనములు, నిజయువతిదాట్య సొమ్ములన్నియు హరించి". "పడు, వడుకకుఁజెప్పక యిల్లువెడలి గాఢతరతమోనికరము తనదగు తోడుగ నొక్కరుడు పేరడవిత్రోవనూడని బాడెన్". "పడుపడుకకు చెప్పక" పారిపోయాడంటే పాపం ఆ అమాయకురాలికి మాత్రం ఏమితెలుసు? పైగా హృదయపూర్తిగా నిగమశర్మలోని మార్పును విశ్వసించిందిది ఆ అమాయకురాలు. ఇలాంటి ఘోరమైన మోసం చేస్తాడని కలలోనైనా తలంచలేదు. అట్టిదామె స్వభావం అతడు"తేనెపూసిన కత్తి" అని రామకృష్ణునికి తెలుసుగానీ, ఆమె ఎరుగనే ఎరుగదు ఆ ముగ్ధమోహన సౌశీల్యమే అట్టిది!

తెల్లవారగట్లే నిద్రలేచిచూస్తే ఏముంది? నిగమశర్మ కనిపించలేదు. వెంటనే పలురకాల నగలపైపోయాయి అందరి మనస్సులు. అన్నివిధాల ఆభరణాల సంగతి అలాఉంచి, తమ తమ కిష్టమైన ఆభరణాలకై ఏడ్చారట ఇంటిలోనివాళ్ళు అక్కతోపాటు!—

"శోకించు వృద్ధ భూసురుఁడాత్మ పితృదత్త
దర్భముద్రికకుఁ జిత్తంబుగలగి,
యత్తగారిచ్చిన హరిసుదర్శనపుఁ బే
రునకు ముత్తైదువ వనటఁబొందుఁ,
గ్రొత్తగాఁజేయించుకొన్న ముక్కరకునై
యడలు దుర్వారయై యాఁడుబిడ్డ
జామాత వెత్తనొందు వ్యామోహియై నవ
గ్రహాకర్ణవేష్టన భ్రంశమునకు,

నెంత దుర్బుద్ధి! యెంత దుర్భ్రాంతి! యహహా!
సర్వధనములు నద్దురాచారశీలుఁ
డూచముట్టుగ నిలుదోచి యుఱికిచనుట
యెఱుఁగరోకాక! యవ్వేళయెఱుక గలదె?"

ఇందరిన్నివిధాలుగా ఏడ్చినా "కులవధూరత్నం" ఊసేలేదు; ఆమె ఏడ్పు మనకు వినిపించనేలేదు. ఆ మహావేదనా సంభరితమూర్తికిది స్వాభావికమే! అందరూ ఏడ్చినా మనం అంతగా పట్టించుకోవనిలేదు. "రామకృష్ణుదమృతములో లేఖిని నద్ది తిద్ది తీర్చియాడించిన పుత్తడిబొమ్మ" అయిన నిగమశర్మ అక్క దుఃఖించడం ఆ పాత్రలోని నలుసంత కళంకాన్ని తెలియజేస్తూంది. ఈ విషయాన్నిగూర్చి శ్రీరాళ్ళపల్లివారు "ఇంతటి తెలివితెగువలు, నగవుబిగువులు, అందచందములు కరువు వోసి తయారుచేసిన అపూర్వ అమృతమూర్తికి రామకృష్ణకవి దృష్టి చుక్కగా నొక మసిబొట్టు ముక్కుపైఁబెట్టినాడు

"అక్క సద్బుద్ధి మాటలాదరించి నిగమశర్మ నాల్గునాళ్ళింటిలో వివేకము దెచ్చుకొన్న వానివలెనుండి యొకనాటిరాత్రి చేతికిదొరకిన యింటి సొమ్ములనెల్ల హరించి, మూటగట్టుకొని వండుకొన్న "వడుకకునుజెప్పక" పారిపోయెను. అప్పుడింట నందరునేడ్చిరి. వారితో నక్కయునేడ్చినది. ఎందుకనుకొన్నారు? తమ్ముడు చెడెనే యనికాదు. ఇల్లు మునిగినేయనికాదు. తన ప్రయత్నము వ్యర్థమాయెనేయనికాదు. మరి "క్రొత్తగా జేయించుకొన్న ముక్కెర"పోయెనే అని 'దుర్వారయై' యడలెనట" అని తెలిపి 'పరిహాసము పవిత్ర వస్తువునుగూడ గమనించదేమో' అని సమర్థించారు. కానీ పరిహాసశీలుడైన రామకృష్ణుడు పరిహాసంకోసమే అన్నప్పటికీ ఇది అనౌచిత్యమే అనాలి

కానీ నిగమశర్మ భార్యకీమాత్రమైన కళంకంసైతం ఆపాదించలేదు రామకృష్ణుడు నిగమశర్మ భార్య దుఃఖం మనకు వినిపించలేదు ఆమె కుమిలికుమిలి ఏడ్చిన ఏడుపు పైకి వినిపించలేదు. నిజానికి పైకి ఏడ్చినా తప్పులేదు. కానీ ఆ ఇల్లాలి వనటనుగూర్చి ఆలోచించి సానుభూతి చూపవలసిందని పాఠకుల ఊహలకే వదిలాడు రామకృష్ణుడు. పలు రంగుల మేళవింపుల తళతళలతో బహు సుందరంగా చిత్రితమైన

పాత్ర నిగమశర్మ అక్క. కానీ కేవలం రేఖాచిత్రం నిగమశర్మ భార్య! తన 'ప్రాణేశ్వరుడే' పరువెత్తిపోతే—అంటే అసలు ధనమే పోగా తదితర భూషణాలకై ఏడ్వవలసిన పనిలేదని ఆమె భావమేమో! ఆవేదనా సంతప్తమూర్తి ఎంతగానో కుమిలికుమిలిపోయింది; సందేహంలేదు. కానీ ఆ ఏడ్పు వినిపించలేదు 'గుట్టిక నలంగుట'యే మొదటినుంచి వచ్చిన ఆమె స్వభావంకదామరి? దీనినెంత పాఠకులు సహృదయంతో ఆలోచిస్తే, అంతగా అమృతాయమానాలైన అర్థఫలాలు లభిస్తాయి! ఇదే రామకృష్ణుని రేఖాచిత్ర రచనా రహస్యం!

(ఆంధ్రప్రభ—జనవరి 7, 1973)

# ఏడుపుల సాహిత్యం

"అల్లసాని పెద్దన యటు నిటు నేడ్చెను, ముక్కు తిమ్మన ముద్దుముద్దుగా నేడ్చెను. భట్టుమూర్తి బావురుమని ఏడ్చెను" — అని తెనాలి రామకృష్ణు డన్నట్లు సాహితీవేత్త లందరికీ తెలిసిందే. ఈ మాటలు రామకృష్ణునివి అవునా ? కాదా ? అన్న ప్రశ్న అలావుంచి ఇందులోని సత్యాన్ని పరిశీలిద్దాం.

మన ప్రబంధ సాహిత్యానికి ఆదర్శం శ్రీనాథుని కావ్యాలు. శ్రీనాథుని కావ్యా లన్నింటిలోను ప్రౌఢ కావ్యం శృంగార నైషధం. నైషధంలో నలుని వరించిన దమయంతి వద్దకు ఇంద్రాదులు నలుని రాయబారిగా పంపగా; ఇంద్రాదులలో ఒకనిని వరింపుమని నలుడు చెబుతాడు. అందు కంగీకరించక దమయంతి ఆ సంగతి చెప్పకు మని ఆంక్షపెట్టగా మళ్ళీ దివిజులలో ఒకని వరింపుమనీ; 'అంతరాయంబు పుట్టు గార్యముల కెల్ల'అని నొక్కి వక్కాణిస్తాడు నలుడు దానితో బాధాక్రాంత మనస్క అయిన దమయంతి —

"ప్రవిమలాక్షి నభోనభ స్యాంబుదములకు
నవవృష్టి ధారలై యవతరిల్లి
యాకర్ణ దీర్ఘ నేత్రాంభోరుహములకుఁ
గమనీయ నాళ భావము భజించి
కలిత కజ్జలిత ముక్తాహార లతలలో
హరినీల రత్న నాయకతఁ దాల్చి
లలిత వక్షోజ కుట్మల చుంబనంబున
మధుప దంపతుల సామ్యంబు వడసి
వేడి యశ్రులు నిగుడంగ వెక్కి వెక్కి
యేడ్వ దొడగె లతాంగి పృథ్వీశు మ్రోల
మృదుల పరివేదనాక్ష రోన్మిశ్రమధుర
కంఠ కాకు వికారకా కలిక యలర." (4-87)

దమయంతి "ఏడియ్య శులు నిగుడంగ వెక్కి వెక్కి యేడ్వదొడ"గిందట. ఇంకా కోమలమైన వేదనాక్షరాలతోకూడిన "మధురకంఠ కాకువికారకా కలికయలర" ఏడ్చిందట. 'కాకువు' అంటే శోకభయాదులవల్ల కలిగిన ధ్వనిలోని మార్పని అర్థం.

తెలుగు ప్రబంధ కవుల్లో ఆద్యుడు అల్లసాని పెద్దన. వయస్సులోనేకాక కవితలోను పెద్దన పెద్దనయే. పెద్దన ప్రబంధం మనుచరిత్రలో వరూధిని ప్రవరుని కౌగలించుకొని 'అధరం బాసించిందట'! 'శ్రీహరీ యంచున్ బ్రాహ్మణు డోరయోమిడి' ఆమెను త్రోసివేశాడట. అలాగా త్రోపువడి నిలచి అత్యధికమైన అవమానం. సిగ్గులతో" కొప్పు సవరించి, యొడల్ దీపింప నతని జూచుచుఁ గోపమునఁజూచి"– ఇలాఎలికి ఏడ్చిందట —

"పాటున కింతులోర్తురే కృపారహితాత్మక! నీవు త్రోవని
చ్చోట భవన్నఖాంకురము సోకెఁగనుఁగొనుమంచుఁ జూపి య
ప్పాటల గంధి వేదన నెపంబున యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చు గుబ్బచనుమిట్టల నశ్రులుచింద వందగన్" (2–70)

"వేదన నెపంబడి కలస్వనంబుతో ఏడ్చిం"దట వరూధిని. అల్లసాని పెద్దన అటునిటు ఏడ్చెనన్నాడు తెనాలి రామకృష్ణుడు. ఇక్కడ ప్రవరునిచే త్రోపుడువడి అవమానిత అయి ఏడ్చిన తీరునిగూర్చి చెప్పాడు పెద్దన. ఆ ఏడ్పులోను కలస్వన ముందన్నాడు కవి పెద్దనకు అన్ని విషయాల్లోనూ ఆదర్శం శ్రీనాథుడు శృంగార నైషధంలోని దమయంతిలాగానే మనుచరిత్రలో వరూధిని ఏడుస్తుంది. అక్కడ 'కాకువికారం' ఇక్కడ "కలస్వనం".

పెద్దన అంతటి కవి ముక్కుతిమ్మన. తన పారిజాతాపహరణంలో సత్యభామని ఏడ్పించిన విధం ముద్దుముద్దుగా వున్నదన్న విషయం మనకు తెలిసిందే. కోపగృహంఁ చేరిన సత్యభామను ఓదార్చ కృష్ణుడురాగా పాదతాడనం చేశాక శ్రీకృష్ణుని నిందిస్తూ "మరి మాటలాడ శక్యముగామిన్",

"ఈసునఁబుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే
గానిలి యేడ్చెఁ బ్రాణవిభు కన్గొదుట న్నలతాంగి పంకజ
శ్రీసఖమైన మోము పయిఁజేలచెఱంగిడి బాల పల్లవ
గ్రాస కషాయకంఠ కలకంఠ వధూకలకాకలీధ్వనిన్" (1-113)

సత్యభామ 'ప్రాణవిభు కన్గొదుట' 'బాలపల్లవ గ్రాస కషాయకంఠ కలకంఠ వధూకలకాకలీధ్వనిన్' ఏడ్చిందట! ఇది ముక్కు తిమ్మనార్య ముద్దుపలుకుగదా మరి!

పూర్వ ప్రబంధాలన్నింటిలోని విశిష్టతల్ని గ్రహించి అపూర్వ శిల్పంతో రామ రాజ భూషణుడు వసుచరిత్రను రచించాడు. వసురాజుపై మోహంగొన్న గిరిక విరహవ్యధాభరిత మనస్క అయి ఇలా ఏడ్చింది.

"ఆ జాబిల్లి వెలుంగు వెల్లికలడాయన్ లేక రాకానిశా
రాజ శ్రీసఖమైన మోమునఁ బటాగ్రం బొత్తియొత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నర వధూరాజత్కరాంభోజ కాం
భోజీ మేళవిపంచికారవ సుధాపూరంబు తోరంబుగాన్" (4-52)

"కాంభోజీరాగ సమ్మిళిత విపంచికారవం"తో ఏడ్చిందట గిరిక. "భట్టుమూర్తి బావురుమని ఏడ్చా"డన్నది తెనాలి రామకృష్ణుడు చెప్పిన విషయంకదా!

కాగా ధూర్జటికూడా శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో కొంత దుఃఖించినట్లుంది. యాదవ భూపాలునిచే తలగొరిగించబడిన దాసి ఏడ్చిందట ఇలా!

"....బిగువైన పీనకుచ భారమువంక ధరిత్రిమోపగం
డెడు తనువల్లితోఁగటికిడెందము భూపతిదూఱుచున్ వడిన్
వెడలు దృగంబు పూరములు వెల్లిగొనన్ బలవించె, దైవమున్
దడవుచు; బంచమధ్వనుల తానములీను పికాంగనాగతిన్" (1-50)

'పంచమధ్వనుల తానములీను పికాంగనాగతిన్' పలవించిందట ఆ దాసి. పైని పేర్కొన్న కవులందరూ నాయికల్ని ఏడ్పించగా ధూర్జటి దాసిని ఏడ్పించాడు. పైవాటిలో ప్రగాఢానురాగానికి దుఃఖం. ఇక్కడ శిక్షకు దుఃఖం.

తాను మనసారా ప్రేమించిన నలుడు తనవాడు కానందుకు అతని ఎదుటే దమయంతి ఏడ్చింది. తాను ప్రగాఢంగా ప్రేమించిన ప్రవరుడు తిరస్కరించి, త్రోసి వేయగా అవమాన క్రుద్ధ అయి అతనిని నిందిస్తూ దుఃఖించింది వరూధిని. దక్షిణ నాయకుడైన శ్రీకృష్ణుడు పారిజాతపుష్పం తనకివ్వకుండా రుక్మిణికిచ్చి తన్నవమానించాడన్న బాధతో శ్రీకృష్ణుని దూషిస్తూ శోకించింది సత్యభామ. కానీ తాను ప్రేమించిన వసురాజు వెంటనే వివాహమాడనందుకు విరహవ్యథతో బాధపడుతూ ఏడ్చింది గిరిక.

మానవకోటికి ఏడ్పు సహజమే. అందులోను సుఖదుఃఖద్వంద్వాల్లో ఒకటైన దుఃఖం అతిశయించినపుడు ఏడ్పుతప్పదు. ద్వంద్వాతీతుడు మహాయోగి. కానీ మామూలు మానవులు ఏడుపునకు లోనుగావలసిందే; తప్పదు. పైగా ఇందు ఏడ్చిన వారందరూ స్త్రీలే. మానవ సహజమైన ఏడుపులు ఒకటే అయినా కవుల కవితలు వేర్వేరు; ఏడుపును వర్ణించిన తీరుతెన్నులు వేర్వేరు. అదే కవితా సృష్టిలోని వైవిధ్యం! అదే సహృదయ హృదయరంజక గుణం!

(ఆంధ్రపత్రిక–ఏప్రిల్ 29, 1979)

# వాల్మీకి చరిత్రము - రఘునాథరాయల రచనారీతులు

దక్షిణాంధ్ర కవులలో నాయకమణి రఘునాథనాయకుడు విజయనగర రాజులలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించిన శ్రీకృష్ణదేవరాయలతో అన్నివిధాల సరితూగగల అసామాన్యుడు కత్తిబట్టి కదనరంగంలో అరివీర భయంకరుడుగా ప్రకాశించిన వీరశిఖామణి! కలంబట్టి కవనం అనన్య సామాన్యంగా చెప్పగలిగిన కవితల్లజుడు. శత్రు సంహారము చేయగల కరకుగుండెకు సహృదయ హృదయ రంజకమైన కవితా పాటవం అలవడడం అసామాన్య గుణం ! రాయల భువన విజయంలాగా నాయకునకు "ఇందిరా మందిరం" విద్వద్గోష్ఠుల కుపకరించినది. ఈతని ఆస్థానం కవయిత్రుల చేత సైతం అలంకరింపబడి పునీతమైనది. ఇతడు సంగీత సాహిత్యాలకు నిధి. సంస్కృతాంధ్ర భాషలలో అనేక గ్రంథాలకు కర్త. లభించిన గ్రంథాలు నాలుగు, 1. వాల్మీకి చరిత్రము 2. రామాయణం (అసమగ్రం) 3. నలచరిత్ర (ద్విపద) 4. శృంగార సావిత్రి (కర్తృత్వాన్ని గూర్చిన వివాదం కలదు). వీటిలో వాల్మీకి చరిత్రం ఒక ఉత్తమ ప్రబంధం ప్రధానంగా ఈ వాల్మీకి చరిత్ర ఆధారంగా రఘునాథరాయల కవితారీతులను చర్చించడమే ఈ వ్యాసోద్దేశం.

రఘునాథరాయలు కృతికర్తయేగాక విజయ విలాసాద్యుత్తమ ప్రబంధాలకు కృతిభర్త కూడ. విజయరాఘవ నాయకుడు ఇతనికి అన్నివిధాలా తగిన కుమారుడు. రఘునాథరాయల సరసత్వం, రాసిక్యం, వైదుష్యం అనన్య సామాన్యం. రఘునాథరాయల సంగీత సాహిత్యాల నిధిత్వానికీ, పాండిత్య ప్రకర్షకు, ఉత్తమ కవితారీతులకు పరమ నిదర్శనం వాల్మీకిచరిత్రము ఇతడు శ్రీరామభక్తుడు. అందుకే రామాయణం రచించాడు. ఆదికావ్యకర్త వాల్మీకి చరిత్రము ప్రబంధంగా వ్రాశాడు. వాల్మీకి చరిత్రలో శ్రీరాముని బహువిధాల వర్ణించి తరించిన పరమ భక్తాగ్రేసరుడు. కరకు కిరాతుడు సన్ముని కావడానికి కారణం 'రామనామ స్మరణంబకాని వేరొక్కటిగా దెట్టి పాపిష్ఠుడైన నిష్ఠాగరిష్ఠుం డగుచు శ్రీరామస్మరణంబు సేయంజేయు సకల శోభ

నంబులు గలుగు" (3-160) నని సప్తర్షులచే తలంపజేయుటయేగాదు, వారిచే "ధర నెన్ని పుణ్య తీర్థములైన గలుగ నీ రామనామము సరిరావు తలంప" (3-159) అని చెప్పించుటచే రఘునాథునకు గల రామభక్తి పారమ్యం గోచరిస్తుంది. అంత మాత్రం చేత రఘునాథుడు అన్య మతద్వేషి అని తలంచరాదు. ఇంక పాండిత్య ప్రకర్షతోపాటు సంగీత నృత్య పరిజ్ఞానాన్ని రంభోర్వశుల నాట్యవ్యాజంతో సర్వజన వేద్యం చేయగలిగిన వాడు రఘునాథరాయలు.

మూడాశ్వాసాలతో ముచ్చటగా ముగింపబడిన ప్రబంధం వాల్మీకి చరిత్ర. ఇందు కిరాతుడు శ్రీరామభక్తియుక్తుడై వాల్మీకి కావడం కథ. బదరీవనానికి నారదుడు రాగా శౌనకాది మహర్షులు విష్ణుకథలు వివిపింపవలసిందని కోరుతారు. ఆ పని పర్వతున కప్పగించి నారదుడు వైకుంఠానికి వెళ్ళిపోతాడు. పర్వతుడు కథ వినిపిస్తాడు. సప్తర్షులు శ్వేతద్వీపంలో విష్ణువును సేవించి దక్షిణ దేశంలోని పుణ్యక్షేత్రాలన్నింటిని దర్శించి కాశికి వెళ్ళుతూ తమసా నదీతీరంలోని బోయపల్లెను చూస్తారు. అక్కడ ఒక కిరాతకుడు దారి దోపిడిగాడై తపస్వులను బాధిస్తాడు. మునులు అతనిని క్షమించి రామనామ ముపదేశించి వెళ్ళిపోతారు. కిరాతకుడు రామనామ జప మహిమచే మహర్షిగా మారిపోతాడు. సప్తర్షులు మళ్ళి వచ్చి చూడగా ముందు బోయపల్లెగల ప్రదేశంలో సన్మోన్యాశ్రమం వెలసినట్లు తెలుసుకొని అబ్బురపడతారు. కిరాతుడు తనపై పెరిగిన వల్మీకం నుంచి బయటికి వచ్చుటచే వాల్మీకి అయి సప్తర్షులను సేవిస్తాడు. మహర్షులు శ్రీరామనామ మహిమను పొగడుతూ వెళ్ళిపోతారు. శ్రీరాముడు వాల్మీకికి ప్రత్యక్షమై తన చరిత్ర వ్రాయుమని కోరతాడు. ఇది ఇందలి కథ. దీనికి మూలం సంస్కృత ధర్మఖండం వాల్మీకి చరిత్రలో కథైక్యంలేదని ఒక వాదం. [(1) ప్రొ. కె. వి. ఆర్. నరసింహంగారు—దక్షిణాంధ్ర యుగ వాఙ్మయ చరిత్ర - పు. 46 (2) ప్రొ. దివాకర్ల వేంకటావధాని గారు - "ఆంధ్ర వాఙ్మయ చరిత్రము - పు. 62]. అనేక పుణ్యక్షేత్రాల వర్ణనలు, రంభోర్వశుల ప్రతిజ్ఞలు, నాట్యాలు మొదలైన వర్ణనలు మితిమించి పోవడంతో కథైక్యంలో శైథిల్యం గోచరించడం వాస్తవమే అయినా సూక్ష్మంగా పరిశీలిస్తే వస్త్వైక్యం ఉన్నట్లు తెలియక పోదు.

కృష్ణదేవరాయల యుగంలో వెలువడిన ప్రబంధాలన్నింటి రసరాట్టయిన శృంగారం పరిపోషింపబడి అత్యధిక ప్రాముఖ్యం పొందినది. దక్షిణాంధ్ర యుగంలో

వెలువడిన ప్రబంధాలలో మోహశృంగార బాహుళ్యం ప్రాతినిధ్యం వహించడంవల్ల సభ్యలోకానికి హేయంగా కనిపించి, అవి గర్హింపబడ్డాయి. కాని వాల్మీకి చరిత్రలో రఘునాథరాయలు ఇలాంటి కళంకరహిత రచనగావించి తన వైశిష్ట్యాన్ని, సంస్కారాన్నీ ప్రకటించుకొన్నాడు. ఇందుకు రఘునాథునెంత కొనియాడినా తీరదు. అతిశయితయైన రాయల రామభక్తి రంజితమై వాల్మీకి చరిత్రగా రూపొందినది.

లాక్షణికులు చెప్పిన కవిత్వలక్షణాలన్నింటిని అలా ఉంచి, కవి తానై చెప్పుకొనిన కవితాలక్షణాలను స్పృశించడం ఎంతయినా అవసరం. రఘునాథుని కలలో కనిపించిన —

"నీ కవితా విలాసము గణింప సుధారస ధారకంటె నిం
పై కనుపించు దాను గృతియైనను మిక్కిలి సొంపు నింపదే
నాకథ దొల్లి యర్థరచనా రుచి మించఁగఁ జెప్పితట్టి వా
ల్మీకి చరిత్రమున్ నొడువు మెచ్చగ నీవిషదచ్యుతాత్మజా!" (1-21)

అని ప్రశంసించడంవల్ల, రఘునాథుని 'కవితా విలాసము', 'సుధారసధారకంటెనిం పై నదని మూడే రామాయణం 'అర్థరచనా రుచి మించగజెప్పి' నట్లు మనకు విదితమవుతుంది. ఇంకా "నవ్యార్థ చమత్కార భవ్యంబును సకల విద్వత్కవి శ్రావ్యంబునుంగా"(1-17). కావ్యరచన చేయగలగడంలో తన కవిత్వం "నవ్యార్థంతో"కూడి, "చమత్కార భవ్యంబు" గాను, "సకల విద్వత్కవి శ్రావ్యంబుగా"ను ఉంటుందని స్పష్టమవుతుంది. ఇంతేగాక రఘునాథుడు కవిత్వ నిర్వచనంపైతం చేశాడు.

"చెప్పఁగవలె గప్పురములఁ
కుప్పలుగా బోసినట్లు కుంకుమపై పై
గుప్పిన క్రియ విరిపొట్లము
విప్పినగతి ఘుమ్మనం గవిత్వము సభలన్" (1-16)

ఇందులో "కర్పూరములు కుప్పలుగా బోసినట్లు, కుంకుమపై గుప్పిన క్రియ' విరిపొట్లము విప్పిన గతిఘు"మ్మ నునట్లు కవిత్వం చెప్పాలట! ఇది సహజ

సుందరమేకాదు, సహృదయ హృదయైకవేద్యం! ఇంత చిన్న చిన్న మాటలతో భావగంభీర్యం వెల్లివిరిసేట్టు చెప్పగలిగిన మహాకవి రఘునాథుడు. ఇదే మరొక కవి అయితే సమాసభూయిష్ఠంచేసి సర్వజన దుర్గ్రాహ్యం గావించి ఉండేవాడు. ఇది రాయలలో మెచ్చుకోదగిన మహత్తరగుణం. ఇంకా—

"చెవులకు జవులై చల్లగఁ
గవులకుఁ దవులై సమస్త కావ్య కళా బం
ధువులై రససింధువులై
యవురాయనఁగవిత లవని నలరన్వలదా?" (1–16)

అని వర్ణించి కవిత్వపుటవధుల్ని చూడగలిగా డీ కవి. రఘునాథరాయల ఆస్థానకవులు, కవయిత్రులు రఘునాథుని కవితా వైభవాన్ని ఎంతగానో వర్ణించారు. అందరిలోను చుక్కల్లోని చంద్రుడిలా చేమకూర వేంకటకవి విరాజిల్లుతున్నాడు. వేంకటకవి విజయవిలాసంలో —

"తా రసపుష్టిమై బ్రతిపదంబున జాతియు వార్తయున్ జమ
త్కారము నర్థగౌరవముగల్గు ననేక కృతుల్ ప్రసన్న గం
భీరగతిన్ రచించి మహియెంచినచో నిక శక్తు లెవ్వర
య్యా రఘునాథ భూపరసికాగ్రణికిన్ జెవిసోకఁ జెప్పఁగన్" (1–81)

అని రఘునాథుని కవితారీతుల్నిగూర్చి చెప్పాడు. ఇందులో రఘునాథుని కవిత్వం 'రసపుష్టి' కలదనీ, ప్రతిపదం జాతి, వార్త, చమత్కారం, అర్థగౌరవంగలిగి ప్రసన్న గంభీరమై ఉంటుందనీ స్పష్టమవుతుంది. ఈ పద్యానికి వ్యాఖ్య వ్రాస్తూ శ్రీ తాపీ ధర్మారావుగారు 'ప్రతిపదంబునందు (అత్యంత విశేషముగ), జాతియున్ స్వభావ వర్ణనములును వార్తయున్-కథను నడసంచు నేర్పును, చమత్కారము, అర్థగౌరవమును, చక్కని అర్థపుష్టియు, ప్రసన్న-ప్రసాదమను కావ్యగుణము కల్గి, సులభముగా అర్థమగునట్లుగా' అని వివరించినారు (విజయవిలాసము. హృదయోల్లాస వ్యాఖ్య-పు 39) ఇక్కడ జాతి అనగా స్వభావోక్తి వర్ణన. ఇట్లే కావ్యాలంకార సంగ్రహములోను చెప్పబడింది. "సహృదయ హృదయంగమమై మహిమనున్నది

యున్నయట్లు మాటలతేటల్ బహుళంబుగా జెప్పిన మహితోక్తియె జాతియయ్యె '....' (శ్రీసన్నిధానం సూర్యనారాయణశాస్త్రి గారి వివరణతో-కావ్యాలంకార సంగ్రహము-పంచమాశ్వాసము పు 627) ఇంక వార్త అనగా వర్ణిస్తున్న విషయం గాని, కథావస్తువునుగాని, కంటికి కట్టినట్లు-హృదయానికి హత్తినట్లు-అనుగుణమైన దేశకాలాది వాతావరణంతో-వాస్తవమా అనిపించేలాగ రచించడం అనవచ్చును. సూక్ష్మంగా చెప్పాలంటే కథాకథన నైపుణ్యమనవచ్చును'అని తాపీవారు వివరించారు (విజయవిలాసము-హృదయోల్లాస వ్యాఖ్య-పుట 60) కాని వేదాల తిరువెంగళాచారి గారు జాతివార్తలగూర్చి ఇలా వివరించారు: 'జాతియనగా స్వభావోక్తియని కొందరు అనిరి, జాతియును స్వభావోక్తియు నొక తెగకు చెందినవేకాని, కొంతభేదమున్నది. స్వభావోక్తి యనగా నొక పాత్రయొక్క స్వాభావికమగు నవస్థను చిత్రించునది. ఈ పాత్రల స్వభావమే కొన్ని తాత్కాలిక మనఃపరిణామములకు లోనై దాని నిమిత్తముగా చిత్రింపబడినప్పుడు జాతియనవలెను 'వార్తయనగా లోక సముదాచారముల చిత్రణము. దేశకాల పాత్రాదికములను జిత్రించెడి యుచితమగు సంప్రదాయ విశేషము, మర్యాదలు మొదలగునవి వార్త........' (తెలుగు విజ్ఞాన సర్వస్వము-4, తెలుగు సంస్కృతి-పు 906). దీనిచే జాతియనగా పాత్రలు ఆ యా సమయాను గుణంగా, మనోహరంగా చిత్రించబడే విధమనీ, వార్తయనగా లోకమందలి సముదాచారాల చిత్రణమనీ స్పష్టంగా తెలిశాయి.

పైని పేర్కొనబడిన లక్షణాలన్నీ రఘునాథుని కవిత్వంలో ఉన్నాయి. వాటిని క్రమంగా పరిశీలిద్దాం. "కర్పూరములు కుప్పలుగా బోసినట్లు, కుంకుమపై పైగుప్పినట్లు, విరిపొట్లం విప్పిన గతి". పరిమళ భరితమై తన కవిత్వం దశదిశల వ్యాపిస్తుందని కంఠోక్తిగా చెప్పిన రఘునాథుని మాటలు అక్షరశః వాస్తవం. ఇది సహృదయ హృదయైక వేద్యం ! ఇలాగే రఘునాథుని కవిత్వాన్ని వాల్మీకి చరిత్రమంతట మనము చూడవచ్చు. ఇందు కారంభములోని" బదరీవన వర్ణన "ఉత్తమ ఉదాహరణముగ (1-31-40) గ్రహించవచ్చు. అంత మాత్రముచేత తదితరం ఉదాహరణ కాదని తలంచరాదు.

ఇంకా రఘునాథుడు "స్వార్థ చమత్కార భవ్యము"గ కావ్యము చెప్పదలచినట్లు స్పష్టమవుతుంది. అంటే క్రొత్త అర్థాలతో చమత్కార శ్రేష్ఠంగా కవిత్వం చెప్పగలనని అతని అభిప్రాయం. వాస్తవానికి ప్రబంధ కవులు, ఆ తరువాతి కవులు

అర్థం కంటె శబ్దానికే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చినట్లు సర్వజన విదితమే కాని, తాను మాత్రము అలాకాక నవ్యార్థంతో కూడిన చమత్కారయుత కవిత్వం చెప్పుతా నని రఘునాథుని అభిప్రాయం. ఇచ్చట చమత్కారం అన్నంతమాత్రాన కేవలం ఏదో గమ్మత్తులు చేయడంకాదు. "భవ్య" శబ్దప్రయోగంవల్ల "శ్రేష్ఠమైన" అంటే ఇతరులకంటె ఉత్తమ రీతినని రఘునాథుని అర్థం అని తలంచవలసి ఉంటుంది. ఈ చమత్కారాన్నిగూర్చి "తారసపుష్టిమై" అన్న పద్యంలో చేమకూర వేంకటకవిగూడ పేర్కొనే ఉన్నాడు. "నవ్యార్థ"మని రఘునాథుడన్నదానిని సమంగా "అర్థగౌరవం" అని వేంకటకవి పేర్కొన్నాడు పై రెండు లక్షణాలుకలసిఉండవచ్చు లేదా వేర్వేరుగా ఉండవచ్చు. అర్థపుష్టితో ఒప్పారు చమత్కారయుత రచనకు గ్రీష్మవర్ణన అత్యుత్తమోదాహరణ. అందులోని—

"బడిచనుదెంచు చాయ దరఁబాంథుల తాపముతీర నక్కడ
క్కడఁదరుజాల మూలములఁ గ్రమ్ముచు నిల్వదాని గ్రుచ్చుకో
వడిఁగరపాళియొత్తి దనవల్లభుఁడల్లనసాగె నాగ న
య్యెడ నతిదీర్ఘభావము వహించెనహంబులహో మహోగ్రతన్" (1-73)

అనే ఈపద్యంలో అర్థవంతమైన చమత్కారం గోచరిస్తుంది. వేసవికాలంలో రాత్రికంటె పగలు దీర్ఘమైనదని చెప్పడం విషయం. ఎలాఅయినదీ కవిభావిస్తున్నాడు. బాటసారులను ఎండనుంచి రక్షించడానికి ఛాయాదేవి చెట్లమూలల్లో నిలబడిపోతు ఉండగా ఆమెను తన కరములతో గ్రహించి తనతోపాటు కొనిపోవడానికో అన్నట్లు సూర్యుడు సాగాడట; అందుచే కొంత ఆలస్యమైనది. ఆ ఆలస్యంవల్లనే అహస్సులు దీర్ఘములయ్యాయని కవి చమత్కరించాడు. ఇందలి అర్థపుష్టిని గ్రహిస్తే చమత్కారం సుస్పష్టమవుతుంది. ఇందు ఉత్ప్రేక్షాలంకార ప్రయోగంతో కవి తన భావనాబలాన్ని కల్పనతో జోడించి మరింత మనోహరంగావించి తన కవితారీతిని ప్రకటించాడు. ఇంకా 'అట్టి వేసవి బెడిదంపువెట్టకతన నేలనందంద విరిసిన నెరియలందుఁ దరణిపాదంబు లెడనెడఁదవులయెల్లఁ దివిచికొని పోవదినంబు దీర్ఘమయ్యె' (2-44) దినందీర్ఘం కావడాన్ని సహజంగా ఊహించా డీ కవి. దీనిచే 'శబ్దాడంబరంగాని' శబ్దాలగారడిలు గాని లేక సహజసుందరమైన రచన చేయగలిగా డీ కవి అని తెలుస్తుంది.

12)

శ్రీరంగంలో సప్తర్షులు "మంచి తెమ్మెర దూదినించిన గోధుమవన్నె పానుపు మీద నున్న........" (2-26) శ్రీరంగేశుని దర్శించారట ఇది అర్థనిర్భరమై ఒప్పు తూంది. 'మంచి తెమ్మెర' అనే దూదితో తయారుచేయబడిన "గోధుమవన్నె"తో గూడిన పానుపుమీద శ్రీరంగేశుడు వవళించాడు. విష్ణుపానుపు ఆదిశేషుడు ఆ సర్పానికి ఆహారం వాయువు. అలాంటి గాలి అనే దూది నింపి చేయబడిన పరుపు పైగా అది గోధుమవర్ణంగలదట. ఆదిశేషునివర్ణం మనకు తెలిసిందేకదా! ఆతెమ్మెరకు "మంచి"అని విశేషణంగూడ ప్రయుక్తమైంది. దీనిచే మెల్లగావీచే చల్లని పిల్లగాలి అని స్పష్టమవుతుంది. అలాంటి పాన్పుపైన విష్ణువు సుఖంగాశయనించాడని అర్థము ఇలా ఇదెంతో అర్థవంతమై సహృదయ రంజకమై రఘునాథుని అర్థపుష్టితోకూడిన చమత్కారయుత రచన గోచరిస్తూంది. ఇంక—

"తలకడఁబాముఁ జేర్చుకొని దయ్యమునెయ్యము నమ్మి యేటిలో
నెలవుగ నిల్లుగట్టుకొని నీవిటులుండగ నోర్చుటెట్లు మా
వలనగు మానసాబ్జముల వాసముసేయు కొరంతలేదు నీ
యలమట దీరెడున్ విను విహంగమ వాహన రంగమోహనా!" (2-30)

అన్న పద్యంలో సైతం చమత్కారం గోచరిస్తుంది తలదగ్గర ఆదిశేషుడు పడగ విప్పి ఆడుతూండడం, "దయ్యము నెయ్యము" నమ్మి 'ఏటిలో నిల్లుగట్టుకొని' ఉండడం అంత క్షేమకరంకాదని, మా 'మానసాబ్జముల వాసముసేయు కొరంతలేదనీ' మునులు శ్రీరంగేశుని అపాయస్థితినిగూర్చి జాలిపొంది చెప్పిన మాటలెంతో అర్థ పుష్టితో చమత్కార క్షమమై ఒప్పుతున్నాయి. ఇట్లెన్నేని ఉదాహరణ లిందుకొనగ వచ్చును.

ఇంక వేంకటకవి చెప్పిన వార్తా ప్రసన్న గంభీరగుణాలు. జాతి అన్నది స్వభావోక్తిలాగే ఉండినా, దానికంటె విశిష్టమైనదని ముంటే తెలసినది గ్రీష్మవర్ణన లోని —"

పటపట పగిలెం గుంభిని
తటతట పథికుల మనంబు తల్లడపడియెన్
చిటచిట నెగసెన్ దవ శిఖి
కటకట గ్రీష్మం బొకింత కనబడు నంతన్" (2-72)

అనే పద్యం స్వభావోక్తికి పరమోదాహరణం. తాత్కాలిక మనః పరిణామాను గుణంగా రచింపబడిన స్వభావోక్తి యేజాతి. బదరీవన వర్ణన అంతా దీని కుదాహరణమే. అందలి మునులు ముక్తి లలననుగోరి చేసిన తపస్సు ఈ పద్యంలో వర్ణితము.

"ఒక్కనాడైనను జక్కగా గనువిచ్చి
బెళకుఁ జూపులు జూచు ప్రేమలేక,
వేడుకకైనను వెకలినవ్వులు మీర
నటన జూపట్టఁ బల్కులు లేక
యుబుసు పోకకునైన నుల్లంబు చల్లగాఁ
జందనం బలదెడు పొందు లేక
నెలకైనఁ గొంతయాఁకలి దీరఁగలమాన్న
కబళ మొక్కటి జిహ్వ కమియలేక
నలగి యెండలనెండి వానలను దడిసి
మోహమున్త్రోవ యెరుగక దేహమాత్ర
ధారులైనట్టి యచ్చటి తపసులెపుడు
వలవ జేయుదు రల ముక్తి లలన గోరి". (1-33)

ఇందులో మునులకు స్వభావోచితమైన వ్యాపారాలన్నీ వర్ణింపబడ్డాయి. అవి లేక, లేదా వాటిని త్యజించి అంటే "ప్రేమ రహితంగా, పల్కులు లేక, చందనపు పొందు లేక, కలమాన్న కబళం కమియలేక" అని అర్థం. "నలగి, యెండల నెండి, వానల దడిసి మోహమను త్రోవ యెరుగక దేహ మాత్ర ధారులైనట్టి" సర్వసంగ పరిత్యాగులని వివరింపబడినది. అంటే మునులు తమ పూర్వస్థితిని పరిత్యజించి, తపోనిమగ్నులగుటచే తాత్కాలిక మనఃపరిణామం అంటే తపస్వులుగా దేహ యాత్రను సాగిస్తున్న విషయం ఎంతో స్వాభావికంగా ఇందు వర్ణింపబడి ఉండడం వల్ల ఇది జాతి. దీని తర్వాత పద్యాల్లోను ఇట్టిదే గలదు. ఇలాగే వాల్మీకి

చరిత్రలో జాతి వర్ణన గలదు. ఇక వార్త. "వార్త యనగా లోక సముదాచారముల చిత్రణ"మని ముందే తెలిసినది. ఇది కన్నులకు గట్టినట్లుండడం అవసరం. సప్తర్షుల భక్తి ప్రపత్తులు, కిరాతుల జీవిత పద్ధతులు, ఎవడైనా తపోనిగ్ననయ్యా డన్న సంగతి వింటే భయకంపితుడై సమాలోచన చేసి తపోభగ్న మొనర్ప అప్స రసలను పంపే ఇంద్రుని మనస్స్థితి మొదలైన వాని వర్ణనలన్నీ దీని కుదాహరణలే అవుతాయి. అంతేగాక కవి గావించిన స్థానిక ప్రకృతి వర్ణనలలోను ఈ వార్త స్పష్ట మవుతుంది. ఇందులో ముఖ్యంగా మునిగా మారిన కిరాతుని తపస్సునుంచి మరల్ప యత్నించిన సందర్భంలోని కిరాతుల మాటలలోనిది విస్పష్టంగా ప్రకటితమవుతూంది. ఆలుపిల్లల, బాంధువుల సహ పంక్తిలో భుజింపక అన్న పానీయాలు త్యజించి కృశిం చడం ఉచితం కాదని —

"గువ్వ కరకుట్లు మెకముల
క్రొవ్వుల బొరుగులును, గునుకుగుటుములు నేయున్
నివ్వరి కూడును నింటన్
బువ్వంబున గుడువ కిట్లు పొక్కందగునే". (2–138)

అని కిరాతులు సంసారంపై ఆశ చూపుతారు. ఇది కిరాతకులకు సహజ విషయం. దానైనా జ్ఞాపకం చేస్తే కిరాతుడు తిరిగి వస్తాడని వాళ్ళ ఆశ. కిరాతుల భోజన విధానం ఇందులో కవి స్పష్టం చేశాడు ఇట్లెన్నైని దీని కుదాహరణలుగా ఈవచ్చు. రఘునాథుని కవితా లక్షణంలోని వైశిష్ట్యం ప్రసన్నం అంటే ప్రసాద గుణం. ఇది కావ్యగుణాల్లో ఒకటి. ఒక ప్రసాద గుణానికి —

"కన్నుల పండువౌ నొక యగారములో రతనాల మేడ యో
ర న్నును గెంపుటంచు నెలరాల మెరుంగుటరుంగు మీద దా
ను న్నలకూబరుండును మనోహరలీలల నెత్త మాడి తే
పన్నిద మంచు( బంతములు వల్కుచు నుండెడు రంభ జూచుచున్".

(3–13)

— అన్న పద్యం చక్కని ఉదాహరణగా చెప్పవచ్చు. కేవల ప్రసాద గుణమేగాక భావ గాంభీర్యంతో, రాచఠీవితో పద్యాన్ని నడపడం గూడ రఘునాథునికి చేతనవుతుంది. తాను రాజు గావడంవల్ల రాచఠీవి కవితలో సైతం ప్రస్ఫుటించింది.

రఘునాథుడు తానై చెప్పినవీ, చేమకూర వేంకటకవి చెప్పినవీ అయిన కవితాలక్షణాలేగాక రఘునాథునిలో ఇంకా అనేకాలున్నాయి ప్రబంధంలో వర్ణనలు అపరిహార్యాలు. ఇతర లక్షణాలతోపాటు అష్టాదశ వర్ణనలున్నప్పుడే ప్రబంధ మవుతుందని విమర్శకుల అభిప్రాయం. రఘునాథరాయలలో వర్ణనా వైదగ్ధ్యం అసామాన్యంగా ఉంది. తీర్థ యాత్రలకై బయలుదేరిన సప్తర్షులు—

"అంతం గాంచిరి వారు చూడ్కి కనవద్య ప్రోద్య దుద్యానముల్
వింతల్సేయుచు నుండఁగా నుభయ కావేర్యంతరీ పాంతరా
క్రాంతాశాంత విచిత్ర గోపుర ఘనప్రాకార సౌధావళీ
ప్రాంత ప్రోతమణి ప్రభోజ్జ్వల నభోరంగంబు శ్రీరంగమున్" (2-24)

అని వర్ణించడంలో రఘునాథుని విదగ్ధత గోచరిస్తుంది. ఇతని వర్ణన కన్నులకు గట్టినట్లుండి హృదయానికి హత్తుకొంటుంది. దీనినే దటశ్య సాక్షాత్కారమన వచ్చును. "మెరుపు వచ్చని దట్టి యొరపుగా గటిఁగట్టి " (1-19) శ్రీరాముని రూపం ఇందు ప్రత్యక్షంగా కన్నుల ఎదుట నిలిచి నట్లున్నది. ఇంక "కులుకు గుబ్బలతోనే కురువింద సౌరులు ..." (2-140) కిరాత నాయకురాలి వర్ణన ఎంతో మనోహరం. ఇట్లే నారదుడు (1-41), విష్ణువు (1-86), శివుడు (1-45, 65) ఇంద్రుడు (3-11), బదరీవనం, గ్రీష్మ ఋతువు, బోయపల్లె, సురాపగ, సముద్రం, సూర్యోదయం, సాయం సమయం, వసంతం - మొదలైన వాటినెంతో మనోజ్ఞంగా వర్ణించి రఘునాథుడు తన వర్ణనా వైదగ్ధ్యాన్ని ప్రకటించాడు. ఈతని వర్ణన విధానంలో మరొక విశేషం సైతం గోచరిస్తుంది. అదియే ఈతని కవితలోని స్థానిక ప్రకృతి వర్ణనా పద్ధతి. స్థానిక ప్రకృతి వర్ణన చేయడంలో శ్రీనాథుడు ప్రథముడు. ధూర్జటి ఇట్టి వర్ణనలో దిట్ట. కృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలో మధుర, విల్లిబుత్తూరు వర్ణనలో స్థానిక ప్రకృతి అంతా స్వరూపం వహించింది. ఇట్లే

తంజావూరు ప్రాంతమందు "ప్రాంత కాంత కవేరకన్యాంబు ధన్య వివిధ సస్య ప్రసస్యమై వెలయుచుండు" (2-35) ననీ "అందలి సౌధయూథముల అందము నచ్చటి కేలికావనీ బృందము చందము" (2-36) మనోహరంగా ఉన్నాయనీ, శ్రీరంగం (2-24) మనోజ్ఞమనీ రఘునాథుడు వర్ణించాడు. ఇంకా బోయపల్లె ప్రాంతంలో గల ప్రకృతి నెంతో ఉచితంగా చిత్రించాడు.

ధారాశుద్ధిశైలి ఉన్నట్లయితే కవిత్వానికి వన్నెచేకూరుతుంది. ధారాశుద్ధి లేక పోతే కవిత్వం వ్రాయకపోవడమే ఉచితం ధారాశుద్ధిశైలి రఘునాథరాయలకు వెన్నతోబెట్టిన విద్య. ఏ పద్యం తడవినా ఇది సుస్పష్టమవుతుంది. విష్ణుకథల శ్రవణ పేయంగా చెప్పవలసిందని మునులు కోరగా నారదుడు విష్ణువును మదిలో తలచి మైమరచిన సందర్భంలోని పద్యం—

"పులకలు మేనఁజాదుకొనఁ బొంగుచు మాటికి హర్షబాష్పముల్
జలజల జిందగా హరితలంపున జిందులుద్రొక్కు గొంతసే
పలయికవోలె మైమరచి యంతట గన్నులు విచ్చిచూచి మౌ
నులడిగినట్టి యర్థము మనోహర మౌటకు నిచ్చమెచ్చుచున్" (1-49)

చక్కని ఉదాహరణము. ఇట్లే "దుప్పులఁబడవేసి...." (2-141) అన్నది గూడ ఉదాహరణమే. ఇట్లే రఘునాథుని ధార కమ్మచ్చులో తీగ తిగిచినట్లు సాగి పోవడం సహజ విషయం.

రఘునాథునిశైలిలో నాటకీయతస్సైతం స్పష్టంగా గోచరిస్తుంది. బదరీవనానికి నారదుడు రాగా మహర్షులెదురేగి తోడితెచ్చి అర్ఘ్యపాద్యాదులొసగి ఉచితాసనంపై సుఖాసీనుని గావించడం, నారదుడు 'శౌనకా' సుఖమే విశ్వామిత్ర లెస్సలా కణ్వ మంచిదియె భార్గవ శుభంబె....' (1-4) అంటూ పరామర్శించడం, విష్ణుకథలగూర్చి చెప్పవలసిందని మునులుకోరడం విష్ణుస్మరణతో మైమరచి, కనులుదెరచి తాను వైకుంఠానికి విష్ణుదర్శనార్థం వెళ్ళుతున్నాననీ, వాళ్ళుకోరినపని పర్వతుడు చేయగల డని చెప్పి వెళ్ళిపోవడం—అంతా నాటకీయంగా నడచింది. ఇదంతా నాటకంలో ఒక రంగంలాగా కన్నులకు కట్టినట్లున్నది. ఇట్లే తమసానదీ తీరంలో సప్తర్షులకు కిరాతు

డద్దుపడి హితముపదేశించడం, వాడు తపస్వులకు సమాధానమొసగడం, ఇంటికిపోయి ఆలివలన భర్త సంపాదించిన దానిననుభవించడమేగాని, పాపంతో పనిలేదని తెలుసు కోవడం, అది విని రోసి మునుల హితముపదేశంతో కిరాతుడు తపోనిమగ్నుడు కావడం–అంతా నాటకీయంగా నడచింది ఇట్లు నాటకంలోలాగే ఆయా సందర్భాలలో మునులు, కిరాతికిరాతులు సంభాషించడం సహజసుందరం ఇట్లే ఇంద్రుడు సభదీరి ఉండడం, సభలోకి రంభాదుల ప్రవేశం–మొదలైనవన్నీ నాటకీయంగానే నడిచాయి.

కవికి లోకజ్ఞత ఎంతో అవసరం. లోకంలోని సమవగాహనం కవికుంటే కేవలం భావనాలోకంలో విహరించక, తన చుట్టుపట్టు పరిసరాలలోని సమస్యల్ని, సూక్ష్మవిషయాల్ని స్పష్టంగా తన కవిత్వంలో జొప్పించి పాఠకలోకాన్ని మురిపించ డమేగాక తన కవితకొక వైశిష్ట్యం చేకూర్చుకొనగలడు ఇలాంటి లోకజ్ఞతతో కృష్ణ దేవరాయలతో సరితూగగల కవి శిఖామణి రఘునాథుడు. వైకుంఠం మొదలుకొని అతి సామాన్య కిరాతక జీవితం వరకు సర్వ విషయాల్ని క్షుణ్ణంగా గుర్తెరిగినవాడు రఘునాథుడు. తాను రాజు గనుక భోగభోగ్యాలనుగూర్చి ఇంద్ర వైభవాన్నిగూర్చి సహజంగా చెప్పడంలో వింతలేదు. అటుక జీవితంలోని సూక్ష్మాతిసూక్ష్మ విషయ వివరణచేయడంలో రఘునాథుని లోకజ్ఞత గోచరిస్తుంది తమసా నదీతీరంలోని బోయపల్లె వర్ణన —

"తోరణంబులుగ వీధుల నారగట్టిన
యుప్పుగండలకు నొండొండ దిరుగు

పులుగులతెక్కఁ గాడ్పుల జాలనెగిరెడు
పసరంపు బొలకంపు ముసురుకొనగ

బసివట్టి నలుగడఁబరచిన మేకముల
పచ్చితోళ్ళను బిండ్లగ్రుచ్చి పెరుకు

బలు జాగిలంబుల భౌభౌ రవంబులఁ
గొంకి పంకములోన ఘుర్ఘురించి

పరువులిడు నూరబందుల మురికి గవులు
చేపతట్టల గదురుతో బెనసి చుట్టఁ
గూతబెట్టిన జనుల వాకొలుపజేయ
భయముగొల్పెడు నొక బోయపల్లె గాంచి"
చుట్టును బసరపు తెమ్మల
తెట్టలు చూచినను మదికి దిగులయ్యెడు హా
కట్టిడి దైవం బిచ్చటి
కెట్టు మనలదెచ్చె దాటుటెట్లొ కొయచటన్" (2-91, 92)

మొదలైన పద్యాలలో బోయపల్లెలోని సంగతులను గ్రహించి తదుచితరీతిని వర్ణించడంవల్ల రఘునాథుని లోకజ్ఞత విదితమవుతుంది. దీనికి కృష్ణదేవరాయలు 'ఎలనీటి బొందలంబులువోలె....' (ఆముక్తమాల్యద 6-17) పద్యమే మూలమన వచ్చు. కిరాతుని తపస్సునుంచి మరల్ప యత్నించు కిరాతుల మాటలతో ఆటవిక జీవితమంతా ప్రతిబింబించినది. రంభోర్వశుల నాట్యవ్యాజంతో రఘునాథుడు తనకు గల సంగీత నాట్యాలకు సంబంధించిన సర్వం స్పష్టంచేశాడు.

రఘునాథునిలో తెలుగు నుడులతోగూడిన రచనయే అధికం.

"మన్నిల రేగగ నేనుగు
మన్నీఁడడవిఁబడి యెండమావులు ద్రావం
గన్నర బరచుచు నడియా
సన్నాగులుచు వ్రాలి సోలి జాలింబడుచున్".
"కొన్ని పెంటి యేనుగులుఁ దాను జోకయై
మూకదప్పి దప్పి మోములెండఁ
జల్లగాలి జాడ మెల్లన యరసి యా
సరసి దరిసి యింపు బెరసి యంత". (1-100,101)

ఇందేనుగులు సరసి కరిగిన విధం అచ్చతెలుగు పలుకులలోనే స్పష్టం చేయబడింది. ఇంకా —

"దాయలుగూడి యెవ్వరు విశా నిను మాతల గాకయుండ నీ
మాయలు పన్ని రింత చలమా తలమానిసి వింట, వింటనీ
వేయగనేరవో మలల నేయెడలన్ దిరుగాడ నేరవో
బోయతనంబు వీరిడిని బోయెగదా మగవాసి వమ్ముగన్". (2-1[illegible]4)

అని కిరాతుని స్థితికి కిరాతులు పలుపలు విధాల వగవడం ఎంతో సముచితంగా అచ్చ తెలుగు పదాల్లో ఇమిడి వున్నది. ఇట్లు ఆంధ్ర భాషనే రఘునాథరాయలు సమాదరించినా, సంస్కృత భాషకు సైతం అతని కవితలో ప్రాధాన్యం లేకపోలేదు. రసోదంచిత రచనా వైభవం రఘునాథుని కవితా పరిమళం అది గుబాళించి సరసుల మనసుల మురిపిస్తుంది. సందర్భోచిత సంస్కృత సమాస భూయిష్ఠ రచన సామాన్యంగా కనిపిస్తుంది.

"స్రగ్ధర॥ కనిరామౌనానీంద్ర చంద్రుల్ ఘనరసవదస్వకస్ఫారణాచుంచుపంచానన కోపాటోప చంచన్నఖర కులిశ భిన్నత్రుటత్కుంభి రాట్కుంభ నివేశోన్ముక్త ముక్తాఫల సరవిసరోద్భాసి ఝిల్లీమతల్లీ
ధనురాస్ఫాలస్ఫురన్నిధ్వని జనితమృగీధావనంబున్ వనంబున్" (2-89)

ఇదొక ఉదాహరణ మాత్రమే. ఇలాంటివెన్నో చిత్రాలు మనం చూడవచ్చు. 'చెప్పగవలె గప్పురంబులు'– అనే రఘునాథుని పద్యాన్ని పురస్కరించుకొని 'శ్లేష యమకాదుల యందుగాని, యలంకృతి విశేషములందుగాని, రఘునాథునికంతగా రుచి లేదని పై పద్యమునుబట్టి తెలియుచున్నది'–అని గురువర్యులు ప్రొఫెసర్ కె.వి.ఆర్. నరసింహంగారు చెప్పిన విధానము పూర్తికాకపోయినా కొంతవరకు రఘునాథునికీ అలంకార రచనపై ఆసక్తిగలదని తెలుస్తుంది (దక్షిణాంధ్ర యుగవాఙ్మయచరిత్ర– పు 41) ఛేకాను ప్రాస, వృత్త్యను ప్రాసలకును–"పంచిన లీలరాగము ప్రపంచితమై చెలగన్ విపంచి వాయించి .." (1-7), అంత్యప్రాసలకు–'పంకజబంధు బింబస్థాయి

త్రైలోక్య మంగళదాయి శ్రీరంగశాయి....' (2-32) చక్కని ఉదాహరణలు శబ్దాలంకారాలలో ఉత్ప్రేక్షపై రఘునాథునకు అధిక ప్రీతి. అంతమాత్రంచేత తక్కిన అలంకారాలను ప్రయోగించలేదనికాదు ఇంతకుముందే ఉత్ప్రేక్ష, స్వభావోక్తులగూర్చి స్పృశించడం జరిగింది. ఉపమాలంకారాన్ని చాల విశిష్టంగా ప్రయోగించాడీ కవి

"సతులెవ్వరు సుతులెవ్వరు
హితులెవ్వారేటి వరదనెందేనొకచో
జతకూడిన కాష్ఠంబుల
గతినించుకకూడి విచ్చికదలుదు రవలన్" (2-149)

ఎంతో సహజంగా ఉందీ రూపసామ్యం. రూపకాలంకారానికి 'పడగ సురటుల....' (2-81) స్వభావోక్తికి "కుదురుగ జంగసాచి...." (2-175), క్రమాలంకారానికి-"చెరకు విల్లసదని వెరకుమీ....' (3-77) ఇందు చమత్కారం సైతం సహృదయ హృదయైక వేద్యం. ఇట్లే అలంకారాలను సహజంగా వాడాడీ కవి. రఘునాథుని కవిత్వంలో తెలుగు నుడికారాలు, పలుకుబళ్ళు, జాతీయాలు, లోకోక్తులు, కోకొల్లలు; 'కట్టిడి దైవంబు, ప్రేవుల్ గుండెలు నిలువక వాతికి నుండగిలెడు, కోసినటువలె మనసున రోసిరోసి (ఈద్విరుక్తిచే ఎంతగా రోసి ఉన్నారో స్పష్టం అవుతుంది.) మేనులు పెట్టుచునుండన్, దుమ్ముకుమ్మువలె నంటుకొనన్, బలు చట్టలుమీద నుతికి పారన్వైతున్, పులుకుపులుకున గనుగొని, బాపన పిసాచులు, పచ్చపైకంబు, పచ్చిబోయ మనసు, చివుకురుమగ, ఎవ్వరెవ్వారలేయూరి కేదిత్రోవ, బాపనదయ్యము పట్టెనో, రాతమలచిరొ నిన్నున్, డెందంబున జేయిడి సుఖంబుననుండు, ఆకునలములు దిని, చీమదూరని, నిదురమంపెల్ల, ఇంటగెల్చి కా రచ్చను గెల్వగావలయు. అర్థమూలంబు జగమెల్ల (ఇది ధనమూలమిదం జగత్'-అన్నదానికి ఆంధ్రీకరణ) మూగదయ్యము పట్టినదో, చెవిటి మ్రోలబాడిన సంకునాఫలము లేకపోవ" మొదలైనవిందు కుదాహరణలు. ఇట్టి పలుకుబళ్ళు, నుడికారాలు, జాతీయాలు, సామెతలు ప్రయోగించడంవల్ల తెలుగుభాషా జీవిత తత్వాన్ని పట్టిఇస్తున్నదని స్పష్టమవుతుంది. దీనిచే రఘునాథునకుగల ఆంధ్రభాషా తత్త్వజ్ఞానం అవగతమవుతుంది

రఘునాథుడు పూర్వ కవులను అనుకరించినట్లు తెలుస్తూంది. ఇతడు ప్రబంధ రచన చేయడంవల్ల ఎక్కువ శ్రీనాథుని, తరువాతి ప్రబంధ కవులను అనుకరించినట్లు

స్పష్టమవుతుంది. అయినా ప్రబంధచ్ఛాయలుగల నాచన సోమనాథుని సైతం అనుకరించినట్లు తెలియకపోదు. ఇతడెక్కువ తెలుగు నుడులనువాడి, నాటకీయ శైలిలో కవిత్వం చెప్పడం తిక్కన పద్ధతి ననుసరించాడనడానికి నిదర్శనం. స్థానిక ప్రకృతి వర్ణనలో శ్రీనాథుడు, కృష్ణదేవరాయలు ఇతని కాదర్శపురుషులు. ధూర్జటివలెనే ఆటవిక జీవితం సర్వం వర్ణించి తన నైపుణ్యాన్ని ప్రకటించాడు. ఇందు రంభోర్వశుల రగడ, పింగళి సూరన కళాపూర్ణోదయములోని రంభకు, రంభారూపంలో ఉన్న కలభాషిణికి జరిగిన కొట్లాటను స్ఫురింపజేస్తుంది. ఇంక అప్సరోభామినుల జాబితా గల—

"పుంజికస్థల యలంబుస మనోరమ హేమ
దారు సంజీవని చారునేత్ర" (3-81)

— అన్న రఘునాథుని పద్యం "వ్యాస భరద్వాజ వాల్మీకి కాశ్యప జాబాలి కణ్వ పులహ " (హరివంశము - ఉత్తర భాగము ఆ-5) అనే ఎర్రన పద్యం లాగా, "పాంచాల పాండ్య బర్బర కిరాతా భీర కురు విదేహ విదర్భ కుకురగౌళ...." (ఉత్తర హరివంశము — 5-144) అన్న నాచన సోముని పద్యంలాగా ఉన్నది. అట్లే "చని చని కాంచిరంత...." (2-81) అనే రఘునాథుని పద్యం "చని చని కాంచెనంత ఋషి సంహతి...." (2-70) అను నాచన సోముని పద్యంలాగా కలదు. రఘునాథుని —

"మరకత శ్యామ కోమల విగ్రహము వాని
మకరకుండల దీప్తి మహిమవాని" (1-82)

అనే పద్యం — "మణిహేమ పర్యంక మహితోపవేశను సురు చిరా భరణ విస్ఫురితగాత్రు ...." (భారతము - శాం. ప. 2-5) అనే తిక్కన పద్యంలాగా, "మేఘంబు మీది క్రొమ్మెరుగు మేనిపైనున్న పచ్చని పటమువాడు ...." (భాగవతము — ప్ర. స్కం. —283) అనే పోతన పద్యంలాగా ఉన్నది. వీటి కంటె రఘునాథుని పద్యంలో మరికొంత విశేషం సైతం కలదు. అంత్యప్రాసలు తిక్కన పద్యంలో లేవు. పోతన సీసపద్యంలో పాదాంత్య ప్రాసను పాటించాడు. కాని రఘునాథుడు సీసపద్యం ప్రతిదళంలోను అంత్య ప్రాసను పాటించి, ఆరంభంలో 'మకర శబ్దాన్ని తప్పక ప్రయోగించి శ్రుతి సుభగత్వాన్ని సంపాదించి తన ప్రతిభను

ప్రకటించాడు. రఘునాథుని "నారాయణుని దివ్యనామావళులు వల్కు- "(1-44) అనే పద్యం "సరిగమ పదనిస సంజ్ఞ స్వరంబుల ...." (పారిజాతాపహరణము —1-44) అను ముక్కు తిమ్మన పద్యానికి; రఘునాథుని "పంకజ బంధు బింబ స్థాయి ." (2-32) అనే పద్యం "అపవర్గ కాంక్షచే నాకొన్నవారికి...." (కవికర్ణ రసాయనం — 1-91) అనేపద్యానికి నకళ్ళలాగా కనిపిస్తున్నాయి. ఇట్టీ కవి ఆయా కవుల ననుకరించినా, తన ప్రత్యేకతను నిలబెట్టుకొంటూ సమున్నతరీతి కవిత జెప్పి విశిష్టుడైనట్లు స్పష్టమవుతుంది.

ఔచిత్య పోషణం కవిత్వ పరిరక్షణకు నిదర్శనం. అనౌచిత్యం కంటె రస భంగ కారణం మరొక్కటుండదని ఆలంకారికమతం. రఘునాథుడు ఎంతో సముచితంగా కవిత్వం చెప్పినట్లు అతని కవితా పరిశీలన వలన తేలినది. కిరాతుని వల్ల దెబ్బలు తిన్న కిరాతుని సంబోధించడం వారి స్వభావానికి, సంయమనానికి ఉచితంగా మాటలు వ్రాసి రఘునాథుడు తన ప్రతిభాన్విత కవిత్వలక్షణాన్ని ప్రకటించాడు.

"తాపసులమమ్ము బసుల చందమున గొట్ట జేతులెట్టాడె నిదియేమి చేటు నీకు బాతకుడుగాగ నెన్నాళ్ళ బ్రతికె దీవు రాతజేసిరె యోరి కిరాత ! నిన్ను" (2-104) ఇందు "తాపసుల మమ్ముబసుల చందమున గొట్ట జేతులెట్టాడె", "ఇది యేమి చేటు నీకు" "పాతకుడు గాగ నెన్నాళ్ళ బ్రతికెదీవు", "రాతజేసిరె యోరి కిరాత ! నిన్ను" అని సపరుషలు అనడంలో ప్రతి పద సార్థక్యంతోపాటు ఎంతో ఔచిత్యం గూడ ఉంది. "రాతజేసిరె" అని రెండు సార్లు ప్రయోగించి దాని వైశిష్ట్యాన్ని ప్రకటించాడు. "నీవు చేసిన పాపంలో నీ ఆలుబిడ్డలకు భాగముంటుందా? ఉండదా?" అని మునులు ప్రశ్నింప ఆ విషయం తెలుసుకొని వస్తానన్న సమయంలోని కిరాతుని మాటలు భావ నిర్భరమై ధ్వని స్ఫోరకాలై ఉన్నాయి.

"అదె వల్లె దవ్వులేదిట
గదలకుడి వచ్చుదనుక గాదని యవలం

గదలిన నాలాగు నెరుం

గుదురేకద యంచు బలికి గొబ్బున జనియెన్ — (2-12)

'అదెపల్లె' అంటె అ కనిపించేదే అనీ, 'దవ్వు లేదు' ఎంతో దూరంలేదనీ 'ఇట గదలకుడి వచ్చు దనుక' అనీ 'కాదని కదలిన నాలాగు నెరుంగుదురేకద' అని కిరాతడు పల్కడం ఎంతైనా ఉచితంగా ఉంది. ఆ మాటల సార్థక్యం సహృదయ హృదయైక వేద్యం! ఇట్లే కిరాతీ కిరాతుల మాటలు, రంభోర్వశుల తీరులు, మాటలు, ఆయా సందర్భాలకు తగిన రీతిగా ఉండి రఘునాథుని ఔచిత్య పాలనను వ్యక్తం చేస్తున్నాయి.

పై పరిశీలన వలన రఘునాథరాయల వాల్మీకి చరిత్రలోని కవితారీతులన్నీ మహాకవి కుండవలసిన లక్షణాలను స్పష్టం చేస్తున్నాయి. ప్రబంధోచితంగా కథను ప్రపంచీకరించడంలోను, శ్రీరాముని మీద గల ప్రగాఢ భక్తితోపాటు సర్వదేవతా సమానత్వాన్నంగీకరించడంలోను నవ్యార్థ చమత్కార భవ్యంబు గాను, జాతి వార్తలు, అర్థ గౌరవం - మొదలైన గుణాలతో కవిత్వం చెప్పడంలోను, అవసర మని తలంచినచోట సంస్కృత సమాస భూయిష్ఠంగా చెప్పినా, అచ్చ తెలుగునే ఎక్కువ అభిమానించి ప్రయోగించడంలోను, సహజసుందరమై భావ గాంభీర్యంతో ఒప్పారు కవితా శైలీ విన్యాస ప్రకటనలతోను, అనేక పూర్వకవులను అందులోను శ్రీనాథ, కృష్ణదేవరాయలను అనేక విధాలా అనుకరించడంలోను, లోకజ్ఞతా పూర్వక రచనతోపాటు ఎడనెడ ఆలంకారిక రచనా నైపుణ్యంలోను, ఔచిత్య పోషణలోను, దృశ్య సాక్షాత్కార వర్ణనా వైదగ్ధ్యంలోను, నిసర్గమనోజ్ఞమైన కవితా పాటవాన్ని వ్యక్తీకరించడంలోను, ధర్మఖండంలోని విషయం గ్రహించినా మౌలికమైన రచన చేయడంలోను, వాల్మీకి చరిత్రలో అనన్య సామాన్యమైన ప్రతిభా వ్యుత్పత్తులను సహజ సుందరంగా ప్రకటించి, అమరుడయ్యాడు రఘునాథరాయలు! అట్టి రఘునాథుని మూర్తిని సుస్పష్టరేఖలలో చిత్రించిన చేమకూర వేంకటకవి మాటలతో ముగించడం ఎంతైనా ఉచితం.

"మాటల నేర్పులా ! సరస మార్గములా !
కొలువుండు రీతులా
పాటల గంథులా ! కళల భాగ్యములా !
బహుదాన లీలలా !
నాటకశాలలా ! యొకట నన్నల దెన్నిట
జూడ నన్నిటన్
మేటియు, గీర్తిలోలుడు జామీ రఘునాథ
నృపాలు డిమ్మహిన్".

(విజయవిలాసము — అవతారిక 28)

(ఆంధ్రప్రభ — 9, 16-7-'72)

# పుష్ప సాహిత్యం

పుష్పం అంతకంటే తెలుగులోని పూవు లేదా విరి ప్రకృతిలోని అమృతపు చుక్క; మానవుడికి చక్కటి ఆనందకందం. అలరులపై అందమైన కవితలల్లిన నవ్య కవులెందరో తెలుగులో ఉన్నారు. పూవును జీవితానికి ప్రతీకగా కవిత చెప్పినవారూ ఉన్నారు. అదొక ఆనందానుభూతి; అదొక అనూహ్యమైన స్వప్న జగత్తు.

పూర్వ కవులు సైతం పుష్పాన్ని గురించి చక్కటి వర్ణనలుచేశారు. కాళిదాసు కుమారసంభవంలో అకాల వసంతవర్ణనలోని పూల వర్ణన అమోఘం.

"వర్ణప్రకర్షేసతికర్ణికారం ధునోతినిర్గన్ధ తయాస్మచేతః।
ప్రాయేణసామగ్ర్య విధౌగుణానాం పరాజ్ముఖీ విశ్వసృజఃప్రవృత్తిః॥

కొండ గోగుపూవు రంగు మనోజ్ఞం కానీ వాసనలేని పూవు అందంగా ఉన్నా ప్రయోజనంలేదు; పైగా మనస్సును ఖేదపరుస్తుంది బ్రహ్మ సృష్టిలో సంపూర్ణత్వం లేకపోవడమే కొదవ. అదే సృష్టిలోని వైపరీత్యం.

తెలుగులో ప్రాచీన కవులు పూబోణి, అలరుబోణి, విరిబోణి అంటూ చక్కగా పుష్పంతో పోల్చారు స్త్రీని. ప్రబంధకవుల ప్రబంధాల్లో ఉద్యానవనాలూ, ఉద్యానవనాల్లోని వివిధ పుష్పాలూ మొదలైన వాటి వర్ణనలు కోకొల్లలు. నాయికా పుష్పావచయం, పుష్పలావికలు మొదలైన వర్ణనలు లేకుండా ప్రబంధాలు లేవు. పారిజాత పుష్పంమీద చక్కటి ప్రబంధమే రాశాడు ముక్కు తిమ్మన. ఆముక్త మాల్యద–ధరించిన పూలమాల నిచ్చినది–గోదాదేవి పేరే ప్రబంధానికి పేరుగా ఉంచి, చక్కటి కవిత చెప్పినాడు సాహితీ సమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు. ఇంకా ఇలా ఎందరో కవులు.

పుష్పమనగానే తెలుగులో వేదుల సత్యనారాయణశాస్త్రిగారు, జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు గుర్తుకు రాకపోరు. వేదులవారు 'కాంక్ష' పండితులకు మాత్రమే

పరిమితం. ఘంటసాల గానంచేసిన "పుష్ప విలాపం" పద్యాలవల్ల జంధ్యాలవారు పండిత పామరులకందరికీ తెలిసినవారు. వీరేకాక మరికొందరు నవ్యకవులు ఈ పూవుల వర్ణన తమ కవితల్లో చేయడంకద్దు. మన 'తెలుగుతల్లికి మల్లెపూదండ' ను కైసేసినవారు శంకరంబాడి సుందరాచారిగారు. "ఆకులో ఆకునై పూవులో పూవునై" పోతానంటారు కృష్ణశాస్త్రిగారు. అలరుపడంతి, విరిచేడె లాంటి సుకుమార భావ వ్యక్తీకరణకు సున్నిత పదాలు వాడగలరు వీరు. 'యెంకిపాటల' నండూరివారు యెంకి "పూలబాసల" గూర్చి చక్కటిపాట రచించారు.

"పూలబాసలు తెలుసు యెంకికీ—తోట
పూల మనసులు తెలుసు యెంకికీ !

పూల మొక్కల నీటి
జాలుగని నిలుసుండి,
పూలన్ని నీ పాటె
ఆలించె నంటాది,

పూలబాసలు తెలుసు యెంకికీ—తోట
పూలమనసులు తెలుసు యెంకికీ!

పూలంటు కాలంటి
పున్నె ముం దంటాది,
వగలమారీ వడుసు
నగదొడిగె నంటాది,

పూలబాసలు తెలుసు యెంకికీ—తోట
పూలమనసులు తెలుసు యెంకికీ !

తెర లెత్తి పూ పడవ
పరిగెత్తు తావుంటె,

దారెంట పూలొంగి
దణ్ణమిడెనంటాది,

పూలబాసలు తెలుసు యెంకికీ – తోట
పూలమనసులు తెలుసు యెంకికీ !

పూలతో వియ్యాలు
పూలల్లో కయ్యాలు !
మానల్లెన న్నుంచి
తానె పూ వౌనేమో !

పూల బాసలు తెలుసు యెంకికీ–తోట
పూల మనసులు తెలుసు యెంకికీ !"

— ఇందులో 'పూల బాసలు, పూల మనసులు' సున్నితమూ, సుకుమారమూ అయిన భావాలకు సంకేతంగా చక్కటి ప్రయోగాలుచేశారు నండూరివారు. 'పూలంటు కాలంటె — పున్నె ముందంటాది' — అమాయకురాలైన యెంకికి నిర్మలమైన ఎదలోని సొదకు తగిన ప్రయోగం. నిరతిశయానందదాయకమైంది. తన్ను గడ్డి పూవుతో పోల్చుకొంటారు మల్లవరపు విశ్వేశ్వరరావు గారు :—

"గడ్డిపువ్వుని ! రేకు రెప్పల
కలలుకంటో కలవరిస్తో
కలతనిద్దురలోనె యెప్పుడొ
కళ్ళుమూస్తాను" అంటారు విశ్వేశ్వరరావుగారు.

ఇలాగే పెనుమర్తి వేంకటరత్నంగారు "అడవిపూవు"ను వర్ణించారు. ఈ రెంటను ప్రతీక కవిత ఉంది. "ఉపహారము" అన్న ఖండికలో పింగళి-కాటూర్లు పూవులులేమిచే తామే కంఠహారమై భగవంతుని గళ మలంకరింపకపోతామా అంటారు.

ఇందాకే పేర్కొన్నట్లు మనస్సులలో నిల్చిన వారిద్దరు కవులు–వేదుల, జంధ్యాలవారలు. వేదులవారు "ముక్తావళి" ఖండికలో భగవంతుని కర్పించడానికి ఒక పూవైనా లేదనీ, 'పూదీవెలు నాదు ఎడద తీరున మోడయిపోయె' ననీ, ఆ విధిని నిర్వర్తించలేక పోయాననీ వేదనాభరిత మనస్కులవుతారు. "పూజా ప్రసూనములు" అన్న ఖండికలో భగవంతునికోసం పూలు కొనిరావడానికి పూలతోటకుపోగా తోట తలుపులు మూశారనీ 'తోట పెన్గడిని'కేల స్పృశించగా 'మాలికగ్రుచ్చనెంచు ప్రేమాలసులీ వనింజొరనవర్హులు,వారలకంద వీ పువుల్'– అన్నకేక వినిపించిందనీ వివరిస్తారు వేదులవారు. ఇది జంధ్యాలవారి" బీదపూజ"ను గుర్తుకుతెస్తూంది. "బీదపూజ"తో బీదవాని దైన్యం చక్కగా ధ్వనిస్తూంది

"వాడిన గ్రుడ్డిపూలు గొనివచ్చెనుబీదని జాలిమాలి నో
నాడకు మోదయామయ! యథార్థము నీకడ విప్పిచెప్పనో
రాడుటలేదు-పూలకొఱకై పువుదోటకు నేనుగూడ జ
న్నాడను-పుష్ప మొక్కటయినన్ లభియింపకపోయె నాకటన్"—

అని వాపోతాడు బీదవాడు. చివరికి రిక్తహస్తాలతో వెళ్ళలేని ఆ బీదవాడు "మంటపము పక్కధూళిలో నిండియున్న గ్రుడ్డిపువ్వులనే యేరుకొంటినేను"అంటాడు. ఇంకా దరిద్ర పుష్పమ్ములివ్వి; అనాథ సుమాలు; విశీర్ణజీర్ణ కుసుమాలు; కృశించు మ్లానహీన దీన ప్రసూనాలు" అంటాడు.

ఏమైనా 'వేదుల' అనగానే వారి 'కాంక్ష' గుర్తుకు రాకమానదు
"ఈ సుమజన్మమెట్లొ ఘటియిల్లెను నాకొకనాటి పాటిదై
వాసనలేను సోయగము వాయని తీయని పోడుముల్ క్షణం
బో, సగమో విచారపడబో, నయనన్ విడివడ్డ నాయెదన్
మోసులువారు నూతన మనోరథ, మామనివేడి పొంగులన్"

అంటుందాపూవు. ఇంకా పేదల రక్తమాంసాలతో గొప్పవాళ్లైన ధనవంతుల పెద్దరికానికిగాని, మతోన్మాదాన్ని పెంచే–దేవుడికిమారుగా నిల్చిన–రాతి బొమ్మలకోసం గానీ వ్యర్థమయ్యే బ్రతుకు తాను సహించలేనంటుంది పూవు.

"నాకు తలంపులేదు లలనాజనతా కబరీభరైక భూ
షాకలనన్, సతీమృదు భుజాంతర తల్పకుచోవ గూహ బి
బ్బోకమునన్, వధూజనకపోల గళచ్ఛ్రివణావతంస హే
వాకమునన్, విలాసినుల పాపటచందురుకావి పూతలన్"

అనీ, కానుకనై ధరాధిపుల కాళ్ళకడబడి పోవడంగాని, ద్వారతోరణాల పేరుతో దుమ్ముకొట్టుకొని ఉరిబడడంగాని, "దోసిటిపేరి" ఘోరకారాగార నరకంలోబడడం గాని తనకిష్టంలేదనీ అంటుంది పూవు. మాతృదేశ సేవాచరణలో ప్రాణాలర్పించిన త్యాగమూర్తుల సమాధి మృత్తికలో వాసనలువీస్తూ రాలిపోవాలని ఆకాంక్షిస్తుందా పూవు.

"నీచపు దాస్యవృత్తి మననేరని శూరత మాతృదేశ సే
వాచరణమ్మునందసువు లర్పణ సేసిన వారి పార్థివ
శ్రీచెలువారుచోట, తదసృగ్రుచులన్ వికసించి వాసన
ల్వీచుచు రాలి పోవగవలెన్ తదుదాత్త సమాధిమృత్తికన్".

దీనికి హిందీలో శ్రీమాఖన్‌లాల్ చతుర్వేదిగారు రచించిన 'ఫూల్‌కీచాహ్' అన్న కవిత మాతృక.

"చాహ్‌నహీఁ మైఁ సురబాలాకే గహనోఁ మేఁ గూంథాజావూఁ।
చాహ్‌నహీఁ ప్రేమీమాలామేఁ బింధ్‌ప్యారీకోలల్ చావూఁ।
చాహ్‌నహీఁ స్రమ్రాటోంకీశవ్‌పర్ హేహరిడాలా జావూఁ
చాహ్‌నహీఁ దేవోంకీ సిర్‌పర్ చఢూఁభ్యాగపర్ ఇఠ్‌లావూఁ
ముఝేతోడ్ లేనావన్‌మాలీ ఉస్‌పథ్‌మేఁ దేనాతుమ్ ఫేంక్,
మాతృభూమి పర్‌శశ్ చఢానే జిస్‌పథ్‌జావేఁ వీర్ అనేక్॥"

కానీ రచనా నైపుణ్యంతో భావ తీవ్రతను సాధించారు వేదులవారు. ఈ భావాన్నే స్వీకరించి 'సార్థకత' 'స్వేచ్ఛాపూలు' అనే రెండు ఖండికలు పాపయ్యశాస్త్రిగారు రచించారు. కానీ వేదులవారి భావ తీవ్రత ఇందు గోచరించదంటే అత్యుక్తికాదు.

ఇంక బాగా ప్రసిద్ధి పొందినది పాపయ్యశాస్త్రిగారి 'పుష్ప విలాపం' కరుణ రస పూరితం.

"నేనొక పూలమొక్కకడ నిల్చి చివాలున కొమ్మవంచి గో
రానెడు నంతలోన విరులన్నియు జాలిగ నోళ్ళు విప్పి 'మా
ప్రాణము తీతువా' యనుచు బావురుమన్నవి-క్రుంగిపోతి-నా
మానసమందెదో తళుకుమన్నది పుష్పవిలాపకావ్యమై"

— అని చక్కగా రచించారు.

"అమ్మ కొందువె మోక్షవిత్తమ్ము కొఱకు
హృదయమే లేని మీ పూజలెందుకోయి ?"

— అని ప్రశ్నించాయట పూలు. "స్వార్థబుద్ధితో త్రుంపబోకుము; తల్లికి బిడ్డకు వేఱుసేతువే !" అనీ,

"ఊలుదారాలతో గొంతు కురిబిగించి
గుండెలో నుండి సూదులు గ్రుచ్చి కూర్చి
ముడుచుకొందురు ముచ్చటముడులమమ్మ
అకట ! దయలేనివారు మీ యాడువారు"

— అనీ,

"మా యౌవనమెల్ల కొల్లగొని అవయి చీపురుతోడ చిమ్మి మ
మ్మావల పారబోతురుగదా నరజాతికి నీతియున్నదా ?"

— అనీ దూషిస్తాయి పూలు. "బుద్ధదేవుడు పుట్టిన భూమిలో జన్మించి అందాన్ని హత్య చేయడంవల్ల నీమనుజ జన్మ మైలపడిపోయిం"దనీ.

"పూజలేకున్న బాబు ! నీ పున్నెమాయె
కోయబోకుము మా పేద కుత్తుకలను;
అకట ! చేసేతమమ్ముల హత్యచేసి
బావుకొనబోవు ఆ మహాభాగ్యమేమి ?"

— అనీ చీవాట్లు పెట్టాయి ఆ పూలు. "పూలు కోయ చేయాడలే'దని కరుణ రసార్ద్రింగా రచించారు పాపయ్యశాస్త్రి గారు

కానీ దీనికి వ్యతిరేకంగా పూల జన్మ మున్నందుకు భగవంతుని పాదాలపై సమర్పించడమే సముచితమంటూ "విరికన్నె వేడికోలు" రచించారు ప్రొఫెసర్ కె. వి. ఆర్. నరసింహంగారు

"కలికి లేనవ్వు వెన్నెలల్ గాయుచున్న
యీ సుమమ్ములఁ ద్రుంపఁ జేయెట్టులాడు;
పాలబుగ్గల ముద్దులు జాలువారు
చిన్ని పాపల గొంతుకల్ చిదుమగలమె ?"

అని దయ వహించారటవీరు. కానీ ఆ పూలు మాత్రం—

"ఒరులకుఁగాని జీవనము లొల్లము; నిత్యము భూతధాత్రికిన్
భరమయితోఁచు దేహములఁబాయుట లెస్స; మనోజ్ఞ వర్ణ సం
భరితవపుర్విలాసమును భాసుర కేసర సౌరభంబు నీ
మరుగునదాచి యేమి మదిమాన్యములన్ గడియింతుమో సఖా"

— అంటాయి ఆ పూలు వారితో. ఇంతేగాదు —

"సర్వజనములు మము శిరసావహించు
గారవము కంటె మాకేమి గావలయును ?
సర్వ లోకేశ్వరుని పద సరసిజముల
వ్రాలు కంటె శుభంబేమి వలయుమాకు"

— అని తమ కాంక్షను వ్యక్తంచేశాయి.

"రేపు వచ్చితేని రేకులు విడివడ
మాయమగుదు మేము మట్టిలోన
క్షణిక జీవితమ్ము గల మాకు నమరత్వ
మబ్బునట్లు చేయుమయ్య నీవు".

— అని తమకు రాబోవు దుస్థితిని చెప్పి ప్రార్థించాయి. ఇంకా హృదయం ద్రవించునట్లు —

"కావున మాయెడ నీ కరుణగల్గిన వాడవయేని దేనియల్
పీవరమత్త భృంగములు పీల్చకమున్న ప్రభంజనోద్ధతిన్
దావులుపోయి రేకులు యథాతథలై పడిపోకమున్న, త
త్పావన దేవతా విమలపాదతలమ్మును జేర్చు మమ్మికన్".

— అని మిక్కిలి ప్రార్థించాయి. చివరికి —

"కలత పడి నిల్చెదేలా ?
తలపుల విపరీత ధర్మతత్త్వము బలియన్
గల కారణ మెఱిగింపుము
కలిమాహాత్మ్యమ్మొ కాక కాపురుషతయో?"

— అని నిందించాయట ఆ పూలు.

ఇలాగా పూపుల అందచందాలను, ఎదలోని సొదలను, హృదయ మర్మాలను యథాతథంగా, సాంకేతికంగా, ప్రతీకగా వివిధ కవులు వర్ణించి తరించారు. వస్తు వొకటే; భావనలు వేరు. భాష ఒకటే; అనుభూతులు వేరు. బంగారం ఒక్కటే; వగలు అనేకం. వాటి జిగి, నగిషీలు వేరు ! శిల్పి శిల్పం వేరు !

"బాలభాను మరీచి సంపాతవేగ
దరవికస్వర కుసుమ సుందర విముగ్ధ
మధుర సుస్మేర వదన సంపదలఁ గాంచి
యవ్యయానందమున నోలలాడినాఁడ". (విరికన్నె వేడికోలు).

(ఆంధ్రప్రభ – 15–12–1977)

# గబ్బిలం కావ్యంలోని ప్రతీక!
# జాషువా కవితకు జయపతాక!

"నాదు కన్నీటి కథ సమన్వయము సేయ

నార్ద్ర హృదయంబుఁగూడఁ గొంతవసరంబు"

అన్నమాటలు గబ్బిలం కావ్యంలోని నాయకుని మాటలు మాత్రమే కావు. ఇవి జాషువా కవిగారివి. అంచేత ఆర్ద్రహృదయంతో ఆలకిస్తే కరుణ రసార్ద్రమై దృగ్గోచరమౌతుంది ఆ నాయకుని కథ. అంటే జాషువాగారి కవిత; గబ్బిలం కావ్యం లోని ప్రతీక కవిత! జాషువాగారి అంతరంగంలోని ఆవేదన అనంతంగా వారి కవితలో ప్రతిబింబిస్తుంది. వారి ఆవేదనకు అక్షర రూపమే గబ్బిలం కావ్యం. వారి నిర్వేదం నిండి నిబిడీకృతమై ప్రతి పద్యంలో ప్రత్యక్షమై మన మనసుల్ని కరుణార్ద్రంచేసి మన జాలికి, మనసానుభూతికి పాత్రమౌతుంది. సద్యః పరనిర్వృతి కలుగుతుంది. ఉత్తమ సాహిత్య పరమ ప్రయోజనం అదేకదా!

నవ్యత : ఛందస్సులో వీరు నవ్యతను కొనిరాకపోయినా, ధారాశుద్ధిగలిగిన పద్యరచనా వైవిధ్యం వారిసొత్తు. ఇందుకు వారి ఏ పద్యం గ్రహించినా ఉదాహరణే అవుతుంది. వచన కవితనుబట్టి నవ్యులు సాధించిన దాన్ని వీరు పద్యంలోనే సాధించారు. ఏ పద్యమైనా వారికి వశవర్తియయి నర్తించినట్లు స్పష్టమౌతుంది.

కాగా వస్తు భావరచనల్లో ఎంతో నవ్యతని సంతరించారు వీరు. పవిత్ర భారత దేశంలో అంటరానితనమనే జాడ్యం తాండవిస్తుండగా అట్టడుగున పడియున్న ఎంతో మంది సామాన్యులు దానికి గురిఅయి, ఎరలయి పోతుండడం గమనించి తన్నివారణార్థం జాషువాగారి ఆత్మవేదనమే గబ్బిలం కావ్యవస్తువు. అంటరానివాడు కథానాయకుడు. ఇది నవ్యాతినవ్యమైన సంగతి. మన ప్రాచీన సాహిత్యమంతటా ఉత్తమకుల సంజాతుడే నాయకుడన్న విషయం సువిదితమే. ఇది సందేశ కావ్యం. మనకున్న ప్రాచీన కావ్యాల్లో సందేశ కావ్యాలు ప్రేమ సంబంధి, కాని ఇక్కడ

కథానాయకుడు తన దుస్థితిని పరమేశ్వరునకు విన్నవించవలసినదిగా తన సందేశాన్ని పంపుతాడు. ఇందులో అతని హృదయావేదన గర్భితమై ప్రకటీకరిస్తుంది. ఈ నాయకుడు 'భరతోర్వరకుంగడగొట్టు బిడ్డను; 'అరుంధతీ సుతుండు', 'గర్భదరిద్రుడె' కాని "'నీతిమంతుడు', 'అప్పువడ్డదిసుమీ భారతావని వీని సేవకున్' అంటారు జాషువాగారు. ఎంతో ఆవేదనతో "వానినుద్ధరించు భగవంతుడేలేడు, మనుజుడెట్లు వాని గనికరించు" ననీ, 'పులుగుం బుట్టులుకాక పేదలకు నా పుల్ జుట్టుపక్కంబులు గలరే'-అని మిక్కిలి వాపోయారు. అలాంటి తన ఆవేదనను శివునకు విన్నవించవలసిందని గబ్బిలాన్ని కోరుకుంటాడు నాయకుడు. యక్షుడు యక్షిణికి పంపిన మేఘసందేశంలో ఉత్తర భారతదేశ వర్ణన కాళిదాసు చేసినట్లే జాషువాగారు దక్షిణ భారతంలోని చారిత్రక ప్రదేశాల్నేగాక ఉత్తరంలో కైలాసంవరకు చాల మనోజ్ఞంగా వర్ణించారు. మొదట అంటరానితనాన్ని గూర్చి ఆరంభమై రెండోభాగంలో స్వాతంత్ర్యసాధనో న్ముఖమైంది కావ్యవస్తువు ఇందులో స్వానుభవమే (personal expeɛience) స్నిగ్ధతా రూపంలో గోచరమౌతుంది.

'చాకిరి జేసితిం తెలుగు జాతికి నేబది వత్సరాలు నా
వాకిలిద్రొక్కి చూడవు శుభంబులు సౌఖ్యము, లెంతకాలమీ
బాకి వయస్సుతో నడుగుబట్టిన యాసలు తెప్పరిల్లునో
లేక నశించునో తెలుపలేడుగదా! మదనాగవైరియున్'

ఇక, భావంలో భావనల్లోసైతం నవ్యత కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది. ఈ నవ్యతని ప్రకటించడంకోసం జాషువాగారు రచనలో నవ్యతని సాధించారు. చక్కటి ఉదాహరణ ఒకటి—

"ఒలికిపోయిన పండు వెన్నెలల పాలు
క్రోలుచున్నది కుపిత చకోరకంబు;
ప్రొద్దుపోయెను నీ చిన్ని భోజనమును
వెదకికొన, బొమ్మ తబిసి గబ్బెతల రాణి"

ఇందులో నవ్యాతినవ్యమైన భావన, దానికి తగ్గ నవ్యరచన, "ఒలికిపోయిన పండు వెన్నెలల పాల"ట !

"నిమ్న జాతుల కన్నీటి నీరదములు
పిడుగులై దేశములఁ గాల్చివేయుననుచు
రాట్నమను ఉడ్డుగట్టి కరాన బూని
వెసల తోఁతెంచె గుజరాతు ముసలిసెట్టి.

సీమగుడ్డకు కన్నులు చెమ్మగిల్లె
ముతక బట్టకు మర్యాద పొటమరించె,
నగరి వెలుపలి మాల మాదిగలు గూడ
నరులు సుమ్మని దేశంబు గుఱుతుపట్టె.

ఈ ప్రశాంత రాత్రి యెల్లలోకంబును
బుజ్జగించి నిద్రఁబుచ్చుకొనియె
నౌషధంబులేని యస్పృశ్యతా జాడ్య
మందభాగ్యనన్ను మఱచిపోయె"

తన ఆవేదనా నివేదనంలో నవ్యత.

"సాత్వికాహారిణీ తపశ్చర్యకతన
నీ మనంబున జాలివెన్నెల రహించు" అనీ,
"సస్య రమ పండి పులకింప సంశయించు"అనీ

నవ్యభావాన్ని వ్యక్తీకరించారు. ఇంకా—

"కులములేని నేను కొడుకులఁ బుట్టించి
యీయఖాతమందె త్రోయవలెనె

భార్యయేలఁ బుట్టబానిసకని వాడు
జరుపసాగె బ్రహ్మచర్య దీక్ష"

అని కుటుంబ సంక్షేమం ఆకాంక్షించిన అభ్యుదయవాదులు వీరు. ఈ నవ్యత ఈనాటిది కాదు ఏనాటిదో!

## నూతన ప్రయోగాలు :

నూతన ప్రయోగాల్నిసైతం తమ కవితలో చేశారు జాషువాగారు. అతి నవ్యమైన ప్రతీకవాదాన్ని తమ కవిత్వంలో జొప్పించారు. కావ్య నామకరణంలోనే ప్రతీకవాద స్ఫోరకత ఉంది. "సీమగుడ్డకు కన్నులు చెమ్మగిల్లె" అనడం నవ్య ప్రయోగం. భావంలో, రచనలో నవ్యత ప్రస్ఫుటంగా గోచరించడమేకాక అందులో ప్రతీకవాదం సుస్పటంగా తెలుస్తూంది. ఇంతకంటే—

"ఈ యభాగ్యుని రక్తంబు నాహరించి
యినుప గజ్జెల తల్లి జీవనము సేయుఁ;
గసరి బుసకొట్టు నాతని గాలిసోఁక
నాల్గుపడగల హైందవ నాగరాజు".

ఇందు — 'నాల్గుపడగల హైందవ నాగరాజు' — నవ్యాతి నవ్యమైన ప్రయోగం. ఈ భావన అనన్య సామాన్యమూ, అనితర సాధ్యమూను. రచనలో నవ్యత కొట్టవస్తూంది. ఇంతకంటే ముఖ్యంగా నాల్గువర్ణాలు గల హైందవ మతాని కిది ప్రతీక. ఇంత ఆవేదనా పూరితమైనా, ప్రతీక వాదాన్ని ప్రస్ఫుటంగా ప్రకటించిన మహాకవి జాషువాగారు. లోకంలో ఏడు శిరసుల నాగేంద్రుడనడమే ప్రసిద్ధం. కాని వీరు మాత్రం ఈ 'హైందవ నాగరాజు'కు 'నాల్గు పడగ'లని చక్కగా నాల్గువర్ణాలన్న సంగతికే ప్రతీకగా ప్రయోగించారు.

## సంఘ సంస్కరణ :

పవిత్ర భారతావనిలో ధర్మం నాలుగు పాదాల నడవ్వలసిన హైందవ సంఘంలో అతిభయంకర రూపంతో అస్పృశ్యతా జాడ్యం తాండవిస్తుండగా చూచిన

కవిగారి హృదయం ద్రవించింది. పద్యరూపంలో గబ్బిల కావ్యరూపంలో సాక్షాత్కరించింది. ఆత్మవేదనా రూపంలో కవిత పెల్లుబికింది. అంటరాని తనాన్ని నిరసించారు. దూరాచారాన్ని, వెడ నమ్మకాల్ని, అస్పృశ్యతని మిక్కిలి ఖండించారీ పద్యంలో —

"ఆరాజ్యంబును గూబ పట్టుకొని బిట్టాడించు చుండున్ దురా
చారంబుల్ వెడనమ్మకాల కది వాసస్థాన మస్పృశ్యతా
క్రూర వ్యాఘ్రము సంచరించుటకు సంకోచంబు లేదైన బౌ
ద్ధా రామంబులు సాగనీయవు గదమ్మా ! దాని యౌద్ధత్యమున్"

అస్పృశ్యతా క్రూర వ్యాఘ్రమన్నారు జాషువా కవిగారు. అయినా బౌద్ధారామాల్లో ఇవి సాగవంటారు. అలాంటి సమతా మమతామయ జగత్తుని కోరారు వీరు. శివునికి కూడా కోపమా !

"నరులన్ ముట్టక నందులం గొలిచి పుణ్యం బెల్ల సాధించు న
ప్పరమం బైన రహస్యమున్ శివునితో ప్రస్తావమ౯ం జేసితే
పరమేశుండివి నిమ్న జాతులకు సంప్రశ్నింపగా రాని వే
ద రహస్యాలని కోపగించుకొని స్వార్థంబుం బ్రదర్శించెనే !"

అని వాపోతున్నారు. వారి ఆవేదన స్పష్టం. ఇంక వీరు దురాచారాలనుగూర్చి మిక్కిలి వాపోతారు.

"మొక్కుబళ్ళ నెపాన చక్కని పసిపాప
లెందరు గంగలో నిమిడిరొక్కొ

సహగమనాచార దహనదేవత లెన్ని
చిగురు గొమ్మల బూదిచేసెనొక్కొ

చదువు దాచెడి దురాచరణ మెందరి కళా
భ్యసన చాతురిఁ గొంతుఁ బిసికెనొక్కొ,

మూఢవిశ్వాసాలపై ధ్వజమెత్తి ఖండించారు వివిధ రీతుల. తొలినాట తెలుగునాట పలనాటిలో అవతరించిన బ్రహ్మనాయుడు ఆరంభించిన '....సంఘ సంస్కరణ దీవ్యద్బీజమీ నాటికిం, ఫలియించెంగద గాంధిచే యతనముల్ వ్యర్థంబుగా వెన్నడున్'—అనీ—

"కలడంబేద్కరు నా సహోదరుఁడు మాకై యష్టకష్టాలకుం
బలమై సీమకువోయి క్రమ్మరిన విద్వాంసుండు ...." అనీ,

బ్రతికి యుండగా తిండికి నోచుకొని వేమన మరణించిన వెనుక "....ఔరా నేడు గోరీవయిన్ నడచుం బూజలు పుణ్య కార్యములు వింతల్ మా దయా ధర్మముల్" అనీ అధిక్షేపించీ; ఆ వేమనను —

"మరణ వార్తకంబను ప్రమాద మెఱుంగని కైతలల్లిన
బ్బురపుఁ గవీంద్రు ...." దనీ

ఉత్తమ సంఘ సంస్కర్తల్ని స్మరించి జాషువాగారు తమ సంఘ సంస్కరణాభిలాషను సువ్యక్తం చేశారు. చక్కటి అధిక్షేపం (Satire) సైతం వీరి కవితలో ఉంది.

"ఎవరికి వారై బ్రతుకుచు
నవీన ధర్మములు పిచ్చి నమ్మకములతో
నవరించి ప్రజల తలలో
ప్రవేశమొనరించు స్వార్థ పరులం గంటె !"
అనీ —

"దిరుసుల్ మార్తురు కొందరాంధ్రులవురా ! దేశాంతరం బేగి వ
త్సరముల్ పుచ్చిఁ ద్రివిష్టప ప్రజలతో సఖ్యంబు గావించి యె
బ్బెరికంబైన విదేశ నాగరకతో విచ్చేయ కచ్చాంధ్ర సుం
దర వేషంబు ప్రతిష్ఠ నిల్పితివి సన్మానార్హ మెంతేనియున్"
అనీ, మతాన్ని —

"హక్కుల్ దొంగలు దోచుకొన్నను మనుష్యత్వంబు జంతుత్వమై
చిక్కుల్ వెట్టెడు కాలమందును క్షమాసిద్ధాంతముల్ నేర్వ నా
వక్కా పౌరుషవహ్ని నార్పు మత రూపక్రూర సింహంబు నా
ప్రక్కం జాడులు నూరుచున్నది తలంపక శల్య సారథ్యమై"

అనీ, దురాచారాల్ని —

"జనులంబీలిచి పిప్పి చేసెడు దురాచారంబులన్ గాలమ
ట్టని విద్యా బలమేల ? విద్యయన మౌఢ్యవ్యాప్తి కింపైన భో
జనమా ? మోసపు వ్రాతకోతలకు రక్షాబంధమా ? యెందుకీ
మనుజత్వంబు నొసంగ లేని చదువుల్ మైరేయపున్మైకముల్"

— అని వీరు మిక్కిలి ఖండించారు. ఇంతేగాక వీరి సంస్కరణ ప్రియత్వం భాషా సాహిత్యాలపై ప్రాకింది. సాహిత్య సంస్కారం కావాలంటూ—

"కవిత చచ్చుదయ్యెఁగథ పేరు గలదైనఁ
గవికిఁ గొంత కీర్తి గలుగవచ్చు,
నెలలు తక్కువైన బలమైన తిండిచే
నుసురు నిల్పికొన్న నిసుగువోలె".

"వ్యాకరణ శాస్త్రకారులు
శకటరేఫంబు విరతిఁ గన్పడదని చీ
కాకు పరతురంతే కానీ
పాకము రస మింపుసొంపుఁ బరికించెదరే"

అనీ, భాషా సాహిత్య సంస్కరణం కావాలంటూ—

"వ్యవహారంబున భ్రష్టమయ్యు రస భావస్ఫూర్తిఁ గల్పించి మా
ర్దవముల్ శబ్దము లెన్నియో కలుగు శబ్దజ్ఞానమాత్రుల్ పురా

"హక్కుల్ దొంగలు దోచుకొన్నను మనుష్యత్వంబు జంతుత్వమై
చిక్కుల్ వెట్టెడు కాలమందును క్షమాసిద్ధాంతముల్ నేర్వ నా
పక్కా పౌరుషవహ్ని నార్పు మత రూపక్రూర సింహంబు నా
ప్రక్కం జాడులు నూరుచున్నది తలంపక శల్య సారథ్యమై"

అనీ, దురాచారాల్ని —

"జనులంబీలిచి పిప్పి చేసెడు దురాచారంబులన్ గాలమ
ట్టని విద్యా బలమేల ? విద్యయన మౌఢ్యవ్యాప్తి కింపైన భో
జనమా ? మోసపు వ్రాతకోతలకు రక్షాబంధమా ? యెందుకీ
మనుజత్వంబు నొసంగ లేని చదువుల్ మైరేయపున్మైకముల్"

— అని వీరు మిక్కిలి ఖండించారు. ఇంతేగాక వీరి సంస్కరణ ప్రియత్వం భాషా సాహిత్యాలపై ప్రాకింది. సాహిత్య సంస్కారం కావాలంటూ—

"కవిత చచ్చుదయ్యెఁగథ పేరు గలదైనఁ
గవికిఁ గొంత కీర్తి గలుగవచ్చు,
నెలలు తక్కువైన బలమైన తిండిచే
నుసురు నిల్పికొన్న నిసుగువోలె".

"వ్యాకరణ శాస్త్రకారులు
క్షకుఁగకారఁబు విరతిఁ గన్పడదని చీ
కాకు పరతురంతే కానీ
పాకము రస మింపుసొంపుఁ బరికించెదరే"

అనీ, భాషా సాహిత్య సంస్కరణం కావాలంటూ—

"వ్యవహారంబున భ్రష్టమయ్యు రస భావస్ఫూర్తిఁ గల్పించి మా
ర్దనముల్ శబ్దము లెన్నియో కలుగు శబ్దజ్ఞానమాత్రుల్ పురా

చేద స్తంబిది కష్టపెట్టితిని పక్షి రోషగాడెన్నడున్
ప్రాదుర్భావము నందరాదు పరసేవా భ్రష్టవంశంబునన్"
—అనీ మానవతకోసం వారి హృదయం అలమటించింది.

## దేశభక్తి:

మొదటి భాగం అస్పృశ్యతతో ఆరంభమై, రెండో భాగం స్వాతంత్ర్య సాధనోన్ముఖమైన దీ కావ్యం. వీరి దేశభక్తిని విజయనగర వర్ణనలో, పు-70,71,72, 73 లలో సువ్యక్తం చేశారు అంతేకాదు—

"విహరింపనే భీతి విడిచి మ స్తమునెత్తి
సకల సామ్రాజ్యహా సభలలోన
వాక్రుచ్చనే రాలువగిలి బుగ్గలు జిమ్మ
నతి నిశాత ప్రబంధాదికములు
కల్పింపనే తెలుగు కళ్యాణి కొప్పున
సొగసైన కిరితి పొగడదండ
ఎత్తింపనే మేటి హిమవద్గిరులమీద
శాశ్వత విజయ రాష్ట్ర ధ్వజంబు
పగర గర్వకుహరి స్వారిగావింపనే
యింటిగుట్టు బయటికెక్క కున్న
నమ్మతించి జాతి కుమ్మక్కుగాకున్న
కొండలన్ని పిండిగొట్ట నొక్కొ!"—ఇది వీరి దేశభక్తికి చక్కటి నిదర్శనం.

'కలరే మోసపు దేశభక్తిపరుల క్కైలాస దేశంబునన్
చలికిం ఖద్దరుధారులై యవల స్వేచ్ఛా రాజ్యభాగంబు రా
గలదంచున్ విహరించు పెద్దలు పతంగ స్వామినీ! నిమ్న జా
తులపై వీరు వెలార్చు బాష్పముల చిందునె తియ్యగాపుల్లగా'
—అని వాపోయారు.

కరుణ రసం :

కావ్యమంతా కమనీయమే అయినా దయనీయమైనది. నాయకుని, తద్వారా పంచములగాంచి జాలివహించవలసిన స్థితిని కరుణరస పరిప్లావితమొనరించిన జాషువా గారి కవిత అనన్య సామాన్యం. రాయబారిగా వెళ్ళివచ్చిన గబ్బిలం బాకీని దేశ స్వాతంత్ర్య సాధనానంతరం తీరుస్తానంటాడు నాయకుడు.

'నీ కావించిన రాయబారమునకున్ నిత్యాభిషేకంబుగా
నా కన్నీటిని కానుకగా నొసగుచున్నానో దయాశాలినీ
చేకొమ్మింతకు మించి నావలన నాశింపంగ లేదిట్టి నీ
బాకీదీర్తు స్వరాజ్య సౌధమున నావాసంబు సిద్ధించినన్'

ఇందులో కరుణరసం పెల్లుబికి దయనీయమైన అతని స్థితికి రోదించని సహృదయ హృదయముంటుందా?

సున్నిత హాస్యం :

ఇంత కరుణ రసార్ద్రమైన ఈ కావ్యంలో సున్నితమైన హాస్యం తళుక్కున వర్షిస్తూనే మెరిసిపోతూ సహృదయ హృదయాల్లో బాధలోనే చిరునవ్వు చిందింప జేసిన మహాకవులు జాషువాగారు. మానవులకులేని గౌరవంగల గబ్బిలమే నయమని మెచ్చుకొంటూనే —

'.... స్వాగతము నీకు శుభంబ కదమ్మ నీతనూ
భవులకుఁ దల్లక్రిందుల తపంబులకున్ గుడిగోపురాలకున్!'

అని ప్రశ్నిస్తూ దాని స్వాభావికమైన తలక్రిందుల తపస్సు స్పృశించి వ్యధిత హృదయాన్నిసైతం హసింప జేయగల సున్నితమైన హాస్యపోషణగల చతురాననులు జాషువాగారు. ఇలాగే తలక్రిందుల తపోనిరతులైన వాలఖిల్య మహర్షులగూర్చి చెప్పిన పట్టులోను చక్కటి హాస్యాన్నందించారు.

'చుట్టాలే గద వాలఖిల్యులిన తేజుల్ యోగ విద్యానిధుల్
పుట్టుందావసు లార్ద్రచిత్తులు మహాత్ముల్ వైనతేయ స్తుతిన్
జెట్టుంగొమ్మఁ బరిత్యజించిన పరశ్రేయ శ్శుభాకాంక్షులో
పిట్టా! నీకు నమస్కరించెదను నా విజ్ఞప్తి నాలింపవే!'

'జిల్లుతెల్లు శోభ' అని చెప్పి, ఓఢ్రుల నైజగుణాన్ని—

'నీవు బొబ్బిలిమీదుగా నిర్గమించి
మన్యము తరించి కొన్ని యామడలు నడువ
పలుచఁబడిపోవు మన జిల్లుతెల్లు శోభ
తావు లెగఁజిమ్ము నోఢ్ర వాతావరణము'

అని ఎత్తి చెప్పడంలో ఈ హాస్యస్ఫోరకత గోచరిస్తుంది. అరవల కార్య సాధన, ధనార్జన, దీక్ష, వారి సాంబారును పేర్కొంటూ మిక్కిలి సున్నితమైన-వారి హాస్యధోరణికి మకుటాయమానమైన – హాస్యాన్నందించారు.

'ద్రవిడుల కార్యసాధన ధనార్జన-దీక్ష
సాంబారు నోరెత్తి చాటుచుండ'

అని ప్రయోగించడంలో ఉంది నిశితమైన మిక్కిలి సున్నితమైన హాస్యం. భావనలో, భావ వ్యక్తీకరణలో, పదప్రయోగంలో వీరు దక్షులు

అలంకారిక శైలి :

అలంకారికశైలి సైతం అలవోకగా, సహజంగా వీరి కవితలో జాలువారడం మరో విశేషం. అది అప్రయత్నంగా కవితలో చోటు చేసుకోవడం ఇందులోని మరో విశేషం. అలంకారాలకి అలంకార ప్రాయమైన ఉపమాలంకార ప్రయోగాల్ని చూస్తే పై విషయం స్పష్టమౌతుంది.

"కవిత చచ్చుదయ్యె .... నిల్చుకొన్న నిసుగువోలె" ఈ ఔపమ్యం సహజ సుందరమూ, నిసర్గమనోజ్ఞమూను. ఇలాగే —

"భూనభములఁ గ్రొంజీకటు
లేనుగునకు మదమువోలి యెసఁక మెసఁగె."

"ముక్కు మొగమున్న చీకటి ముద్దవోలె
విహరణము సేయసాగె గబ్బిలమొకండు"

— అని చెప్పడంలో ఉపమాలంకార ప్రయోగదక్షత స్పష్టం.

రూపకం —

"ఎంతో దూరము పోవనేమిటికి నేడింటింటికిం బ్రాకి యా
శాంత వ్యాప్తముగా రహించెను స్వరాజ్య స్వర్ణ సూత్రంబు చౌ
దంతి స్తంభన మాచరించెగద యేతద్దివ్య సూత్రంబు మో
కంతై నిక్కన కట్టివేయఁ గలదా యస్పృశ్యతా వ్యాఘ్రమున్!"

ఇందులో "స్వరాజ్య స్వర్ణ సూత్రంబు", 'అస్పృశ్యతా వ్యాఘ్రము'—అని చక్కగా రూపకాలంకారం ప్రయుక్తమైంది. ఇలాగే అర్థాంతర న్యాసాలంకార ప్రయోగం వీరి కవితలో ఉంది

"గిరుల మగవాని చెలిమి వ్యక్తీకరింప
మస్తమునఁ దాల్పు మొక చిన్ని మంచు తునక
విసపు మేతరి కది సిఫారసుగ నుండు;
వ్యర్థములు గావు పెద్దల పరిచయములు"

అనీ —

"గబ్బిలమవయ్యు శివుని లోకంబునందు
వలయు కదలికఁ గలిగించి వచ్చినావు;
నిశ్చలంబైన కాసార నీరమునను
నలతి శిల చాలదే వలయములు దీర్ప"

అనీ —

ఎంతో సహృదయ హృదయ రంజకంగా అర్థాంతరన్యాసాలంకారం ప్రయోగించడం జాషువాగారి లోకజ్ఞతకు నిదర్శనం.

ఇలాగ మానవతా వాద ప్రతీకమైన గబ్బిల కావ్యం రచించిన మహాకవీ, మహామనీషి జాషువాగారు వారి ఆత్మవేదనంతోనే ఈవ్యాసం ముగించడం సముచితమని భావిస్తాను.

"పుట్టించెన్ దయలేని లోకమున నేషణ్మాత్ముడో, కుక్షిలో
పుట్టించెం బొగలేని యాకటి సొదన్ ముప్పూట లీచిక్కులో
నట్టైతపియించు నాకొదవు నాహారంబు భక్షింపఁగా
పుట్టంజొచ్చిరి దేవతల్ బహుళ రూపుల్ బుట్టలై చెట్టులై."

మరి వారి ఆవేదనకు అంత మెప్పుడో ?

(జాషువా జయంతి సమితి, నరసాపురం ప్రత్యేక సంచిక అక్టోబరు 1978)

# 'పిరదౌసి' కావ్యశిల్పం

"అమలోదాత్త మనీష నేనుభయ కావ్య ప్రౌఢి పాటించు శి
ల్పమునంబారగుడన్ కళా విదుఁడ ... " (నిర్వ. 1-31)

—అని తిక్కన వక్కాణ. ఇలాంటి కావ్యశిల్ప పారగత్వం, కళావైదుష్యం జాషువాగారిలోను మనం చూడవచ్చు.

'శిల్పం' అనే వ్యస్తపదం చతుష్షష్టి కళల్లో – ముఖ్యంగా లలితకళల్లో — ఒకటి అన్న సంగతి సర్వజన విదితమే. కావ్యశిల్పం అన్నప్పుడు కావ్యం కూర్పులోని సర్వాంశాలకు సంబంధించిన ఒకానొక నైపుణ్యం. అంటే కవి గ్రహించిన వస్తువులో, చేసిన పాత్ర చిత్రణలో, పరిపోషించిన రసభావాల్లో, రచనా వైవిధ్యంలో, భాషలో, పద ప్రయోగంలో ఈ శిల్పం ఉంటుంది అలాంటి శిల్పవైభవాన్ని జాషువాగారు ఎలా ప్రదర్శించారో పరిశీలిద్దాం.

"వాని డెందంబు సోఁకి పోవని తలఁపులు
వాని కను సన్నఁదలఁబు వంపని యుపమలు
వాని కలమునఁ గులుకుఁ జూపని పదములు
మంతునకు లేవు నాఁటి వాఙ్మయమునందు". (పుట-12)

—ఇది పిరదౌసి కవితను గూర్చిన ప్రస్తావన. అయినా వాస్తవానికి జాషువా కవితలో విలసిల్లుతూన్న లక్షణాలే అనడం అత్యుక్తికాదు. ఇలాగే—

"పదముల పొందిక గుట్టుపఁ
గదపున కెన వచ్చు పద్యగమనము రస సం
పదయును స్వభావ శబలత
కదలించె సభాంతరాళ కవుల మనంబుల్. (పు-16)

— అని చెప్పబడిన కవిత్వ కామనీయకం పిరదౌసిదే. అయినా, ఆనాటి సభాంతరాళ కవుల మనసుల్ని పిరదౌసి కదలిస్తే, ఈనాటి జాషువా కవిత సర్వజనతా మనస్సుల్ని ఉఱ్ఱూత లూగిస్తుంది. జాషువా కవితలోని పదాల పొందిక, గుబ్బపు నడకతో సమానమైన పద్య గమనం, రసపుష్టి, పాత్రల స్వభావ చిత్రణ అనే అంశాలు రసహృదయ రంజకం చేస్తాయి. ఆనందాబ్ధిలోముంచి తేలుస్తాయి ఇవిగాక ఇంకా అనేక కావ్యలక్షణాలు జాషువా కవితలో ఆత్మవేదనా భరితమై శిల్పమయమై వెలారుతున్నాయి.

ఇందలి కథ ప్రసిద్ధ పారశీక కవి 'పిరదౌసి'కి సంబంధించింది. గజనీమహమ్మదు పిరదౌసిని రావించి 'షానామా' గ్రంథం రచిస్తే పద్యానికొక దీనారం ఇస్తానంటే అంగీకరించి ముప్పై ఏండ్లలో అరవై వేల పద్యాలు రచించి రాజు కర్పించాడు కవి. రాజు మాట ప్రకారం బంగారు నాణాలకు బదులు వెండి నాణాలను పంపగా కవి తిరస్కరిస్తాడు. క్రుద్ధుడైన రాజు కవిని సంహరించుమని ఆజ్ఞాపిస్తాడు. ఈ విషయ మెరిగిన కవి సతీసుత సమేతుడై గజనీ పట్టణం వదలి స్వగ్రామం 'తూసు' పట్టణానికి వెళ్ళిపోతాడు. మనసు మారిన గజనీ మహమ్మదు మళ్ళీ బంగారు నాణాలు పంపుతాడు. కానీ తూసు పట్టణం ధనం చేరుతుండగా మృత్యువాతపడిన పిరదౌసి దేహం స్మశానవాటికకు కొని పోబడింది. రాజభటులు పిరదౌసి పుత్రికను ధనం గ్రహించుమని కోరగా ఆమె వారిని నిందించి తిరస్కరిస్తుంది. ఈ వార్త విని ఖిన్నుడైన మహమ్మదు ఆ డబ్బుతో తూసు పట్టణంలో సత్రశాల నిర్మింపజేశాడు ఈకథా వస్తువును స్వీకరించి జాషువాగారు నిసర్గమనోజ్ఞమైన తమ కవితా వైభవాన్ని వెలారించి కీర్తిగడించారు. వస్తువు ఇదే అయినప్పటికీ వస్తు నిర్వహణలో శిల్పాన్ని పాటించినవారు జాషువాగారు. కావ్యార్థ సూచనని పిరదౌసికి వచ్చిన కలలో నిబంధించారు జాషువాగారు —

"తనువెల్లన్ బులకింపఁ జిత్తమున నుత్సాహంబు రెట్టింప, నం
గన కెంగేలు గ్రహించి, ప్రేమరస దిగ్ధంబైన వాల్చూపునన్
గని, యాశ్లేష మొనర్చెనన్ గఱకు బాణం బొండు డెందాన గ్రు
చ్చిన యట్లయ్యె, నతండు త్రుళ్ళిపడి లేచెంగంపితాంగంబునన్" (పు-13)

— వ్యంగ్యంగా ఉన్న ఈ కావ్యార్థ సూచనని —

"మున్నొకనాడు నాకనుల ముందొక సుందరి గానవచ్చి, య
త్యున్నత పర్వతాగ్రమున నుండి గుభాలునఁ గూలఁద్రోసి పో
యెన్నను, నాఁటి దృశ్య మిపుడీ సులతానుని గాథలోన ను
త్పన్నముఁజేసి చూపితివి దైవమ ! నేటికి కన్నువిప్పితిన్." (పు-24)

—అని తర్వాత వాచ్యం చేశారు ఇంతకంటే రెండే పద్యాల్లో కథా విషయాన్నంతటినీ —

"రాజుతలమీద కవి కప్పురంబు చల్లె
సుకవితలమీద రాజు నిప్పుకలు విసిరె" (పు-19)

— అని స్పష్టం చేశారు.

వెండి నాణాన్ని తిరస్కరించిన పిరదౌసి బాధాక్రాంత మనస్కుడై మసీదు గోడపై లిఖించిన పద్యాలు –

"కృతి యొక బెబ్బులిఁబలె శరీర పటుత్వము నాహరింప, శే
షితమగు నస్థిపంజరము జీవలవంబున నూగులాడఁగా
బ్రతికియుఁ జచ్చియున్న ముదివగ్గు మహమ్మదు గారి బిడ్డ దే
వతకు రుచించునా ? పరిభవ వ్యథ యింతట నంతరించునా ?"

"ముత్యముల కిక్కయైన సముద్రమునను
బెక్కుమారులు మున్కలు వేసినాఁడ
భాగ్యహీనుడ ముత్యమ్ము వడయనయితి
వనధి నన్మ్రింగ నోరు విచ్చినది తుదకు" (పు–19,20)

— మసీదు గోడపై నున్న ఈ పద్యాల్ని చదివిన మహమ్మదు మనస్సు మారిపోతుంది. ఇది కావ్యవస్తువులోని శిల్పం. ఇంత మనోజ్ఞంగా కావ్య శిల్పం నిర్వహించడానికి ఇందులో కవి ఆత్మీయతా ముద్ర ఉండడమే కారణం. పిరదౌసి

జాషువాగారి ఆత్మ ప్రతీక. శ్రీకాళహస్తి మాహాత్మ్యంలోని నత్కీరుని చరిత్రలో ధూర్జటి వ్యక్తిత్వం ప్రస్ఫుటమైన రీతిగా ఇందులో జాషువాగారి ఆత్మీయత ప్రతిబింబిస్తూంది. ఎవరినీ లెక్కచేయని ధీరగంభీర స్వాంత యశస్కులు ధూర్జటీ జాషువాలు. అలాగే వారి పాత్రలు నత్కీర పిరదౌసులు ఇది మనకు అవగత మవుతున్న కావ్యశిల్పం.

సూక్ష్మ పరిశీలన వల్ల ఈ కావ్యంలోని ఆయా పాత్రల చిత్రణలో సైతం శిల్పం విశదమవుతుంది. ఆయా పాత్రల చిత్తవృత్తుల్ని చాలా చక్కగా చిత్రించారు వీరు. బంగారుకు బదులు వెండి నాణాలు గజనీ పంపగా తిరస్కరించిన పిరదౌసి మానసిక స్థితి —

"ఎన్నో కొండలు గుండెలోఁ గరగి పోయెన్ వార్ధి సంతానముల్
గన్నీరయ్యెఁ, సమస్తలోకము నిరాకారస్థితిం బొల్చె, ను
త్పన్నంబయ్యె విషాదమేఘ పటల ధ్వాంతౌఘ, మాశాలతల్
సున్నాలయ్యె నగాధకూప జలరాశుల్ దోఁచెఁ బిర్దౌసికిన్" (పు–17)

—అని వర్ణించిన జాషువాగారి భాష సముచితమై ఒప్పుతూంది. ఇది పిరదౌసి మానసిక స్థితికి తగిన రీతిగా చిత్రితం. ఇలాగే —

"ఒక్కొక పద్దియంబునకు నొక్కొక నెత్తురు బొట్టు మేనిలోఁ
దక్కువగా రచించితి, వృథాశ్రమయయ్యెఁ, గులీనుడైన రా
జిక్కరణిన్ మృషల్పలుకునే ? కవితా ఋణ మీయకుండునే
నిక్క మెఱుంగ నైతి గజనీసులతాను మహమ్మ దగ్రణీ!" (పు–17,18)

— మొదలైన పద్యాల్లో పిరదౌసి మానసిక స్థితి స్పష్టమౌతుంది. ఇంకా పిరదౌసి మానసిక పరిస్థితిని ద్వితీయాశ్వాసంలో మరీ చక్కగా పోషించడం జరిగింది

వ్యక్తి వర్ణన మన ప్రబంధాల్లో ప్రాధాన్యం వహించి ఉండడం మనకు తెలిసిందే. ఇక్కడ జాషువాగారు వ్యక్తి బాహిర స్వరూప వర్ణనకంటే స్వభావవర్ణనకే ప్రాధాన్య మివ్వడం గమనించ దగ్గ అంశం. నిషాదుని వర్ణన –

"వాని మృదూక్తి వైఖరియు, వాని వినమ్ర విధేయ భావమున్,
వాని పరోపకార నిరవద్య గుణ ప్రతిభా విశేషమున్,
వాని శరీర సౌష్ఠవము, వాని భుజార్గళ మాంసలత్వ. మిం
పైన కృతజ్ఞతార్ద్ర కృతులై వెడలెన్ పిరదౌసి వాక్కునన్" (పు-31)

— ఇంతేగాక Contrast అంటే ప్రతియోగంవల్ల రెండు పాత్రల స్వభావాల్ని అభివ్యక్తం గావించడం సహృదయ హృదయ రంజకమై ఉంటుందన డంలో అత్యుక్తి లేదు నిషాదుని అవ్యాజానురాగాన్ని, గజనీ దౌష్ట్యాన్ని చిత్రిం చారు జాషువాగారు ఈ కింది పద్యంలో–

"నాడు తనూ పటుత్వమును, నా కవితా తపనీయరాశి భూ
మీదయితుం డొకండు బలిమింగొని నన్ను వధింపఁ జూచె; నీ
నాదు చరిత్ర విన్నఁ గరుణన్ చెమరించు శిలా సహస్రముల్,
నీదు మనంబు లేత నవనీతము ముందె కరంగెఁ జూపులన్" (పు-31)

— ఇలాగే గజనీ, పిరదౌసి పాత్రల మనః ప్రవృత్తుల్ని ప్రతియోగం (Contrast) వల్ల చాలా చక్కగా వీరు చిత్రించారు.

"షానామా యను గ్రంథరాజమున కీర్మ్యభర్తతా భర్తయై
పూనెన్ శాశ్వతమైన కీర్తిమకుటంబున్ మౌళి, నేతత్కృతి
గ్లానిన్ గుందు మహా కవి న్మదుసలిన్ ఖండింప నుంకించి స
మ్మానించెం భళి దొడ్డవాడనుచు సంభాషించె దిగ్దేశముల్" (పు-34)

"…. …. ఒక్క కవి మీ చేగోరు ద్రవ్యంబు మీ
హుంకారోర్చుకు సాటిరాదుగద ! రాజోత్తంస యోచింపుమా"

"కవి శాశ్వత దుర్వర నా
రవితారముగా వసించు రాజా ! మీరో
కవితా కన్యకు పతులా
రవితారముగా సహింతు రాయపకీర్తుల్"

"…. మహమ్మదుగారికి నపయశంబు,
నిండు సత్కీర్తి కవికిని నిలిచిపోయె " (పు–39)

— ముందు దుష్టుడైనా మహమ్మదు కాలక్రమేణా ఒకానొకరోజు మసీదులో ప్రార్థనలు ముగించి మసీదు గోడ మీదనున్న పిరదౌసి పద్యాలు – 'కృతియొక బెబ్బులింబలె ….', 'ముత్యముల కిక్కయైన ….' — అని చదివి పశ్చాత్తప్తుడైనాడు. పశ్చాత్తప్తుడైన అతని మానసిక స్థితిని జాషువాగారు ఎంతో చక్కగా చిక్కగా చిత్రించారు —

"ధనము మరల్చుకొంచు సులతాను భటుల్ గజనీకిఁబోయి య
య్యనఘుని దుఃఖవార్తను మహమ్మదుగారికి విన్నవించినన్
దన యవివేకమున్ తన కృతఘ్నతయున్, గవి కీర్తిశేషుఁడై
చనుటయు, వజ్రఘాతముల చందమునన్ గలచెన్ హృదబ్జమున్"
(పు–38)

"కొలువు చాలించి: కన్నీరుఁగుక్కుకొనుచు
విరవిరంబోయి శయన మందిరముఁ జొచ్చి
ద్వారములు మూసికొని, కవీశ్వరుని దలఁచు
కొనుచు, దనుఁదాన నిందించు కొనఁ దొడంగె" (పు–38, 39)

— తండ్రికి తగ్గకూతురు పిరదౌసి పుత్రి. తండ్రి మరణానంతరం ఆ ధనం గ్రహించుమని భటులు కోరగా తిరస్కరించింది కుమార్తె. ఈ విషయాన్నే ఆవిడ పాత్ర చిత్రణలో స్పష్టం చేశారు కవిగారు —

"ఇది నా తండ్రిని కష్టపెట్టిన శరం బీస్వాపతేయంబు ము
ట్టుదునా, నా జనకుండు కంట తడిఁ బెట్టున్ స్వర్గమందుండి, నా
ముది తండ్రిన్ దయతోడ నేలిన నవాంబుండైన మీస్వామికిన్
బదివేలంజలు లంచు బల్కుఁడని బాష్పస్విన్న దుఃఖాస్యయై" (పు–38)

—నదట. అది ఆవిడ వ్యక్తిత్వం. ఇలాగ పాత్ర చిత్రణ చణత్వంలోను చిక్కని శిల్పం పాటించి కవి ప్రతిభను ప్రకటించడం మనం గమనించవచ్చు.

అర్థ కాఠిన్యమూ దూరాన్వయమూలేని చక్కటి పదప్రయోగంతో సముచిత భావ వ్యక్తీకరణ కవి చేయగలిగితే కావ్యానికి సొగసు చేకూరుతుంది. చక్కటి భావ వ్యక్తీకరణతో జాషువాగారు పిరదౌసి కావ్యాన్ని శోభావహం చేశారు. రస భావాల్ని వ్యంజించడంలో అందెవేసిన చేయి జాషువాగారు. కావ్య మందంతట ఈ అంశం స్పష్టంగా గోచరిస్తుంది. మచ్చుకు చక్కటి ఉదాహరణ —

"తన కళ్యాణియు, గూఁతురున్ జటుల కాంతారంబులం బాద చా
రిణులై వచ్చుటఁ జూడఁజాలక కవిశ్రేష్ఠుండు వర్షించు వె
చ్చని కన్నీటికిఁ గారణంబగు మహీశమ్మన్యునిం బండ్లు నూ
ఱిన యట్లంబర వీధియందురిమి యార్చెం గర్భిణీ మేఘముల్"

(పు–21)

— ఇందులోని వర్షించు వెచ్చని కన్నీరు, పండ్లునూరినట్లురిమి "యార్చెం గర్భిణీ మేఘముల్" అన్నవి చక్కటి భావ వ్యక్తీకరణకు నిదర్శనాలు. ఈ చక్కటి భావ వ్యక్తీకరణకు నిదర్శనం మరొకటి —

సీ॥ "సంజ కెంజాయలో జలకంబు సవరించి
పఱతెంచు సూర్య బింబమ్ములోన,
పదునాఱు దినముల పరువువచ్చిన నాఁటి
చంద్రుని ధవళ హాసములలోన,

పూలతోటలతోడ ముద్దు ముచ్చట చెప్పి
చెలలాడు మొలక తెమ్మెరలలోన,

నీలమేఘంబుల నెఱియలలోఁ గుల్కి
పరువెత్తు మెఱపు గర్వములలోన,

హాయిగా, బవ్వళించి బ్రహ్మాండములను
బల్కరించుచున్న దివ్యస్వరూప !
హృదయము ను జీల్చి పూజ లర్పించుకొందు
నందుకొని పొమ్మ, వ్యవధిలేదనక రమ్మ." (పు-23)

— ప్రొద్దుగ్రుంకి రాత్రి కావడాన్ని జాషువాగారు మనోజ్ఞంగా వర్ణిస్తూ —

"ప్రొద్దుగ్రుంకెఁ బెద్ద పులియేటి కేతెంచె,
పంది కోఱకత్తి పదును పెట్టె
ఆకసంబు భూమి యఖిల పదార్థంబు
లంధకార జలధి యందణంగె" (పు-27)

— పందికోర కత్తి పదునుపెట్టె – అనడం ఈ చక్కటి భావ వ్యక్తీకరణలోని కవి ప్రతిభకు నిదర్శనం. సతీసుతా సమేతుడై అరణ్యంలో వెళ్ళుతూన్న పిరదౌసి స్థితి చాలా దయనీయంగా వర్ణించారు. అందులో చక్కటి భావాలు ఇమిడి ఉండడం విశేషం.

"కొసరి నివ్వరి ధాన్యంబు, గొఱికి నమలు
నెలుక ముని పంటి సవ్వడి కులికి పడుచు,
త్రోవఁ గమియించు నాటి పాంథులనదేమొ
అదరి బెదిరించె నొక యెండు టాకుగూడ." (పు-28)

— ఇది కరుణ రసాత్మకమై సహృదయ హృదయ రంజకమై ఒప్పుతూంది.

రచనలో శిల్పాన్ని పాటించి కవి కావ్యానికి వాసి వన్నెలు కొనిరావచ్చు. అలాంటి రచనా శిల్పం జాషువాగారు ఈ కావ్యంలో పాటించి ఉండడం స్పష్టమవుతుంది. ఈ రచనా శిల్పం పలు విధాలుగా ఉండవచ్చు. పద్య రచనలో, వర్ణనల్లో, ఆలంకారిక శైలిలో, రసపోషణలో, పలుకుబళ్ళలో ఈ శిల్పం గోచరిస్తుంది. ఆధునిక కవులలో ఎవరికీ అలవడని పద్యరచన జాషువాగారిలో అత్యున్నత స్థాయినందుకొన్నదనడం అత్యుక్తికాదు. చెప్పదలచుకొన్న భావాన్ని చక్కగా సూటిగా పద్య రచనలో చెప్పగల నైపుణ్యం వీరిది ఇందుకు వీరి కావ్యాలన్నీ నిదర్శనాలే. అది వృత్తంగానీ, కందంగానీ, తేటగీతిగానీ, ఆటవెలదిగానీ చక్కగా కమ్మచ్చులోంచి తీసిన విధంగా పద్య రచన కొనసాగుతుంది. సీసపద్య రచనలో సైతం అందెవేసిన చేయి వీరు-

"గడియించితిరిగదా, కనకరత్న చయంబు
ధననాయకునకు దంతములు పులియ,

వణకించితిరి గదా, పదియు నెన్మిదిమారు
లఖిల భారత హరి దష్టకంబు,

అగలించితిరిగదా, హైందవ దేవతా
గర్భముల్ రత్న రక్తములు చింద,

సృష్టించితిరిగదా ఇస్లాము మతమును
బావనయ్యల గృహాభ్యంతరముల,

ఇట్టి మీపేరు మృతిలేని కృతులలోనఁ
బొదివి పూజించి యిచ్చిన పుణ్యమూర్తి
నమల తపనీయ రాశి నోలార్పవలెనొ,
తెగడి నైరాశ్యమునముంచి తేల్పవలెనొ?" (పు-34,35)

వ్యక్తి వర్ణనగాని సూర్యోదయాస్తసమయాది వర్ణనల్నిగాని చాలా చతురంగా కథకు అతికినట్లు చేయడం జాషువాగారి నేర్పు. ఫిరదౌసి కావ్యమందంతటా యీ విషయం స్పష్టమవుతుంది. ఒక ఉదాహరణ -

"ఈ తొలికోడి కంఠమున నే యినబింబము నిద్రపోయెనో
రాతిరి, తూర్పుకొండ లభిరామములైనవి, దీని వక్రపుం
గూఁతల మర్మమేమి? కనుగొమ్మని యల్లన హెచ్చరించి ప్రా
భాతసమీర పోతములు పైకొనియెం దొలిసంజ కానుపుల్" (పు–29)

మహాకవి తిక్కనలోని రసౌచిత్యబంధాన్ని సైతం తనదిగా చేసుకొన్న ఘనత జాషువాగారిది.

"దెసలు బీటలువార వసపట్టి పోరాడు
కొదమ సింగములకు బెదరిపడుచు
క్రాటి తోపుల కల్లఁ ద్రావు భల్లూకముల
గుటగుట ధ్వనులకు గుదులుకొనుచు,
నూహింపరాని యే వోమ్రుక్కడి మృగాల
వెఱ్ఱికూతలకు తబ్బిబ్బుపడుచు,
కొఱవి దయ్యముల టక్కరి దివ్వియలఁ జూచి
యూరు దగ్గఱెనంచు నూఱడిలుచు,

గొసరి నివ్వరి ధాన్యంబుఁ గొఱికి నమలు
నెలుక మునిపంటి సవ్వడి కులికిపడుచు
త్రోవగమియించు నాఁటి పాంథులనదేమొ
అదరి బెదరించె నొక యెండుటాకు గూడ" (పు-27,28)

—కరుణ రసపోషణ కిది చక్కటి నిదర్శనం ఇలాగే పిరదౌసి లేఖలోనూ కరుణ రసోద్దీపకాలై ఉన్నాయి పద్యాలు వీర రసోచితంగా—

"కనులం గెంపునటింప మైమరపు హుంకారాన్ద్రావు సుల్తాను, లే
ఖను వాల్చూపులతోఁ బఠించుకొని యాకంఠంబుగాఁ గ్రోధ మె
క్కిన క్రేటుంగాను కోడె పెద్దపులి మాడ్కిన్ లేచి సేనాపతిన్
గని పిర్దౌసినిఁబట్టి చంపుడని యాజ్ఞాపించె నుద్దండతన్" (పు–18)
— అని రచించారు.

జాషువాగారిది చక్కటి ఆలంకారిక శైలి. ఈ అలంకారాలు కావ్యశోభను మరింత జేస్తున్నాయి. ఉపమ—

"పొడుపు గుబ్బల తొలుదొ్ల బూదివంటి
ధవళ వర్ణంబు దాల్చి యంతటఁ బసింది
నిగ్గుమెదిపిన చెంగల్వ మొగ్గఁదొడిగె
వేగుజామున నూసరవెల్లివోలె" (పు-28)

"క్రొత్తగ బుట్టు పుట్ట గొడుగుల్వలె పెద్ద యెడారి పొంత ని
ట్టుత్తర దిక్కుగా వెలయుచున్నవి కొన్ని గుడారముల్ దొరా!" (పు-28)

రూపకం—

"అనడికిరేయి భీకర కాననమునఁ
బయన మొనరించు కవి కుటుంబంబు నరపి
తారకా దివ్యనేత్ర పద్మములు విచ్చి
కాచి రక్షించుచుండె జగద్గురుండు." (పు-22)

ఉత్ప్రేక్ష —

"కొంచెము సాగినన్ వెలువు కొమ్మన మీ కుడి చేతివాలుగా
మంచి విశాలమైన యొక మార్గము దాపున గానుపించు మా
చెంచుల గూడెముల్ పుడమి చేడియ చన్నుల క్రేవదాల్చు రో
మాంచమొకో యనందనరు నందలికొండల కీవలావలన్" (పు 29)

స్వభావోక్తి అలంకారాన్ని—

"ఈ నరసియున్న తలయును
హీనతఁగనియున్న నేత్రదృష్టియు, వృద్ధం
బైన శరీరం బలువడి
పైనఁబడిన వయసు నాకుఁ బ్రాప్తంబయ్యెన్" (పు 31)

—అనీ చక్కగా పోషించారు.

జాషువాగారిది చక్కటి ఆలంకారిక శైలి. ఈ అలంకారాలు కావ్యశోభను మరింత జేస్తున్నాయి. ఉపమ—

"పొడుపు గుబ్బల తొలుదొల్త బూదివంటి
ధవళ వర్ణంబు దాల్చి యంతటఁ బసింది
నిగ్గుమెదిపిన చెంగల్వ మొగ్గఁదొడిగె
వేగుజామున నూసరవెల్లి వోలె" (పు-28)

"క్రొత్తగ బుట్టు పుట్ట గొడుగుల్వలె పెద్ద యెడారి పొంత ని
ట్టుత్తర దిక్కుగా వెలయుచున్నవి కొన్ని గుడారముల్ దొరా!" (పు-28)

రూపకం—

"అనడికిరేయి భీకర కాననమునఁ
బయన మొనరించు కవి కుటుంబంబు నరసి
తారకా దివ్యనేత్ర పద్మములు విచ్చి
కాచి రక్షించుచుండె జగద్గురుండు." (పు-22)

ఉత్ప్రేక్ష —

"కొంచెము సాగినన్ వెలుపు కొమ్మున మీ కుడి చేతివాలుగా
మంచి విశాలమైన యొక మార్గము దాపున గానుపించు మా
చెంచుల గూడెముల్ పుడమి చేడియ చన్నుల క్రేవదాల్చు రో
మాంచమొకో యనందనరు నందలికొండల కీవలావలన్" (పు 29)

స్వభావోక్తి అలంకారాన్ని—

"ఈ నరసియున్న తలయును
హీనతఁగనియున్న నేత్రదృష్టియు, వృద్ధం
బైన శరీరం బఱువది
పైనఁబడిన వయసు నాకుఁ బ్రాప్తంబయ్యెన్" (పు 31)

—అనీ చక్కగా పోషించారు.

# మెచ్చుకైన లఘుకావ్యం ముంటాజమహల్

"రాణి విడిచిపోయె రాజు నొంటరిఁజేసి
రాజు విడిచిపోయె రాజ్య రమను
రాజ్య రమయు విడిచె రాజునుఁ బెక్కండ్ర
తాజి విడువలేదు రాజసంబు"

—అని తాజ్‌మహల్ రాజసాన్ని గూర్చిన జాషువా కవి వాక్కు.

నేనంటాను జాషువా మనల్ని వదలి వెళ్ళిపోయాడు. అతని కమనీయ కంఠం మనకు వినిపించకుండా పోయింది. కానీ ఆయన కవితా సామ్రాజ్యం మాత్రం నశించ లేదు. అతని తాజి కవిత ఈనాడు తాజాగా ఉండి మనల్ని తనియింపజేస్తుంది; ఇంకా చేయించగలదు. అదే జాషువా ముంటాజమహల్ ఘనత.

ముంటాజమహల్ మహాకావ్యం కాదు. కేవలం లఘుకావ్యం. అయితేనేం? మహాకావ్యంవల్లపొందే సమస్తానుభూతిని-లేదా అంతకంటే ఎక్కువగానే మనం పొందుతున్నాం. గ్రహించిన ఇతివృత్తంలో, సన్నివేశాల్ని కల్పించి నిర్వహించిన తీరులో, పోషించిన పాత్రచిత్రణలో, రసభావబంధురంగా, మధుర మంజులంగా కవిత్వపటుత్వ స్పష్టీకరణలో మహాకవికుండవలసిన లక్షణాలన్నీ పుణికిపుచ్చుకొన్నారు. లలిత మనోజ్ఞభావాలకీ, భావుకతతోకూడిన కవితావైభవానికి జాషువా ఎక్కడా ప్రయత్నించినట్లగపడదు: అవి అతనిని వరించినట్లు, నిసర్గమనోజ్ఞంగా అలవోకగా వచ్చి జాలువారుతుండడమే జాషువాకవి కవితలోని మహత్తర లక్షణం.

లఘుకావ్యం:

ఏదేని ఒక భావాన్ని గ్రహించి పరిమితంగా పాత్రలున్నా, లేకున్నాగూడా, ఆశ్వాస విరహితంగా ఉండే రచనని మనం ఖండకావ్యమనిగానీ లేదా కావ్యఖండిక అనిగానీ అనవచ్చు. ఒక చక్కటి చిన్ని ఇతివృత్త సన్నివేశాంతో, పరిమిత పాత్ర

లతో, ఆశ్వాస విభజన ఉన్నా లేకున్నా, రసభావబంధురంగా, మధురమంజుల కవితా శివ్యంగా రచించబడిన రచనావిశేషాన్ని లఘుకావ్యమనడం సముచితం అనినాభావన. దీనికి చక్కటి ఉదాహరణ జాషువా ముంటాజమహల్. ఇది తెలుగులోని చక్కటి లఘుకావ్యం. కాని దీనివల్ల పాఠకులు పొందే అనుభూతి అనల్పం

ఇతివృత్తం :

మొఘల్ చక్రవర్తి షాజహాన్ ముంటాజమహల్ ప్రణయగాథ ఇందులోని ప్రధానేతివృత్తం. పందొమ్మిదేండ్ల పవిత్ర దాంపత్య జీవితంలో పదమూగురు సంతానం పొంది పదునాలుగవ సంతానం టాజి కడుపున పడ్డప్పుడు ఒకనాడు విషజ్వరం ముంచుకొని వచ్చి టాజి ప్రాణాలు బలిగొన్నది పాదుషా మిక్కిలి దుఃఖించి టాజి స్మృత్యర్థం మహల్ నిర్మింపదలచినాడు చాటింపు వేయించాడు. బహుమతి ప్రకటించాడు. ఒక పిచ్చివాడు తన హృదయేశ్వరి స్మృత్యర్థం నిర్మించుకొన్న బొమ్మను స్వీకరించి పాదుషా సగౌరవంగా నజరానా అర్పించాడు విరాగి అయిన ఆ పిచ్చివాడు దాన్ని గ్రహించి సభవదలి వెళ్ళిపోయాడు పాదుషా ఫకీరులకు ఆ ధనం పంచిపెట్టి తాజ్‌మహల్ మనోజ్ఞ మహితంగా నిర్మింపజేశాడు ఔరంగజేబు సోదరులను వధించి తండ్రి షాజహాన్‌ను చెరసాలలో పెట్టించాడు పాదుషా ప్రియురాలికి మారుగా నిర్మితమైన టాజమహల్‌ని చూస్తూ ఏడేండ్లు కారాగారంలో కృశించి నశించాడు. ముంటాజి గోరీ ప్రక్కనే షాజహాన్ గోరీ నిర్మించబడింది. టాజి రాజసంతో ఒప్పుతూనే ఉంది ఇది ఇందలి కథ. చాలావరకు ఈ కథ చారిత్రకాంశాల మీదనే ఆధారపడింది అయితే చక్కటి కల్పన పిచ్చివాని పాత్ర. తత్సంబంధి సన్నివేశాలు జాషువా కవితా నల్ప కల్పనకిది చక్కటి సాక్ష్యం దాన్ని నిర్వహించిన తీరు అనన్య సామాన్యం

పాత్రచిత్రణ :

ఈ లఘు కావ్య ప్రధాన భూమిక ముంటాజి. టాజి నిర్మాత షాజహాన్, వారి కుమారుడు ఔరంగజేబు; కల్పిత పాత్ర పిచ్చివాడు—అనే ఈ పరిమిత పాత్రలను సహజ సుందరంగా, సజీవపాత్ర చిత్రణచేసి తరించారు జాషువా. టాజి రాజసం వదలనట్లే ఈ లఘు కావ్యంలోని ఈ పాత్రలు సజీవమై మనతోపాటు నడయాడుతూన్నట్లు చిత్రించబడడం ఈ కావ్యంలోని గొప్పదనం.

ముంటాజి, షాజహాన్‌ల పవిత్ర దాంపత్య జీవితం స్వర్గసుఖాలతో పందొమ్మిదేండ్లు గడచిపోయింది. వారిమధ్య ఎలాంటి అరమరికలులేవు. సంపదలకు కొదవ లేదు ప్రేమ సామ్రాజ్యం ఏలడమే తమవంతు.

"ముద్దులరాణి మాటకు విభుండెదురాడడు, రేనియాన క
మ్మొద్దియ మాఱు పల్కదదెపో ! సహవాస" మటంచు నిత్యమున్
బెద్దలు ప్రస్తుతింప నతివేల సుధా ప్రణయైక రాజ్యపుం
గద్దె నలంకరింతురు మొగల్ మగల మ్మోహనీయ దంపతుల్. (18)

"దంపతుల కెల్ల నద్భుతాదర్శమగుచు
జగము నలరించె నయ్యాలు మగల చెలిమి" (20)

అది వారి ఆదర్శవంతమైన దాంపత్య జీవితం. దీనికి ముందే ఆ ద సౌందర్యాన్ని చిత్రించే శిల్పిగాని; వర్ణించే కవిగాని లేదనీ పేర్కొన్నారు జాషువా

"మొగలు దొరసాని లావణ్య భూషణంబు
కన్నుమూయదు సంతాన ఘర్షణమున
జీవితంబున నొక దుష్ట చింతలేని
సత్యవంతుల ప్రాయంబు జాబదంద్రు" (22)

అనీ —

"రత్నరుచులీను యవన సామ్రాజ్యరమకు
నగలు గీలించు రాణి సౌందర్య లహరి
ప్రభువు కన్నులు దాటి యీ వలికిరాదు
వలపు లూరింపకుండ నవ్వలికిఁబోదు" (24)

అనీ —

ముంటాజి సౌందర్యంతోపాటు పతిప్రాణగతగాఉన్నట్లు వర్ణితం. మరణాసన్న సమయంలో భర్త షాజహాన్‌కి ముంటాజిచేసే వైరాగ్య బోధన అనన్య సామాన్యం. ఇలాగే షాజహాన్ గూడా ఆదర్శవంతుడు అకళంక చరిత్రుడు, ఏకపత్నీవ్రతుడు.

"గుడి గుడి సేవింపఁడు పా
ల్పడఁడు మజాసేయు మత్తు సుఖములకు వ
య్యొడయఁడు పరికింపఁడు పెర
పడంతుకల నెఱపు నేక పత్నీవ్రతమున్" 9)

షాజహాన్ పవిత్ర దాంపత్య జీవిత మకరందం గ్రోలి తనివి చెందినవాడు కనుకనే ముంటాజి మరణంతో పలుపిధాల హృదయ విదారకంగా విలపించు. విలపించి సొమ్మసిల్లిన షాజహాన్ మనోగతిని మిక్కిలి సున్నితంగా అభివర్ణించారు. జాషువా —

'మృతికి నవ్వలియొడ్డు జేరితివి నీవు
యివలి యొడ్డున నిలిచిపోయితిని నేను
పలుకు లందని భిన్నవాసులగు మనకు
పుణ్యగేహిని స్నేహంబు పొసఁగుటెట్లు ?'

అని వాపోయి సుందర ముంటాజి స్మృత్యర్థం టాజిమహల్ నిర్మించాడు. యాభై ఆరు అక్షరాలుగల తెలుగుభాషకే టాజిని వర్ణించనలవిగాదంటే తక్కిన భాషలకు సాధ్యమా అంటారు చమత్కారంగా జాషువా. 'కలదే స్వర్గము లాతిచో! కలలో నిక్కంబద్దియే నీతిమంతుల విశ్రాంతి నికేతనంబు' అన్నట్లు నిర్మితమైంది. అది ముంటాజి షాజహానుల ప్రణయానికి కలకాలం చెరగని తరగని రీతిని నిలిచిపోయే చిహ్నం !

ప్రాసంగికేతివృత్తం లాంటి పిచ్చివాని పాత్రచిత్రణలో జాషువా కల్పనా శిల్పం గోచరించి కావ్య గౌరవానికి అనంతంగా ఉపకరించిందింది. అలాగే ఔరంగజేబు పాత్రపోషణ వాస్తవానికి ఆ పాత్రకి సహజమైన రీతిలోనే—రెండం చులుగా కొనసాగింది. అయితే ఈ రెండు పాత్రలచిత్రణలో జాషువా కూడా

పాశ్చాత్య పాత్రచిత్రణ తనంతకు తానే రావడం సహృదయాల్ని అలరించే గుణం సంతరించుకొన్నదని చెప్పడం అత్యుక్తిగాదు పాశ్చాత్య నాటక నిర్మాణ వైఖరుల్లో సమానంతరత్వం (parallelism), ప్రతియోగం (contrast) అనే లక్షణాలు ప్రాధాన్యం వహిస్తాయి. అలాంటి లక్షణాలతో ఈ రెండు పాత్రలు పోషించినట్లు స్పష్టమవుతుంది. సమానాంతరత్వం, ప్రతియోగం అన్నవి రంగాల్లో, సన్నివేశాల్లో పాత్రలశీల స్వభావాల్లో స్పష్టమవుతాయి ముంటాజిమహల్ లఘుకావ్యంలో పిచ్చివాడు ప్రియురాలి మరణంతో దుఃఖిస్తూ ఉండడం, తత్స్మృతికి చిహ్నంగా "పసిడి రేకులు" నిర్మాణంచేసుకోవాలని భావించి మచ్చుబొమ్మను తయారుచేసుకొన్న సన్నివేశం సమంగా షాజహాన్ మానసికస్థితిని ప్రతిబింబిస్తుంది ఈ ఆమ్రేడిత సన్నివేశంతో షాజహాన్ మానసిక స్థితి మరింతగా మనకు గోచరమై మన మనస్సులను అలరిస్తుంది.

"రాజు సతీ వియోగి బయిరాగియు బెండ్లములేని దీనుఁడ
వ్యాజము లిట్టివారి సహవాసము లింతియకాక" (95)

అని సభలోనివారు పరిహసించడంలో ఈ సమానంతరత్వం మరింత స్పష్టమవుతుంది. కానీ ఆ పిచ్చివాడు కూటికి పేదవాడే. గుణాలలో మిన్న. సుల్తాన్ "పదివేల నిష్కములు"తో సభలో గౌరవించి నజరానా పెట్టగా, పిచ్చివాడు సుల్తానును ప్రశంసించి వాటిని అచటి నిరుపేదలయిన కళాకారులకు పంచిపెట్టుమని కోరి

"నావలె వియోగ బాధా
జీవులయిన మొగలు రాజశేఖరులను మీ
కీవిప్రయోగి కాన్కము
దావహమయి చిత్తశాంతి కనుకూలించున్" (106)

అని చిత్తరువులోని ప్రతిమలా సభంతా చూస్తుండగా వెళ్ళిపోయాడు. ఇక్కడ ఆ పాత్రశీలం అనన్య సామాన్యంగా జాషువా పోషించి ఆ విరాగికి ఎంతో గణ్యతను ఆపాదించాడు. తన్మూలంగా పాత్రచిత్రణలో తాము అందెవేసినచేయి అని నిరూపించుకొన్నారు.

పూర్వోక్తమైనట్లు ఔరంగజేబు పాత్ర రెండు ముఖాలతో విశిష్టంగా ఉండడం విశేషం. ఒకరకంగా తండ్రి షాజహాన్‌తో సమానంతరత్వం ఉంది. మరోవిధంగా ఎంతో ప్రతియోగముండి. ఈ పాత్రలో ఈ రెండు లక్షణాలు ఉండడం విశేషం. రాజ్యకాంక్షతో సోదరులను చంపి, తండ్రిని చెరసాలలో ఉంచడం అన్నది- ఈ పాత్రల మధ్యగల ప్రతియోగం కాని ఔరంగజేబు వైయక్తిక జీవితం చాలా ఆదర్శవంతమైంది. అందుకీతడు తండ్రితో ఏమాత్రము తీసిపోడు. అన్నివిధాలా తండ్రిని పోలినవాడు-అందుకే జాషువా షాజహాన్ సచ్ఛీలాన్ని గురించి చెప్పిన పద్యాన్నే ఔరంగజేబుకు కూడా వాడుకొన్నారు.

"గుడిగుడి సేవింపఁడు పా
ల్పడఁడు మజాసేయు మత్తువస్తువులకు న
య్యెడదయఁడు పరికింపఁడు పెర
పడంతుకల నెఱపు నేకపత్నీ వ్రతమున్" (9, 136)

ఇంతేగాదు తండ్రి భోగలాలసుడైతే తాను కేవలం "రాచఫకీరు"లా బ్రతికా డట! ఈ విషయం జాషువా మనోజ్ఞంగా వర్ణించారు.

"అతఁడు ఖురాను వ్రాసి ధనమార్జనచేయుచు కష్టజీవియై
బ్రతుకుచు నేలపై తనువు వాల్చుచు రాజ్యము చేయుచుండె నం
చితమగు భక్తితత్పరత స్వీయ మతోద్ధరణైక దీక్ష శు
ష్కిత తనుఁడై సతంబుపవసించుచు రాచఫకీరుపోలికన్" (135)

ఇందులో మళ్ళీ తండ్రి కుమారుల శీలస్వభావాల్లో ప్రతియోగం (contrast) గోచరమై స్పష్టమైన రీతిని పాత్రల సృష్టి అవగతమవుతుంది ఇలా చెబుతూ వెళ్ళితే మాతృకను మించిన గ్రంథం అవుతుంది. జాషువా పాత్ర చిత్రణలోని నైపుణ్యాన్ని స్థాలీపులాక న్యాయంగా చూపించాను

సరళమైన శైలి, భావుకత, చెప్పే రీతిలో నవ్యత మొదలైన ఎన్నో కోణాలనుంచి జాషువా కమనీయ కవితా వైభవాన్ని మనం ఆస్వాదించ వీలవుతుంది. మచ్చుకుకొన్ని ఉదాహరణలు.

భావుకత :

ముంటాజి మరణానంతరం ఊరడిల్లిన షాజహాన్ మాటలు —

"అరిపోవని నీదు శరీర శోభ
దీపమైనది కాళింది తిన్నియలకు
మంజులంబైన నీ సౌకుమార్యమెల్ల
పంచుకొన్నవి తన్నదీ పంకజములు". (66)

వర్ణన :

'పెనుశోకమూర్తి' అయిన ముంటాజి చిత్రణ కరుణ రసార్ద్రమై మనకన్నుల చెమ్మగిల్లజేస్తుంది —

"కొడుకులఁ గౌగిలి చుని గ్రుడ్లకు నీరము గ్రుక్కుకొంచు గ్రా
న్నడ పెనుశోకమూర్తియయి పజ్జవసించు నిజేశు నంగమున్
బుడుకుచు బిట్టుగా మొగిడిపోయిన కన్నులు విచ్చి శబ్దముల్
దడబడఁ బల్కరించె రుచు దప్పిన గద్గద రుద్ధకంఠయై" (40)

నవ్యత :

చెప్పే తీరులో నవ్యతని సాధించారు జాషువా. రాత్రి ఒంటి గంట సమయమని చెప్పటానికి చమత్కారయుత రచన.

'ఒకటి రెండుమారు లురలి నేలకు జాతె
కావలా జవాను కఱకు కత్తి,
సురటి విసరు చేటి మఱచి నిద్దురవోయె,
ఖంగుమనుచు నొంటి గంటకొట్టె' (29)

సీసపద్యరచన :

సీస పద్యరచనలో ఎంతో సమతని, తూగునీ, వైవిధ్యాన్ని సాధించారు జాషువా. టాజి పైభవం —

'ఆగుపించు నచ్చోట నవధిదాటిన పాదు
షాల హేరాళ భాస్వద్విభూతి

నిండారు నచ్చోట నిత్యనూతన వికస్వరమైన యానంద పరిమళంబు

సినదించు నచ్చోట ననుకూల దాంపత్య
విశద రహస్య గంభీరగీతి

విహరించు నచ్చోట విరహ వేదనతోడ
మానవేంద్రుని భగ్నమానసంబు

వేయిచంద్రుల చంద్రికా విలసనంబు
పరిసర క్షేత్రముల జింది ప్రతిఫలింప
హాయి గల్పించు తాజి కుడ్యముల మీఁద
గుసగుసలు వోవు నైలింప కువలయంబు.

అలంకారాలు :

అలంకారిక శైలీ విన్యాసానికి ముంటాజిమహల్ కావ్యమంతా ఉదాహరణమే అవుతుంది. ఉపమా, రూపకం. ఉత్ప్రేక్ష, అర్థాంతరన్యాసాలంకారాలు తమకు తామే కుదురుకొని జాషువా కవితకు వన్నె బెట్టుతున్నాయి. అందులో ఉపమకు ఒక్క ఉదాహరణ. కారాగారంలో బంధింపబడ్డ షాజహాన్ దుస్థితి —

"ఎట్టెదుటన్ మహోజ్జ్వలముగా వెలుగొందుచు తాజిమాలు చూ
పట్టుచు నూరడంప నలబంధన గేహమునందు వృద్ధ స
మ్రాట్టు మహేంద్ర తుల్యుఁడవురంగుని కూరిమి తండ్రి కాలమున్
నెట్టుచునుండె జీవములు నిల్చిన పీనుగువోలె దీనుఁడై" (142)

ఇలాగే ఎన్నైనా ఉదాహరణలిస్తూ వెళ్ళవచ్చు

ఇంకా వైరాగ్యబోధనలో ఉమర్ ఖయ్యామును, పిరదౌసి ప్రశంసతో ఆత్మీయతను జాషువా తలంప జేస్తారు. అంతేగాదు విరాగియైన పిచ్చివాని కళానైపుణ్యాన్ని గూర్చి చెప్పిన పట్టులోని పద్యంలో—

"కళలు మోహించు టొకకులీనులన కాదు
కులము లేదన్న వానినిఁ గూడ వలచు
సత్కళాదేవతా కటాక్షంబు కతన
సమయు గావుత యుచ్చనీచతల బెడఁద" (88)

అని తన ఆవేదనను ఆవిష్కరించారు. ఇది ఆత్మీయతా ముద్ర.

ఇంతెందుకు ! చివరిగా జాషువా మాటతోనే ఈ వ్యాసం ముగించడం సముచితమని భావిస్తాను.

'చదువవచ్చు గ్రంథసముదాయ మంతయు
కృతులలోని నెరసు లేరవచ్చు
రసము సృష్టిచేయు ప్రజ్ఞావిశేషంబు
సాధనమున రాదు చదువుగాదు". (96)

(జాషువా జయంతి సమితి, నరసాపురం, ప్రత్యేక సంచిక—అక్టోబరు 1981)

# "గౌతమీకోకిల" - కవితా వైభవం

గౌతమీకోకిల బిరుదాంకితులైన శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారు 7-1-76 న దివంగతులయ్యారన్న వార్త విన్న సర్వాంధ్ర సాహితీలోకమూ సంక్షుభితమైంది. అయినా వారి వాణి వినిపిస్తూనే ఉంది. భౌతికంగా వారు లేకపోయినా భావకవిగా వారు చిరంజీవులు. తెలుగుజాతి, తెలుగు సాహిత్యమూ కొనసాగినంతకాలమూ వారి కవితాగానం మనల్ని అలరింపజేస్తూ ఆనందసందోహాన్నిస్తూనే ఉంటుంది.

ఆధునికాంధ్ర సాహిత్యంలో భావ కవితోద్యమం వసంత ఋతువు. ఈ వసంత ఋతువులో గౌతమీ పరిసర ప్రాంతాలనే తెలుగుతోటలో భావకవితల నాలపించిన శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారే "గౌతమీకోకిల". వారు సార్థక బిరుదాంకితులని వారి కవితల నాస్వాదించిన వారెవరైనా అంగీకరించకతప్పదు. భావ కవులలో ప్రసిద్ధులైన రాయప్రోలు, కృష్ణశాస్త్రి, దువ్వూరి, నండూరి, అబ్బూరి, వేంకటపార్వతీశ్వర కవులు, విశ్వనాథ, బసవరాజు, నాయని, జాషువా ప్రభృతులతో సమాన పీఠస్థులు వేదుల సత్యనారాయణశాస్త్రిగారు. 1900 మార్చి 23న వారి జననం. 76 ఏళ్ళ సంపూర్ణ జీవితానుభవానంతరం తనువుచాలించి ధన్యులయ్యారు. వేదులవారి మొదటి ఖండకావ్యం దీపావళి; వేదులవారి మాటవినగానే మనకు స్ఫురించేవి, వారి దీపావళినాడు, రాధ, కాంక్ష ఖండికలు. వేదులవారు దీపావళి ద్వారానే ప్రసిద్ధులు. కానీ వారి రెండో కావ్యం ముక్తఝరి ఎంతోమందికి తెలీదంటే ఆశ్చర్య పడవలసిన పనిలేదు. ఈముక్తఝరి ఖండకావ్య సంపుటిలో వ్యక్తమయ్యే వేదులవారి వ్యక్తి, కవితాశక్తి, రక్తి, మధురభక్తి ప్రభృతి గుణ నిరూపణమే ఈ వ్యాసలక్ష్యం ఇది మన మాకవికి చేయగల గౌరవం. ఇది ప్రతి ఆంధ్రుని కనీస ధర్మం.

ముక్తఝరిలోని కవితవల్ల వేదులవారి దేశభక్తి, సంస్కరణాభిలాషతోకూడిన మానవతా, నిరుపేదల బాధల్ని తొలగించే హృదయమూ, బుద్ధుని జీవకారుణ్యమూ, జీవితంపై ఆశ మొదలైన గుణాలు వ్యక్తమవుతాయి.

'లేదు బంధమ్ము, లేదు నిర్బంధమిపుడు నేల నాలుగుచెరగుల నిఖిల శృంఖలా విమోచనోత్సవ సముల్లాసమూలమే' (ఆరాధన-31) నని సంతోషాన్ని వ్యక్తంచేయ గలిగిన స్వేచ్ఛాజీవులు వీరు. ఇలాగే

ఏయెడ-ఏ విధాన జనియించిననేమి ప్రపంచమెల్ల నా
దేయని స్వేచ్ఛగా పరుగులెత్తుచు సోదర సృష్టినెల్ల నా
ప్యాయత పల్కరించుచు ప్రియమ్మున కౌగిటచేర్చి జీవనో
పాయన మిచ్చుచుందుడిచి వైతు పురోగమనావరోధముల్ (ముక్తయురి-4)

అని సర్వమానవ సౌభ్రాత్రాన్నికోరి, ఆ స్వేచ్ఛకై ప్రతినబూని—

ఇదియది యనక కాలిడిన చోటులనెల్ల
పైరుపచ్చల పెంపువారజేసి
చిన్నపెద్దనక నాచెంతకేతెంచిన
ప్రాణి సంతతుల పిపాసదీర్చి
అయిన గాకున్న మార్గాయాస ఖిన్నుల
శీతలా నిలముల సేదదీర్చి
మొలక ప్రోడనక నాకెలకుల పొదతెంచు,
చెట్టు చేమలకింత జీవనమిడి

ఎండి బీడైన పొలమునన్నెల్ల తడిపి
ఉమ్మలికవోవ నవసుగంధమ్ము సంగి
హేలగా, లీలగా మూలమూల లొరసి (ముక్తయురి-6)

అనీ స్వేచ్ఛతోపాటు సర్వప్రాణి సౌఖ్యాన్ని కాంక్షించిన మహామహాత్ములు వేదులవారు. ఇదివారి కవితా లక్ష్యం.

సంఘంలోని అన్యాయాన్ని, అధర్మాన్ని నిర్మొగమాటంగా తీవ్రంగా ఖండించారు వేదులవారు.

ధనిక నిర్దాక్షిణ్యమున కమ్మడై క్రగ్గు
కార్మిక ప్రజల యాక్రందనములకు
ఆకలిగొన్న దిగంబర మూర్తులకు

పేదల యార్తనాదములకు (మూడవ వసంతము–62) సంక్షుభిత మనస్కులై కూడుగుడ్డ పడగొట్టిన దోపిడి గుండెలుబాచిన కోరలాపిడి (శ్రావణ–58)ని భరించ లేకపోయి కార్మిక ప్రజా స్వేద ఫలమ్ముతో నినుప పెట్టెల నింపెడి నిర్దయు (మాతల్లి–28) లని ధనికుల్ని మిక్కిలి నిరసించారు. ఇలాగే కాంక్ష ఖండికలోనూ "పేదల రక్తమాంసముల పెంపు వహించి దయా రసామృతా స్వాద దరిద్రులైన ధనవంతుల పెద్దరికాన్ని" నిరసించి ఉండడం సువిదితమే

"పేద కన్నుల నశ్రుబిందు వొకటురలెనా
ఉదధివేడి యెడద నుప్పొంగి పోవలయు" (స్వప్నము–12)

నన్న మహానుభూతిగల వారు వేదుల. ఇంకా

"హృత్కవాటమ్ము బారలతెరచి
ఆలింగనముతో ఆతిధేయమ్ముతో
మమతతో సమతతో మానవులు వర్తించు
నపుడే జగచ్ఛాంతి ! అపుడే మనశ్శాంతి". (స్వప్నము–12)

— అని సమతా మమతా శాంతిమయ జగత్తు నాకాంక్షించిన మానవతా వాదులు వేదుల.

'ఆంధ్రగీతి' (19–12) లో సర్వమూ గని, అహంకారాన్ని అణచుకొన్న నిరహంకారులు వేదుల.

"పదియు నారేండ్ల పాటి యౌవన సుషుప్తి
తేలిపోయిన యూర్మిళాదేవి మ్రోల
ప్రణయ వినమితుడైన లక్ష్మణుడు. (ఆరాధన–32)
వేదుల, "నిర్వేదుల (మాతల్లి–28) వేదుల. అయినా—

"భూత కాలమ్ము కన్న రాబోవు కాల
మభ్యుదయ దాయకమ్మను సహజ మెల్ల వారికి
అట్లు కాదేని బ్రతుకు భారమై తోయునెంతటి వారికైన" (ఉగాది-89)

సహజంగా ఆశాజీవులు వేదుల. ప్రజా కవులు వారు - అందుకే-

"నరపతి మెచ్చియిచ్చెడు ధనంబులుగాని మణి విభూష ణాం
బర బిరుదాగ్రహార పరివారనిసారముగాని, నా కిటుల్
సరసులు పండితేంద్రులు కళాజగతి సహయాత్రికుల్ మహా
దరమున జేయు మన్నన విధంబున నింపను బెంపు నింపునే"

(కృతజ్ఞత-45)

అంటారు వీరు. వీరి స్వభావమిందు సుస్పష్టం.

"మా కుసుమమ్ము ఇట్లు కేలుకేలు గీలించుచు
సకలాంధ్రమ్మొక రాష్ట్రము సలిపి తీరవలెనంచును
ఒకేసారి ఒకేసారి సాగిపోవు సమయమ్మున
ఓ మాప్రియ జనయిత్రి ఓ సువిశాలాంధ్ర ధాత్రి" (విశాలాంధ్రము-34)

అది వీరి చిర వాంఛితం. 'మా బాపూజీ' పు-99 100 లో బాపూజీ హృదయాన్ని ఆవిష్కరించిన గాంధేయవాదులు వేదుల.

తెలుగుదనాన్నీ, తెలుగు భాషనూ, తెలుగు జాతినీ, తెలుగు దేశాన్నీ, అందులోని సమస్తమూ తలచుకొని పులకరించి గర్విస్తారు వేదుల

"తెలుగు నేలపైన తిరుగాడు నప్పుడు
తెలుగు మాట నోట పలికినపుడు
తెలుగువారి కథలు తలపోసినపుడు
పొంగిపోదు గర్వమునను నేను.

తీరి బంగారు పండెను తెలుగునేల

తేటనీటితో ప్రవహించు తెలుగునదులు

తెలుగు వాసిని ప్రకటించు తెలుగునదులు

తలచుకున్నంత నామేను పులకరించు" (తెలుగుతల్లి-80)

స్వభాషా, జాతి దేశాలపై అభిమానంగల ప్రగతిపథగాములు వేదుల

తెలుగుతేటపై వేదులవారికి మక్కువ ఎక్కువ. "సొగసులపుట్టలో నెగిరెడి పిట్ట" అంటూ ఆరంభించిన "విహగగీతి" (పు-24)లో వారి తెలుగుతేట సుస్పష్టం "ఉగాది" (పు-91) ఖండికలోనూ ఈ తెలుగు తియ్యదనం గమనించవచ్చు. అచ్చమైన తెలుగు భాషపై అత్యంతాధికారంగల మహాకవి తిక్కన తెలుగు భాషాతత్వ సంపూర్ణవేత్త. తిక్కన తరువాత పదకవితనే రచించినా-తెలుగుతేటనూ, పలుకు బళ్ళనూ, నుడికారాన్నీ చాటిన పదకవితా చక్రవర్తి క్షేత్రయ్య. ఈ విషయాన్ని తెలుగుతేటపై అమితమైన మమకారంగల వేదులవారు—

"ఉన్నదో లేదొ తిక్కన్నలో నీజాను

తెనుగు మాటలకూర్పు తేటదనము" (క్షేత్రయ్య-42)

అని మిక్కిలి ప్రశంసించారు క్షేత్రయ్యను. "క్షేత్రయ్య"విరి పదప్రయోగం విరివిగాచేస్తాడు తన పదాల్లో. అలాగే వేదులవారికి సైతం "విరి" పదంపై అపరిమితమైన ఇష్టం "ఏ విరి వికసించెనో సిరిమల్లె" మొదలైన ప్రయోగాలు ఇందుకు తార్కాణం. వీరికి భాషపై నధికారముంది సందర్భోచితముగా పదప్రయోగం చేయడమూ, సున్నితమైన భావప్రకటనాక్షమమైన పదప్రయోగం గావించడమూ వీరిలోగలదు

"ఆకురాలిన మ్రోడులందు స్రుక్కెడు జీవ

కళ మంచుపడి, కనుల్ నులుపుకొనియె!

చేమంతిపూల పరిమళమ్ములకు

సంధ్యావసాన సమీర మావులించె.

కతిగొన్నట్టుడు చకోరియు రేయెల్ల
తడి వెన్నెలకు మూతి ముడుచుకొనియె
పడతి ముంగిట నెర్రబొడ్డ శోకనందాక
పడకిల్లు విడిచి రా బద్ధకించె

పంటకళ్ళాన కాపున్న పడుచుకొప్పు
వగచె రేయెంతకును తెల్లవారదనుచు
మంచు ముసుగు జీరాడ హేమంతరాత్రి
పెండ్లినడకల వయ్యారి నడచునపుడు (చర్దణధ్వాళి-పు–13, 14)

— ఇందులోని "జీవకళ, కనుల్నులుముకొనెయి, సమీర మావులించె, పడతి చకోరి, 'మూతిముడుచుకొనియె', పడతి పడకిల్లు విడిచి రాబద్ధకించె" .... అన్నవి అర్థస్ఫూర్తితో గూడిన గడుసు ప్రయోగాలు. "మంచు ముసుగు జీరాడ హేమంతరాత్రి" ఎంత సొగసైన, సుస్మితమైన భావ ప్రకటనమో, సహృదయ హృదయైక వేద్యం ! ఇంకా ఇలాగే—

"అల యశోదరహాస కలశ వారాశి
వెలిదమ్మియై తూర్పు వికసించునపుడు,
చెట్టుకొనకొమ్మ కొంజిగురు జొంపాల
దాగి విప్పెదవు నీ రాగాల గొంతు".

"నడిమింటి సంద్రాన నావ చందాన
తీరైన రెక్కలో తీర్చావ తెత్తి
గాలి కెరటాలలో తేలిపోయెదవు.

"రేసతి తల విరబోసి కొన్నప్పుడు
నీ తల్లి రెక్కల నీడలో నొదిగి
కుదురుగా నిద్రవోయెదవు క్రాబోలు". (విహంగగీతి–24,25)

అని ఎంతటి సుకుమార భావన చేయగలరో వేదులవారు మనకవగతమవు తుంది.

వర్ణనా వైదగ్ధ్యం సైతం కవి కవితా వైశిష్ట్యానికి నిదర్శనమే. వీరి ఖండికల్లో చక్కటి మనోజ్ఞ వర్ణన లుండడం ముదావహం.

'ఏ చూతము చిగిర్చెనో చూతమని తోట
తోటకు కోయిల మేటి తిరుగ,

ఏ తీవ పూచినదో తిరికగ చూడ
పొదపొదకును తేటి కొదమ పోవ

ఏవిరి వికసించెనో వెదకాడగా
తీగ తీగకు తేనెటీగ చనగ

ఏపంటు దొరదౌనో, పరికించగా
చెట్టుచెట్టుకు రామచిలుక వెదలి

భామినీకైశ్య మల్లి పరిమళములు
కొల్లగొన సందెగాలి ఇల్లిల్లుదూర
చేవచావని హృదయాల చివురుదొడుగ
ఆమని యొసంగె నిత్యకళ్యాణమగుచు" (ఉగాది-90)

ఆమని వర్ణన ఎంతో హృదయరంజక మనకతప్పదు. ఇలాగే మూర్తివర్ణన సైతం "అరుణాధరమ్ముపై...." (చరణధూళి-17) బుద్ధుని స్వరూపనిరూపణ వర్ణనమూ, "ఉన్నదో లేదో ..." క్షేత్రయ్య (పు-42) స్వభావానికీ, మధురభక్తికీ సముచిత వర్ణనమూ, అనితర సాధ్యమంటే ఆశ్చర్యంలేదు. ఇంకా—

"రసికత చచ్చి భక్తి మధురత్వ మెరుంగక నృత్తగీత సా
ధ్వసులగు పాములయ్యేదువతంసునికై తపియించిపోవు ప్రే
యసి వయి నీవు పాడిన రసార్ద్రపదమ్ముల సభ్యతా మలీ
మసములటందు రెంత కసుమాలపు కాలము దాపురించెనో" (క్షేత్రయ్య-42)

అంటూ క్షేత్రయ్య పదాలు అసభ్యతా జుష్టాలన్న వారిని నిరసిస్తూ వాపోయిన వేదులవారి రసికత, సౌహార్దాలు కొనియాడదగ్గవి.

వీరి కవితలో చక్కటి భావచిత్రాలు ఉన్నాయి. "పరవశపు కారుచీకటి తెర (ముక్తరురి-1), 'కడు చల్లనికార్మబ్బు పడతులిదు దయారసమ్ము'(ముక్తరురి-6), 'పూయని పూతలై తెరలపోలిక పర్విన సాంద్రచంద్రికాచ్ఛాయలు' (స్వప్నము-11), 'మంచు ముసుగు జీరాడ హేమంతరాత్రి' (చరణధూళి-14) ఇంద్ర ధనుస్సును- "మొయిలుమెయినిండ నవరత్నమయ విభూషణావళి అలంకరించు కొన్నట్లుగానూ" "నాకలోకమ్మునుండి సౌందర్యలక్ష్మి, మేదినికి దిగిరాగ నిర్మించినట్టి చారుమణిమయ సోపాన సరణివోలె (ఇంద్రచాపము-22) నూహించడమూ, "నీలిక్రొమ్మొగిలు మేలి ముసుగులో మెరుపుల సొమ్ములు మిలమిల మెరయగ" (శ్రావణి-57) మొదలైన విందుకు చక్కటి ఉదాహరణలు.

వీరి కవిత ఆలంకారికమయినా క్లిష్టతగానీ, అర్థకాఠిన్యంగానీ, దూరాన్వయం గానీ లేక స్పష్టతయే ప్రధాన గుణముగాకలిగి సరళము, మృదుమధురమూనై ఒప్పుతూ ఉంటుంది. ఇది వేదులవారి కవితా వైశిష్ట్యం. వారు ఉపమా (పు 46, 51), రూపకమూ (పు 57, 58, 59, 92, 97), ఉత్ప్రేక్ష (పు 22, 23) ప్రభృత్యలంకారాల్ని ఎంతో సహజసుందరంగా నిర్వహించి "మహాకవి"బిరుద సార్థక్యులయ్యారు

వీరికి పూర్వ కవులలో తిక్కన, క్షేత్రయ్యలపై అమితమైన గౌరవం. అందుకే వారినిగూర్చి మనోజ్ఞంగా చెప్పుకొన్నారని పూర్వోక్తం. సమకాలిక భావ కవులతో సమాన భావాన్ని పంచుకొన్నట్లు వీరి కవితవల్ల అభివ్యక్తమవుతుంది. వారి పద్యం రాయప్రోలువారి "అమరావతి పట్టణమున బవుద్ధులు విశ్వవిద్యాలయము స్థాపించునాడు" అనే పద్యాన్ని విశ్వనాథవారి 'గోదావరీ పావనోదార' పద్యాన్ని తలపింపజేస్తూంది. 'నోములునోచిన భామల్లారా....' (శ్రావణి 57, 59) అనే వీరి ఖండిక, గురజాడవారి పూర్ణమ్మను జ్ఞప్తికి తెస్తుంది. "దిగిరాను దిగిరాను దివినుండి భువికి" అనే దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి గేయాన్నిచూసే వీరు 'సొగసుల పుట్టవో యెగిరెడి పిట్ట దిగిరావె యొకమారు దివినుండి భువికి' అంటూ విహగగీతి (పుట 24, 26)ని గౌతమీకోకిల ఆలపించి తరించింది. స్వేచ్ఛగా దివిలోనే ఉండాలనుకొన్న దేవులపల్లివారి కంటే—

"ఓ విహంగమ ! యొక్కమాట
నరులందరును స్వార్థపరు లనుకొనక
పరహింస కలరెటి వారనుకొనక
కవి హృదయాల రాగము శ్రుతిగల్ప
దిగి రావలయు నీవె దివినుండి భువికి"

అనే ఈ పాటలోని గౌతమీకోకిల పరహితైకమని మనం చూడగలం, చూచి మెచ్చుకోగలం.

ఆధునిక యుగంలో స్మృతికావ్యాల సృష్టి జరిగింది. ప్రాచీన కవితలో యివి లేవనే చెప్పాలి. సహాధ్యాపకుని మరణంతో వేదుల వేదన పరవళ్ళు తొక్కింది. సహానుభూతియే మిత్రస్మృతి అన్న ఖండకావ్యమైంది.

ముక్తరుచి ఖండకావ్య సంపుటిలోని చిట్టచివరి ఖండిక మనసా (పు 112)లో "అస్తమించెను సూర్యుడంతరించెను సంధ్యఅయిపోయె నీరోజునో మనసా!" అని -

"భవ్య తేజోమూర్తి భవకర్ణధారి ఆ
పరమేశుడొక్కడే నోమనసా!
ఆపదలు–గీపదలు అణగునే ఇకనైన
అతడె శరణనుకోవె నోమనసా!"

అది ఏనాడో భగవంతుని శరణుజొచ్చి, ఆత్మ ప్రబోధంగా ఆలపించిన "గౌతమీకోకిల" ఎగిరిపోయింది. కానీ ఆ కలకంఠ కంఠం మాత్రం కలకాలం మనకు మిగిలిపోయింది.

(ఆంధ్రప్రభ 8–2–1976)

# రాయలసీమ కన్నీటి పాట -
# విద్వాన్ విశ్వం పెన్నేటి పాట

ఆధునికాంధ్ర కవితోద్యాన వనంలో పుష్పించి దశదిశలా పరిమళాలు వెద జల్లిన వరపుష్పం "పెన్నేటి పాట"

జగమెరిగిన విశిష్ట పాత్రికేయులు, సరసకవులు, మానవతావాదులు శ్రీవిద్వాన్ విశ్వం గారు వారి అనుభవమే ఆలంబనగా రచితమైన రసవత్కావ్యం పెన్నేటి పాట, రాయలసీమ కన్నీటి పాట. రాయలసీమ ప్రజల నిజాయితీని, నిండు మనసునీ, దండి తనాన్ని వర్ణించి వారి స్వచ్ఛమైన హృదయాల్ని స్పష్టం చేస్తూ వాతావర ణాన్ని, భాషనీ కన్నులకు గట్టినట్లు రసరంజితం చేశారు విశ్వం గారి కమనీయ కావ్యంలో.

అలనాడు రత్నాలసీమ ఈ రాయలసీమ అంటూ అభివర్ణించారు విశ్వంగారు.

" కలమ పాలికల యాలల మేలి పాటల
ఝుమ్మని మ్రోయు మించుల సితారు;

తెనుగు పెద్దన్నల గొనబు పల్కుల, గుబా
ళించిన జాజి మల్లెల గుడారు;

జిలుగు జరీబుటా వలువ సింగారింపు
మెలకువ లూర్చు నిగ్గుల కొఠారు;

తలకు మించిన సత్యముల లోతులను జీల్చి
చను వోవు తెల్వి యంచుల కఠారు;

కడిది మొనగాని ఎడద చిక్కనకు పేరు;
కటిక రాలను కవ్వించి గజ్జకట్టి,
చిందు ద్రొక్కించు మాయల జిలుగు తేరు
కలదు రాయలసీమ పచ్చల బజారు"

"అచట నొకనాడు పండె ముత్యాల చాలు;
అట నొకప్పుడు నిండె కావ్యాల జాలు;
అచ్చట నొకప్డు కురిసె భాష్యాల జల్లు;
విరిసె నట నాడు వేయంచు విచ్చుకత్తి."

అది అలనాటి మాట. ఈనాటి కన్నీటి పాటను తమ పెన్నేటి పాటలో ఇల
వినిపిస్తా మంటున్నారు. శోక సంతప్త హృదయంతో వీరు —

"ఇది గతించిన కథ; వినిపింతు నింక
నేటి రాయలసీమ కన్నీటి పాట
కోటి గొంతుల కిన్నెర మీటు కొనుచు
కోటి గుండెల కంజరి కొట్టుకొనుచు".

నది అనగానే నిత్యం గలగల, జలజలపారుతూ తాను ప్రవహించి నం
మేరా పచ్చని పంట పైర్లతో శోభాయమానం చేసేది అనుకొంటాంగాని ఈ పెన్నే
అలాంటిదికాదు. మరి ఎలాంటిది ? అంటే సమాధానం –

"అదే పెన్న ! అదే పెన్న ! నిదానించి నడు !
విదారించునెదన్, వట్టి ఎడారి తమ్ముడు !
ఎదీపెన్న ? ఏదీపెన్న ? ఎదీ పినాకినీ ?
ఇదేపెన్న ! ఇదేపెన్న ! ఇదే పినాకినీ !

ఎదీ నీరు ? ఎదీహోరు ? ఎదీ నీటి జాలు ?
ఇదేనీరు ! ఇదేహోరు ! ఇదే ఇసుకవాలు !
అదేపెన్న ! అదేపెన్న ! నిదానించినడు !
విదారించు నెదన్. వట్టి ఎడారి తమ్ముడు !

పార చే బట్టుకొని వంగి చీరు దనుక,
ఇట్టె చెమ్మట కాలువ గట్టు దనుక,

ఇసుక పాతర లోతుల కేగుదనుక
నీకు కన్పించ దీయేటి నీటి చుక్క !"

కానీ —

"చిట పట వానలకే, ఉ
క్కట నోరుం దెఱచి, నురుగు గ్రక్కుకొనుచు, ను
త్కటమై, దరులొరసి, రటత్
కటు ప్రవాహముల నింగికై పరువెత్తున్".

అయితే ఈ పెన్నేటి నీటిలో కమ్మదనం ఉంది. రండతనాన్ని దుల్చివేస్తుంది. ఖండితవాదిని చేస్తుంది. నిండుమనసు, నిజాయితీ, దండితనాన్ని ప్రసాదిస్తుంది.

"దోసిట నొక్కమారు పుక్కిలించిన జాలు
నీపుట్టువునకు సార్థకత్వమ్ము
నిష్కల్మషత్వమబ్బు"
అంటారు కవిగారు చక్కగా.

ఈ కావ్యంలో ఉన్నది ఏ ఒక్కరి కథా కాదు; రాయలసీమ వాసుల అందరి కథా ! రంగడు గంగమ్మల జీవితచ్ఛాయలు రాయలసీమవాసుల జీవితాల ప్రతీకలు. ఎక్కడైనా ఎప్పుడైనా ఉన్నవాళ్ళు ఎలా భోగాలను అనుభవిస్తారో, లేనివాళ్ళు ఎలా అతి కఠోర జీవితాలను వెళ్ళబుచ్చుతుంటారో తెలుపుతూ రాయలసీమ గ్రామీణ వాతావరణాన్ని చక్కగా చిత్రీకరించారు విశ్వంగారు.

కన్నులకు కట్టేట్టు కమనీయంగా కథా కథనం చేయగల శక్తి, రక్తి ఉన వారు విశ్వంగారు అందు కుదాహరణం పెన్నేటి పాటలోని రెండు మూడు సర్గలు' రంగని తండ్రి నారపరెడ్డి ఒకనాడతడు "ఊరిలో పెద్ద సంసారి. నాలుగు కాండ్ల సాగుబడిని సేయు పట్టాదారు." కాని లేనిపోని ఆడంబరాలకు పోయిన నారపరెడ్డి త్వరలోనే దివాలా తీశాడు. అంత —

"నారపరెడ్డే నారప్పయ్యేను.
ఊరి మోతుబరి ఉప్పరి యయ్యేను"
— అని ఎంతో సముచితంగా చెప్పారు విశ్వంగారు.

"దారి యోటులో పూరి కొట్టమున
చేరెను తోడొక చిన్ని రంగడే
కుళ్ళి కుళ్ళి యేడ్చి కుక్కి మంచము నుండి
లేవలేక, చేయు చేవ లేక.
చిన్నిరంగడిచ్చు చిన్న లోటా నీళ్ళు,
త్రాగి, ముసలిరెడ్డి సాగిపోయె."

ఆ వెనుక —

"వాడే రంగండయ్యేను
పాడా కసవులను దీసి, పసులగాసి, కూ
లోడా యనిపించుకొనెన్
లేడా నారప్పవీని లేమిడి చూడన్".

తాను చేస్తున్న "అరవ చాకిరీ" బాధామయ జీవితాన్ని తన ఆటపాటల్లో మరచిపోతాడు రంగడు

"బళిబళీ రంగన్న గళమె కావ్యము.
'కోలుకో'లని కోల గొట్టిన జాలు
జాలువాఱుసు "భరతా"ల వేలు;
'ఓ—' యంచు నొకయాల సాయించితేచాలు
జారు 'గాధాసప్తశతు'ల శతులు;
'మచ్చుదిగవే' యన్న మరులు పాటయె చాలు
పొదుగు సేపును—'అష్టపదుల' పదులు.

'గరుడగమనా' యంచు గాత్రమెత్తిన చాలు
పొంచి చూచును 'మూకపంచశతులు'".

ఆ రంగడు —

"పుట్టు కవి గాయకుడు నటరాట్టు నతడు
కట్ట తెగగొట్టుకొని రసముట్టి పడగ
ఉట్టిపాటున కన్నీరు ఉరలిపొరల
చెట్టుపుట్టలకే గుండెపుట్టజేయు"

ఇది రంగనిలోని రంగైన గుండె దానిని సువ్యక్తం చేయగల దండి కవిత విశ్వంగారిది.

"గంగమ్మ పదారేండ్లది
కొంగు నిలుచునంత వయసుగూడ లేని దా
సింగారపు బొమ్మె మన
రంగన్నకు బ్రతుకులో చిరత్న రత్నమా"

"అంగమ్ముల నిగనిగ సా
రంగమ్ముల లగువుబిగ్గువు రంగుల సొగసుల్
ఖంగున మ్రోగెడు కంఠము
బంగరు బొంగరము పుణికి పుట్టిన దపుడే"

ఆ గంగమ్మతో రంగని వివాహమైంది. వీరి అరమరికలు లేని అనురాగపూర్ణ హృదయాల్ని ఎంతో మనోజ్ఞంగా చిత్రించారు విశ్వంగారు.

"రంగన్న గంగమ్మ రంగు రక్తిమలు
రంగన్న గంగమ్మ నింగి నీలిమలు
రంగన్న గంగమ్మ సింగారములు జిమ్మ
రంగారు బంగారు పొంగారు గోపురాల్

రంగడంటే ఒక్క గంగమ్మ మగడె—
గంగమ్మ అనఁనొక్క రంగన్న పడుచె
రంగన్న బ్రతుకెల్ల గంగమ్మ బ్రతుకె
గంగమ్మ మనసెల్ల రంగన్న మనసె"

ఇంతకంటె నిసర్గ మనోజ్ఞంగా వారి దాంపత్యాన్ని గూర్చి—

'రంగని గంగన్నాయని
గంగమ రంగన్న యనుచు గ్రామ ప్రజలున్
భంగుల భంగుల పిలచుట
కంగారునెకాదు, వారి కలయిక దెలుపున్'

అని చెప్పడం విశ్వంగారికే సాధ్యమైందంటే అత్యుక్తికాదు.

'ఎఱ్ఱటెండ ప్రొద్దు; ఏడుమూరల గడ్డి
మోపు మెడలపైన; మూడు మట్ల
లోతుకనులు బొట్టలో వీపుజేరెను
వగడువోలె నతడు వణకుచు'

వచ్చాడు రంగడు ఆ నిమిషంలో అతణ్ణి ఎవరుచూచినా విలవిలలాడిపోతారట. ఆ సందర్భంలో ప్రాణానికి ప్రాణమైన గంగమ్మ చూచింది—

'గిరగిర కన్నుల నీరుం
దిరుగగ, గంగమ్మ చెఱగుదీసి యొత్తుచున్
చరచర లోనికి వెళ్ళెను
పురుషుడు తన కంటి నీరు వోల్చునటంచున్'

అది ఆమె అనురాగానికి నిదర్శనం. ఏడుస్తున్న తన్నుజూస్తే భర్త ఎక్కడ బాధపడతాడో అని లోనికి వెళ్ళింది గంగమ్మ. మిక్కుటమైన వెక్కసంతో ఆ వెనుక వేన్నీళ్ళతో ఒళ్లు నిమిరి స్నానం చేయించింది.

'ఆ నిర్మల ప్రేమ హస్త సంస్పర్శ తో
మాని పోయినవేమొ వాని గాయములు
లోని యొక్కొక యెముక పటానమైయున్న
వాని తీపులు కొంత వదలినట్లయ్యె'

ఆ వూళ్ళో నరసన్నకు "పురుగు ముట్టిన"ప్పుడు ఎవరూ పట్టించుకోకపోగా, రంగడు తన కష్టనష్టాల్ని లెక్కించక మంత్రగానికోసం బాట పల్లెకు వెళ్ళాడు.

"గుండె తీసిన బంటైన కొండదోవ,
కనుమదాటి చీకటిపడి చనుటయన్న
ఒప్పుకొనలేదు; కాని, ఆ ముప్పుజూచి
తప్పుకొనలేదు, రంగని గొప్పమనసు"

మామతో ఆదే లోకమని నమ్మినది గంగమ్మ.

"మంచెంతగ మామ జెప్పిన,
తనే వినదాతని తోడునీడయై"

"మామమాత్ర మూరక క్షణమాత్ర
ముండ లేడుగద; కోడితో లేచి
వాడవాడ మాటు మణిగినదాక
చెమ్మటల నోడ్చుచుంట జూచి
తనెట్లు కూర్చుండగలదు!"

తలదిరిగి, పసరు గ్రక్కి, గుడిసెలోపల పడబోతున్న గంగమ్మను రంగడు పట్టుకొని తొడపయి తలనిడి 'గుడ్లు విడుచుచు' కొంతసేపున్నాడు. కొంత సేదతేరిన—

"గంగమ మామా! యని బి
గ్గంగౌగిలి హత్తి గుండె గంటలు మ్రోయన్

నింగి నరుంధతి కన్నుం
జెంగలువల నీరు గ్రమ్మ చెక్కుల నిమిరెన్"

ఇది రంగన గంగమ్మల అరమరికలులేని ఆదర్శమైన అనురాగం.

రాయలసీమ వాతావరణాన్ని చాలా చక్కగా చిత్రీకరించారు విశ్వంగారు ఈ చిన్ని కావ్యంలో. అది "పేనుగలపెన్న" ఆదరులలో నక్క బావలు, నాగుబాములు నడయాడుతాయి 'బొంత గడ్డలు' గుంపు కడతాయి. తిప్పతీగెలు, రేణుగంపల పొద రిండ్లు, తుమ్మతోపుల ముండ్లు, ఒట్టిత దొంకలు, తంగేడులు, బోదగడ్డి, పల్లేరుగాయలు మొదలైన వాటికి కొదవలేదు. గుడ్లగూబల, తీతువుల, అరుపులు వినిపిస్తాయి.. ఇంకా —

"బల్లులు, తొండలు, నెయకలు,
పిల్లులు, కుక్కలును, చెవులపిల్లులు కొల్లల్;
కొల్లలు తేళ్ళుం జెట్టులు -
ఇల్లు వాకిలి ఇదే ఫణీంద్రుల కెల్లన్.

పుట్టలు గుట్టలు గుట్టలు;
పట్టెడు పట్టెడు నిజమ్ము పావరకాయల్
పుట్టెడు పుట్టెడు జులుకులు —
కట్టా! ఇది యేటి యేటిగట్టు తమ్ముడా!

విట్టాళ్ళకు చట్టాళ్ళకు
వేట్టాళ్ళకు కొదువలేదు; బిసబిస నడువన్
కుట్టెళ్ళివచ్చు, నీ తల
పేట్రేగును సుమ్ము ముందు వెనుకల్ గనుమా"

ఇలాగే —

"ఈ దొంక—పెండ్లిండ్లకేగువారల
నెన్నిటూరులు దొంగలు దోచుకొనిరొ?

ఈ దొంక—నిండు బండ్లెన్నిమారులు
బిరువెక్కుట యిరుసు పుటుక్కుమనెనొ?
ఈదొంక - నెన్ని సార్లెందర మొనగాండ్ల
కాలుసేతుల యెముకలు విఱిగెనొ!
ఈదొంక — మంచినీళ్ళెత్తుక వచ్చు కొం
గ్రొత్త కోడళ్ళెంత కుళ్ళుకొనిరొ!

ఇచట మునిమాపులందెన్ని యెన్నిమోజు
కతలలో రసపట్టుల కాటువడెనొ!
ఇచట నెండ ప్రొద్దుల పసు లెన్నియెన్ని
ఇంత విశ్రాంతికై తపియించి నవియొ!"

ఆ యా సందర్భాల్లో వాతావరణంతోపాటు ఆయా వ్యక్తుల మనస్తత్వాన్ని సైతం సువ్యక్తం చేశారు వీరు. ఇంకా

"మాటుమణిగినదూరు, నిర్మానుషములు
దారులన్నియు చాకలి గేరిలోన మటుకు
మగని గుద్దులు తిన్న మల్లి యేడ్పు
ఊర కుక్కలు మాత్రమే ఊరడింప"

"చీకటి ముంచివేసినది చింతల పల్లెను; గుట్ట కొంప ముం
దే కదలేని తాలడుగుదీసి యెక్కించుక ముందు వేయుచే
నాకము నెక్కునంత పని! నాలుగు బారల కొక్క గుంతొ మి
ట్టో కనిపించు; వాడుక నెటో నడువన్వలె మెల్లమెల్లఁగన్."

గూటిలో దీపముం బెట్టి పీటిలోన
కబళముల బెట్టి కొందురు గ్రామ జనులు!"

అంటూ గ్రామీణ జీవితాన్ని కన్నులగు కట్టినట్లు వర్ణించారు.

పెన్న దరిదాపుల జీవిస్తున్న రైతు దుస్థితిని గూర్చి —

"ఈ యేటి కాల్వ లోతుల
పాయలుగా పారు, నీటి ప్రతిబొట్టున, నీ
చాయల రైతుల నెత్తుటి
చాయలు సమ్మిశ్రితమై విచారము గొల్పున్".

అనీ —

"అదిగో! పాఱలనెత్తి పట్టుకొని వేయార్మంది యీ కాల్వనే
పదిలంబుం బొనరింపవత్తు; రిది కుప్పలొగ్గొట్టు కాలమ్ము వా
క దినమ్ముల్ ప్రతిరైతు సేయవలె సర్కారూరకే పన్ను వే
యుదురంతే! యొకనాడు మానిన పొలా లుత్తుత్తవై పోయెడిన్."

—అనీ అభివర్ణించారు.

ఈనాడూ రాయలసీమ సామాన్య ప్రజల అన్నపానీయాలు —

"కటిక కారము సంగటి గుటక పడక
ఎన్ని బిందెల నీళ్ళు త్రావించి నదియొ!
ఎంత రొట్టెముక్కలు అఱిగింపు గాక
ఎన్ని మిరప గింజలు నమిలించినదియొ".

అనీ —

"కుంతలోని సంగటి నంత గోకి తీసి,
మూకటిని బెట్టి మజ్జిగ మునుగబోసి,
పచ్చిమెరపకాయొక్కటి తెచ్చి ఇచ్చె —
ఉదయ భోజన మతని కియ్యదియె సుమ్మి."

అని పీరు వర్ణించారు.

రాయలసీమ గ్రామీణుల నోట యాలపదాలు మనం ఈనాడూ వినవచ్చు. ఆ సంగతి చాలాచోట్ల పేర్కొన్నారు వీరు. పైగా ఈ రంగడు చక్కటి యాలపాటల పాటగాడు.

"ఆ గుంపులోన వచ్చుచు
రాగమ్మున యాలపాడు రంగన్న కిదే
యాగము, యోగము, భోగము,
రోగమ్మును గూడ నిదియె రోజులు గడవన్."

"చెట్టు పుట్టలకే గుండె పుట్టజేయగలదా"తని మధుర కంఠనాదం.

రాయలసీమలో అనంతపుర మండలంలోని వాడుక పదాలను తమ జీవితాను భవంలోనివి — ఈ చిన్ని కావ్యంలో చక్కగా వాడుకచేసి వాటికి ఊపిరిపోశారు. ఆలేకార్లు, బగ్గీలు, దూము, బొట్టుగట్టు, దూడవయసు, దూడపిల్ల, కుమ్మకుక్క, చెవి జాలవేసిన, అరమంచి, ఆయకం, గప్పున అందుకొను, కుళ్ళి కుళ్ళి ఏడ్చు, కుళ్ళు కొను, పిన్నపెద్ద, పులకాపు, లోటా, గవినీళ్ళు పై నిమురు, ఎముకహూనమై, బిరా తము, దరిబేసితనము, గుంత, రెక్క, సందు మోటు, పురుగుమట్టు, కట్లపొడి, బర్ర, దగపుట్టు, కసవు, గలగంట, తనకలాట, నల్లము, వల్లెకు, కొట్టము, సంద కాడ, మామూలు."

కావ్యమంతా సామాన్యుల కందరికీ అర్థమయ్యే సరళమైన భాషనే ప్రయో గించారు వీరు అయినా వారి పాండిత్య గరిమకు, ఉభయ భాషా పాండిత్య పటిమకు కావ్యమంతా ఉదాహరణమే. దీర్ఘ సంస్కృత సమాస రచన సైతం ఇందులో చోటు చేసుకోవడం గమనించదగ్గ విషయం

"జఠర, జఠర్యుషమై," క
ర్కశులై దరిజేరు జీవరాశుల మ్రింగన్;
హఠమెంతని ఇది చేయని
హఠాత్కఠోర క్రియా విహారము కలదా !

సురగరుడోరగ విద్యా
ధరకిన్నర సిద్ధసాధ్య దైవత తరుణీ
చరణారుణ పంకేరుహ
వరరేఖలు లేవు; వట్టివఱడులె తిరుగున్.
దారుణ కల్మష దగ్ధమారుతో
ద్ధూత రోదసీ క్షుద్రభూమిపై,
ఘోరనరక క్రూరజ్వాలా
ఘూర్ణమాన సంచూర్ణమాన, బా
ధాధరా ధరాధిత్యకపై; జం
బూకరోదనా పూర్ణ శ్మశాన
కాష్ఠచ్యుతాస్థికా శిఖరముపై,
ఎట్లు నిలచునీ కృత్రిమలోక
మ్మెట్లు నిలుచునీ కృత్రిమ జీవ
మ్మెట్లు నిలుచునీ కృత్రిమ హృదయ
మ్మిట్లిట్లే చిట్లిపెట్లిపోవును"

సున్నిత భావ ప్రకటనా చణత్వం వీరి కావ్యమంతటా గోచరిస్తుంది. అల్పా క్షరాలతో అనల్పార్థ రచనచేయడం వీరికి అలవోకగా వచ్చిన విద్య.

"గంగమ్మ పదారేండ్లది
కొంగు నిలచునంతగూడ వయసులేనిది"

అన్నప్పుడు అందులోని వీరి అనల్పార్థ రచన సహృదయ హృదయైకవేద్యం అలాగే—వస్త్రము సన్నవడంజొచ్చె, కీర్తిసంపద బలిసెన్, వాడి వత్తయిపోయెనో వాని ఇంత యెడద, కప్పురంపుబెడద, నిప్పువంటి బ్రతుకు, కన్నులలోనె వసంతాలు విరియు, చూపులలోనె వలపులు రూపుదిద్దుకొనుచు, ఇంటిముఖముపట్టి నిట్టివోలె, చీకటి ముంచివేసినది చింతలపల్లెను పూపమొత్తమంధకారమ్ములో నావలింప,

మూకటి పగిలిన బ్రతుకులు, విలవిలలాడెన్ పెనాన పేలగింజయై, కోడితోలేచి, తల సూపెడు కోర్కెలు తీవసాగగన్. పూచిన మొగ్గవోలె, వలపు తుంపరులు—ఇలాగే ఇంకా ఎన్నో. అన్నీ భావగర్భితాలు!

వీరికి అలవోకగా అలవడిన అలంకారిక రచనను గూర్చి ప్రస్తావించడం సముచితమే. నిసర్గ మనోజ్ఞంగా, స్వభావోక్తిలోనే—దీనికి అనుభవమే అవలంబన గనుక—కావ్యమంతా నడిచింది.

"ఎఱ్ఱటెండ ప్రొద్దు ఏడుమూరల గడ్డి
మోపు మెడలపైన మూడు మట్ల
లోతు కనులు, పొట్టలో వీపుజేరను—
వగడువోలె నతడు వణకుచుండె"

ఇలాగే చక్కని స్వభావోక్తి 'మొగమున ..' పుట 77, ఉపమా ప్రయోగానికి 'దయ్యమువోలె ' పుట 61, 'నలుగురిల్ కెల్లా....' పుట 70 "ఆ చెయినోకి...." పుట-80, రూపకానికి —"కమలిన కన్నులన్...." పుట-80. అర్థాంతరన్యాసానికి — "మాటలకుగాని...." పుట.49, "చెంగునెగజెక్కి .. " పుట-66, "కళ్ళలోనే...." పుట-67' అనేవి చక్కని ఉదాహరణలు.

అన్నిటి కంటే విశ్వంగారు మానవతావాదులు. అది వీరి కావ్యమంతటా దృగ్గోచరమౌతుంది "విశ్వంగారిది మానవ హృదయము. ఊహకన్న, భావనకన్న, అనుభవమే మూలాధారముగా వెడలిన పరవళ రచన వీరి 'పాట'. నిర్వేదం తీవ్రమైనప్పుడు అన్ని నియమాలను చెల్లాచెదరు చేయు వేసటగా పనిచేయును. అది యీ 'పాట'లో కవిగారి నెన్నో ఆటలాడించింది" (పీఠిక) అని పేర్కొన్న శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి మాటలు అక్షరాల సత్యం. మానవతా వాదులు గనుకనే రాయలసీమ ప్రజలను గూర్చి రచనచేశారు వీరు. ఎఱ్ఱటెండలో, ఏడుమూరల గడ్డిమోపుతో, లోతు కళ్ళతో, పొట్టవీపుచేరి వణుకుతూ వచ్చిన రంగని దుస్థితి చూచిన —"ఏ నరమానవుని గుండె"లకునైనన్—, లోకానికి శాపమిదేమొ, వేనోళ్ళను విచ్చియేడ్చి విలవిలలాడున్" అంటారు. రసహృదయం ద్రవించిన వీరు అలాగే సహానుభూతిని పాఠకులు సైతం పొందడంలో ఆశ్చర్యమేముంది? రెడ్డిగారింటికి సీఁకు మోస్తున్న రంగడు—

"ఎన్ని కడవలపోసిన నెంత పెద్ద
పొతుఖానాయె కాని పైకైనరావు
అన్ని సిక్కేమిసేతురో ఉన్నవారు
పాపమా రంగనికి బోధపడనెఎడదు"

— అంటూ ఉన్నవారి సంగతి, లేనివారి దుర్గతి మానవతతో ఎంతోచక్కగా అభివర్ణించి రంగని లాంటి సామాన్యులపైన జాలి చూపుతున్నారు కవిగారు. కలవారింటిలో 'లాందరలు' తుడవడం దగ్గరనుంచి అన్ని పనులు చేశాడు రంగడు.

"ఇచట త్రేన్పులె కాని విన్పింప వూర్పులు—
ఇచట రూకల గలగల లెత్తిపోవు;
ఇచట లక్ష్మి సరస్వతులే వసింతురు—
ఇచట లేనివి —మానవ హృదయమొకటి."

"—సంపన్న గృహము చొచ్చి చూచిన
నాత్మయే శూన్య మిచట"
"ఇది ఎడారిలోని వయాసిస్సే కానివ్వు,
వడగొట్టిన పేద కేమో వట్టి ఎండమావు."

— అంటారు ఎంతో చక్కగా. ఇంతకంటే చక్కగా ప్రతీక వాదంతో—

'మున్నూరు మట్టి మిద్దెల
క్రొన్నెత్తములెల్ల దీని క్రొత్త యరుగులం
దన్నగ లే విది యొకచే
ఉన్నది యూరెల్ల మ్రింగి యుబ్బినట్లుగన్.'

అన్నది వీరి మానవతకు, మానవతను అభివర్ణించిన కవితకు జయపతాక !

చివరిగా —

'కండలుగోసి, పాళ్ళిడి బికారులజేసి జనాల నెత్తురుల్
పిండుచు కుక్క కూడయిన బెట్టక, పొట్టలగొట్టి కూళలన్
విండుల కాన బెట్టి జగతిన్ కరుణార్ద్రిత కగ్గివెట్టు పా
షండుల వల్ల కాడు మనసా ! ఇది మానవ సంఘమెట్లగున్?'

— అంటారు వీరు.

"దైవమా; ఉంటివా ? చచ్చినావ నీవు ?
ధర్మమా ! గెంటిరా ? నిన్ను ధరణి నుంచి ?
సంఘమా; తలకెక్కెనా ? సన్ని నీకు ?
హృదయమా ! మానవుడు నిన్ బహిష్కరించె."

అంటూ తమ వ్యథిత హృదయాన్ని —

"ధరణి గంపింప, కులగిరులురలి పడగ,
మేరు శిఖరమ్ము నెక్కి, మిన్నులదర
చచ్చె నీ లోకమున నాత్మ సాక్షియనుచు
నెత్తినోరిడి కొట్టు కోనిండు నన్ను "

అని ఆవిష్కరించారు.

ఇది విద్వాన్ విశ్వం గారి "పెన్నేటి పాట" !
రాయలసీమ కన్నీటి పాట ! !
విశ్వంగారి 'నెమ్మది లోని మాట' ! ! !
విశ్వంగారి 'కైత కమ్మని యూట' !!!!

(ఆంధ్రప్రభ – 10-6-1978)

22)

# శ్రీ కరుటూరి సత్యనారాయణ గారి-
# 'తిష్యరక్షిత'

"In this story (Sarangadhara Charitra) the animal passions of an old man were put before the audience, and the worst part is that a step-mother who is considered by the Hindus as a real mother was brought into the play with all her animal instinct and made much of by actors to please the audience". "The main issue of the plot may have a lesson for people of culture, but the details are so inter-woven with immoralities, that the eventual effect tends to demoralize the ignorant in society."— ఇవి కోలాచలం శ్రీనివాసరావు గారు 1908 లో ప్రకటించిన తమ 'ప్రపంచ నాటకచరిత్ర'లో సారంగధర చరిత్రని నాటకీకరించి, ప్రదర్శించడంవల్ల కలిగే అనర్థాల్ని గూర్చి చెప్పిన మాటలు. కానీ ఇలాంటి కథలు విశ్వ సాహిత్యంలోనే ఉన్నాయి. పైపెచ్చు Sophocles రచించిన 'Oedipus the King' అన్నది గ్రీకు ట్రాజెడీలకే తలమానికమని 'Aristotle' పండితుడే ప్రశంసించాడు. ఇలాంటి కథలకి ప్రజల్లో ప్రచారం బాగానేఉంది. అందుకే ఆధునిక యుగంలో తెలుగులో సుమారు ఇరవైమంది నాటకకర్తలు నాటకీకరించారు

సరిగా సారంగధర చరిత్ర లాంటి కథే తిష్యరక్షిత. శ్రీ కరుటూరి సత్యనారాయణగారు తొమ్మిది ఆశ్వాసాల మహాప్రబంధంగా రచించారు తిష్యరక్షితని. దీనికి మూలం శ్రీ శివశంకరశాస్త్రిగారు వచనంలో రచించిన తిష్యరక్షిత. వేలూరి చంద్రశేఖరంగారు దీన్నే 'కాంచనమాల' పేరితో నాటకంగా రచించగా దాన్ని శ్రీ 'అమరేంద్ర'గారు ఆంగ్లీకరించారు. బుచ్చిబాబుగారు 'తిష్యరక్షిత'ను నాటికగా రచించారు. అంటే సారంగధర లాగానే తిష్యరక్షితకి సైతం ఆధునిక యుగంలో ప్రచారం కలిగిందని అర్థం. అయితే "మానవతావాద పరిశోభితమై బౌద్ధేతిహాసమన్నా నాకు మొదటి నుండియు తీరని అభిమానము; ఎనలేని ప్రేమ. తదుపదిష్టమగు వస్తువు ప్రజా సామాన్యమును జాగరిత మొనరింపజాలు శక్తి సంపన్నమైనది."—

అని విశ్వసించిన కరుటూరి సత్యనారాయణగారు తిష్యరక్షిత కావ్యాన్ని రచించారు. ఇంతేగాక 'కరుణా సౌగత'మన్న మరో చిన్న కావ్యాన్ని సైతం సంతరించి ఉండడం గమనించదగ్గ విషయం.

వారు వృత్తిరీత్యా కమ్మర్షియల్ టాక్స్ కమీషనర్. ప్రవృత్తి రీత్యా కవిగా హృదయులు. కరుటూరి వారి 'తిష్యరక్షిత' మహా ప్రబంధంలోని పద్య మనవద్యం; శిల్పమనల్పం; కవిత కమనీయం; మానవ మనః ప్రవృత్తుల చిత్రీకరణ మహనీయం. అసలు కథలోనే మంచిపట్టు, ఔత్సుక్య స్ఫోరకతా ఉన్నాయి. దీన్ని ప్రబంధీకరించడంలో కరుటూరివారు తమ కలానికి పదును పెట్టారు. అశోకచక్రవర్తి బౌద్ధమతావలంబి; బౌద్ధమత ప్రచారకుల్లో ప్రముఖుడు. అతడి మొదటి భార్య పరిష్యరక్షిత; రెండో భార్య తిష్యరక్షిత. అశోకుడికి పరిష్యరక్షితవల్ల జన్మించిన గుణఖని కుణాలుడు. అతడి భార్య అనురూపవర్తన కాంచనమాల. కుణాలుడి సౌందర్యలోలుప అయి తిష్యరక్షిత వలపుగొన్నది; పైకొన్నది. కుణాలుడు సవతితల్లి అని తిరస్కరించాడు. ఆ వెనుక అనుకోకుండా లభించిన అధికారాన్ని వినియోగించుకొన్న తిష్యరక్షిత ఏ కళ్ళయితే తన్నాకర్షించాయో ఆ కుణాలుడి కళ్ళు పెకలింపజేసి కక్ష తీర్చుకొంటుంది. బౌద్ధమత బోధల్లో నిమగ్నుడు. అశోకుడు. పుత్రుడు కుణాలుని కళ్ళు పెకలించబడ్డాక గాని అతడి కళ్ళు విప్పుకోలేదు. అప్పటికే అంతా చేయి దాటిపోయింది

నేత్ర విహీనుడై కూపంలోపడి ఉన్న కుమారుని కుణాలుని కొనితెచ్చి విశల్యకరణి మూలంగా పుత్రుని నేత్ర సహితునిగా చేయించగలిగాడు అశోకుడు. జీవితంపై విరక్తి కలిగిన కుణాలుడు బౌద్ధమత ప్రచారంలో—భార్యా సహితుడై—నిమగ్నుడవుతాడు. మనఃపరిణతి కల్గిన తిష్యరక్షిత పశ్చాత్తప్త అయి 'బుద్ధమతి' అవుతుంది. ఈ కథని మహాచతురంగా ప్రబంధీకరించి, తమ కవితా వైభవాన్ని ప్రకటించారు కరుటూరి వారు. కథ సుఖాంతమే అయినా ఇది చక్కటి ట్రాజెడీ ట్రాజెడీకి భావ సంఘర్షం (conflict) ప్రధాన గుణం. ఈ కథలో భావసంఘర్షం పుష్కలంగా ఉంది మంచికీ చెడుకీ, శాంతికీ అశాంతికీ, కామానికీ నిష్కామానికీ, బౌద్ధమతానికీ వైదిక మతానికీ—సంఘర్షం ఉంది. అందుకే ఇది చక్కటి ట్రాజెడీ. మంచి జయిస్తుంది చివరికి.

కరుటూరి సత్యనారాయణగారి పాత్ర చిత్రణని — అంతకంటే పాత్రల మనస్తత్వ చిత్రీకరణని—గూర్చి ప్రత్యేకంగా చెప్పవలసి ఉంది అశోక చక్రవర్తి బౌద్ధమత చర్చలతో కాలం పుచ్చుతున్నాడు. పరిష్యరక్షిత వైదికమతం నమ్మింది. బౌద్ధమతావలంబి అయి కాంచనమాలతో సుఖంగా కాలంగడుపుతున్నాడు కుణాలుడు. మోహనస్వరూపుడైన కుణాలుని బలాత్కరించింది కామపురుషార్థపరురాలైన తిష్యరక్షిత —

"మతమును, నీతి, గౌరవము మానవసంఘము స్వార్థబుద్ధితో
నతికినదోయి, మాదృశుల యట్టులఁ దా బిగియింపఁజూచి: సం
గతియె కుణాల! భీతి కలకాలము నొదలవంచి వీనికిన్
బ్రతికిన నాల్గునాళ్ళు ననురాగము త్రుంచి చరింపశక్యమే." (3–48)
అని కుణాలుని వాదాన్ని పూర్వపక్షం చేసి—

".... నా పడుచు రక్తము తొందరచేయు నేకమై
గువ్వల జంటగా నెగురు కోరికగల్గె కుణాల! రమ్మురా!"

— అని బలాత్కరించింది తిష్య.

"వలపుల పిచ్చిలోఁబడుచు భావమునన్ దలపోయకమ్మ! నీ
పలుకులు విన్న నా యెడద బ్రద్దలగున్; నినువంటివారికీ
కలుషిత మార్గముల్ దగవు, కాంక్షలు గోసి వినీతబుద్ధితో
మెలగుము బుద్ధదేవు కృప మేదురమై నిను జక్కదిద్దెడిన్." (3–:6)

— అని బుద్ధి చెప్పి, "నిలుపుము వంశగౌరవము" అని హెచ్చరించి, "శీలములేని కాంత నిసిసీ యనరే జనులు" — అని హితబోధ చేశాడు కుణాలుడు. కానీ కోరిక తీరికలెత్తి తిష్య పైకోగా తోసిపుచ్చుతాడు కుణాలుడు. ఈ సందర్భం లోను, తరవాత కుణాలుని కన్ను లూడదీయించే ఘట్టంలోను ఈ పాత్రల మనస్తత్వాల్ని మిక్కిలి చమత్కారంగా, సముచితంగా కరుటూరివారు చిత్రీకరించారు. ఇది వారు మనస్తత్వవేత్త అనడానికి చక్కటి నిదర్శనం. ఇలాగే తక్కిన పాత్రల్ని పరిపోషించారు వీరు.

వీరి కమనీయ కవితలో అనల్పమైన శిల్పం ఉంది. అనవద్యమైన పద్య రచనలోను ఈ శిల్పం గోచరిస్తుంది. ఇందుకు ఈ కావ్యంలోని ప్రతిపద్యమూ ఉదాహరణమే అవుతుంది కవితలో చక్కటి దార, భావానుగుణ పదప్రయోగ దక్షత వీరిలోని గుణాలు. ప్రబంధ రీతికి తీసిపోదు తిష్యరక్షిత వర్ణన :

"కుందనపు బొమ్మ, కన్నులు
పొందమ్ములు, పలుకుతేనె పొలుపు, గళమ్మున్
జిందమ్ము, కురులు బంభర
బృందమ్ములు, మనసునిండ మధురోహల్." (1–29)

— ఇందులోని వర్ణన మామూలే. అయినా "మనసు నిండ మధురోహల్"– అనడంలో శిల్పం ఉంది. కుణాలుని ముగ్ధమోహన సౌందర్యమంతా అతని కళ్ళలో ఉందట. దాన్ని గ్రహించింది తిష్య :

"అక్షీణ ప్రతిభా సమన్వితము, లాప్యాయంబు, లానందము
ద్రాక్షిప్తమ్ములు, మోహనమ్ములు, సుధాతారళ్య సంపన్నముల్
సాక్షీభూత మనోవికాస జనితోత్సాహక్రియా పాదనల్
దీక్షా ప్రస్ఫుట సారసమ్ములు బ్రతిభా దివ్యములా నేత్రముల్." (2-52)

— తనకు దక్కని కుణాలుని ఆ కన్నులనే తీయించి కక్ష తీర్చుకొంది తిష్యరక్షిత. సునిశిత భావప్రకటనతోను, ఆలంకారిక శైలీ విన్యాసంతోను జలజల పారు స్రోతస్విని వీరి కవిత. కారాగారంలో త్రైవబడిన తిష్యరక్షిత వర్ణన; ఉపమాలంకార ప్రయోగం ఇందలి విశిష్టత :

"శాంతి నెఱుఁగక యెవ్వియో జ్ఞాపకముల
చిందుఁ ద్రొక్కుచుండుఁ గృశించు నెంతొ
బోనులో నున్న క్రొవ్వులివోలె పరుల
హుంకరించును, మండు నా యువిద కినుక" (9–3)

— ఇలాగే తక్కిన అలంకారాలూను. 'గువ్వల జంటగా నేకమై, కాంక్షలు గోసి, పూచిన మల్లెతీవ వలె, పండుగ సేయుమా పెదవి పానకమున్, గిచిన గీటు, నా తారుణ్యము మీదుగట్టితినిరా, గుబగుబలాడు గుండియలు, గుండెలు పిండు బాధ, కన్నుల ద్రావుచు నా యందమున్, వాకొక బాకుగా'—ఇలాంటి భావగర్భితాలైన చక్కటి ప్రయోగాలెన్నో ఉన్నాయి. అవి సార్థకమై, సముచిత భావస్ఫోరకాలై రసవ్యంజితాలై ఉన్నాయి కావ్యమంతటా.

ఇంతకంటె కరుటూరివారి కావ్యరచనా చోదకశక్తి బౌద్ధేతిహాసంలోని మానవతావాదం అన్న విషయం పూర్వోక్తం. అదే బుద్ధుని జీవకారుణ్యం; అదే సంఘసేవా నిరతి; తన్మూలంగా జీవితసాఫల్యం. దీన్నే ఈ కావ్యంలో ప్రధానంగా కుణాలుని మూలంగా, అంతకంటే శ్వపచుని మూలంగా కవి వ్యక్తీకరించారు. ఈ మానవతా వాదమనే స్రవంతి కవి నిండుగుండెను దండిగుండెగాజేసి పరవళ్ళు తొక్కుతూ ప్రవహించింది అదే సర్వమానవ సమతా సౌమనస్యానికి దారితీసింది. కులం కన్న గుణం మిన్న అన్న విషయం ప్రధానంగా బౌద్ధమతావలంబి అయిన శ్వపచుడు తన కళ్ళను తన దేశికునకు సంతోష తరంగిత దరహాసవదనంతో సమర్పించడంలో కనిపిస్తుంది.

అశోకుడు శ్వపచుని ఉత్తమ గుణాల్ని గూర్చి—

"కులమును బట్టియే మనుజుగుండెలలోపల నుచ్చనీచతల్
నెలకొనునంచు నాయెదఁద నిల్చిన భావము వమ్ముఁజేసి నీ
సలలిత మంజువర్తనము, చక్కని పాఠము నేర్పెనాకు, నే
కులమునఁబుట్టినన్ మనసు కోమలమై తనరార పీలగున్" (8, 87)

— అని ప్రశంసించడం గమనించదగ్గ విషయం శ్వపచుని కళ్ళను ఎలా తీసుకోడానికి అంగీకరించాడు కుణాలుడు అనే విచికిత్స కలుగవచ్చు. తాను బాధించి తీసుకోలేదు. శ్వపచుడే గురుదక్షిణగా సంతోషంగా సమర్పించాడు. ఆ కన్నులుంటేనే బౌద్ధమత ప్రచారంతోపాటు, సమాజసేవ గావించడానికి వీలవుతుందని కుణాలుని అభిమతం ఆ సందర్భంలో "సేవా ధర్మము మానవతా వాదమునందు నున్నతం"బని తోచిందంటూ కరుటూరివారు మానవతావాదాన్ని వాచ్యంగానే చెప్పారు.

ఇలాగా ఔత్సుక్యస్ఫోరకమైన కథాకథనంతో, వివిధ మనః ప్రవృత్తుల వ్యక్తీకరణతో, ఆయా భావాల వ్యక్తీకరణానుగుణ పదప్రయోగంతో, భాషావైవిధ్యంతో, రసభావ వ్యంజక రమణీయ రచనా ప్రౌఢితో తిష్యరక్షిత మహాకావ్యాన్ని రచించి ఆధునికాంధ్ర వాణికి అమూల్యాలంకారాన్ని సంతరించారు కరుటూరి సత్యనారాయణ గారు :

"కుచ్చితముఁజూడ నెడదలో కొంచెమైన
ప్రతికృతియొనర్పు భావము పాదుకొనని
అకుణాలోని యౌన్నత్యమాత్మ నెంచి
"బుద్ధమతి"యయ్యె తిష్యప్రపూత హృదయ" (9-111)

(అనామిక-ఏప్రిల్ 1979)

# సరోజనీనాయుడు కవితలో సామాజిక స్పృహ

ఆంగ్లభాషలో కవిత చెప్పి భారత కోకిలగా ప్రసిద్ధికెక్కిన సరోజనీనాయుడు శత జయంత్యుత్సవాల సందర్భంగా ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి కోరికపై సరోజనీనాయుడు ఆంగ్ల కవితల్ని ఆంధ్రలోకానికి అనువదించి అచ్చమైన స్వతంత్ర రచనలా అన్నట్లు రూపొందించారు ప్రొఫెసర్ సి. నారాయణరెడ్డిగారు; ఆ కవితా సంపుటికి "ముత్యాల కోకిల" అన్న అన్వర్థ నామకరణంచేశారు భారత కోకిల మధుర నాదాలకు ప్రొఫెసర్ నారాయణరెడ్డిగారు తమ గొంతుకతో చక్కటి సమరస భావం సమకూర్చారు భారత కోకిలే ఈ తెలుగు పలుకులు పలికిందా అన్నంత ఆశ్చర్యం కల్గుతుందంటే అత్యుక్తిలేదు

వాస్తవానికి భారత కోకిల కృత రొమాంటిక్ సంప్రదాయ పద్ధతిలోనడిచింది. అంటే మన తెలుగులోని భావకవితా ధోరణిలో సాగిన కవిత. ఆమె కవితలో ప్రకృత్యారాధన, సౌందర్యోపాసన పరిపూర్ణ ప్రణయంతోకూడిన ఆత్మార్పణ, అచంచలమూ, ప్రగాఢమూ అయిన దేశభక్తి మొదలైన గుణాలు ప్రాధాన్యం వహిస్తాయి. అయితే సమాజంలో జరుగుతూన్న మార్పుల్ని, నిరుపేదల బాధల గాథల్ని గమనించకుండా ఊహాలోకాల్లో విహరించేవారు మాత్రంకాదని వారి కవితవల్ల స్పష్టమవుతుంది. తెలుగులో అభ్యుదయ కవులలో సమాజ స్థితిగతుల్ని కొంతకు కొంత విప్పిచెప్పడం ఆరంభమైంది; సామాజిక స్పృహతో రచన ప్రారంభమైంది. దానితోపాటు, భావచిత్ర కవిత, ప్రతీక కవితలు చోటుచేసుకొన్నాయి. ఇవన్నీ భారత కోకిల కవితలో మనకు గోచరిస్తాయి. వీటినిగూర్చిన స్థూలపరిశీలనమే ఈ వ్యాసోద్దేశం.

సామాజిక స్పృహ : పూర్వోక్తమైనట్లు రొమాంటిక్ సంప్రదాయ కవిత అయినా సరోజనీనాయుడుగారిలో సామాజికస్పృహకు కొరతలేదు. కానీ "సమకాలీన ఆర్థిక సమస్యల స్పృహ ఆమెలో లేదని కొందరు విమర్శించారు అలాంటి స్పృహ తన కవితలో ఉందని ఆమె ఎప్పుడూ చెప్పుకోలేదు. ఉల్లాసభరితమైన అమాయకత్వం ఆమెది. ఆనందభరితమైన అవ్యాజసారళ్యం ఆమెది" (జి.ఆంజనేయులు; భారతకోకిల

కోకిల-స్వాతంత్ర్య సమరయోధ-ఆంధ్రప్రభ 13-2-79) సరోజనీనాయుడి కవితలో వస్తువు సంఘంలోని శ్రామికులు, దరిద్రులు, సామాన్య జనమే అను విషయం మనకు స్పష్టమవుతుంది సమకాలిక జీవిత వర్ణనలు వీరి మూలంగా అందించారు కవయిత్రి తన్మూలంగా మానవతావాద దృక్పథం స్పష్టం.

'ఎందుకు నేస్తున్నారు' అంటూ ప్రశ్న వేసుకొని త్రికాలావధికమైన తాత్త్వికచింతనాత్మకమైన సమాధానాలు చెప్పడంలో నేతగాళ్ళ నైపుణ్యాన్ని ప్రశంసించారు శ్రీమతి నాయుడు. జాలరుల సాహసోపేత జీవితం, పల్లకీ బోయీలపాట, వనిలో సంతృప్తి, గాజులలాగే తళతళ మెరిసే గాజులవాళ్ళ జీవిత రీతులు, గోరింటాకులు కోసే యువతులు, విస్సురాతి పాటలు పాడుకొనే పామర ప్రజలు, జంగమ గాయకులు, ఫకీర్లు మొదలైన నిత్యమూ మనం చూసే సమస్త చిత్రాల్ని సరోజనీనాయుడు వస్తువులుగా స్వీకరించటం ద్వారా ఆవిడ కవితలోని సామాజికస్పృహని స్పష్టం చేసిందనవలసి ఉంది.

అభ్యుదయ కవిత :

సరోజనీనాయుడిలో సామాజిక స్పృహ ఉంది అనడానికి మరో చక్కని నిదర్శనం అభ్యుదయ కవితాచ్ఛాయలు ఉండడమే. ఇందుకు ఉదాహరణ 'ముసలిది' అన్న ఖండిక—

"ఒంటరిగా వీధిలోన
ఒక ముసలిది
కూర్చున్నది మర్రిచెట్టు
కొమ్మ కింద
అనంతానుభవం కొరకు
అత్యంతోల్లాసంతో
సాగే జీవన లీలా
సంరంభంలో కదిలే
విసురు ఉడుగు సవ్వడులను
వింటున్నది"

23)

"నడుంవంగి చూపు తొలగి
వడిలిన నిరుపేదైనా
పరిహసించు కాలాన్నే
ప్రతిఘటించు గుండె కలది
మీ దయకై చేయిసాచి
వీధిలోన కూర్చుని వుంటుంది
ఎండైనా వానైనా
ఈదరగాలైనా
ఆకలితో బాధలతో లేమితో
అలా కబుర్లాడుకుంటు
ఆఖరి నిద్దుర కోసం."

— అణగారిన జీవితాన్ని అభ్యుదయ భావ పరంపరలు ముంచెత్తగా సహజ సుందరంగా, నిశితంగా కరుణ రసార్ద్రంగా వర్ణించారు కవయిత్రి. ఈ కవిత చదవ గానే ప్రముఖ అభ్యుదయ కవితా నాయకుడు మహాకవి శ్రీశ్రీ "భిక్షువర్షీయసి" గుర్తుకొస్తుంది.

"దారిప్రక్క చెట్టుకింద
ఆరిన కుంపటి విధాన
కూర్చున్నది ముసల్దొకతె
మూలుగుతూ ముసురుతున్న
ఈగలతో వేగలేక
ముగ్గు బుట్టవంటి తలా
ముడుతలు తేరిన దేహం
కాంతిలేని గాజుకళ్ళు
తనకన్నా శవం నయం
పడిపోయెను జబ్బుచేసి
అడుక్కునే శక్తిలేదు
రానున్నది చలికాలం
దిక్కులేని దీనురాలు

ఏళ్ళుముదిరి కీళ్ళు కదిలి
బతుకంటే కోర్కె సడలి
పక్కనున్న బందరాతి
పగిదిగనే పడి ఉన్నది" (మహాప్రస్థానం పు.42)

శ్రీశ్రీ లోని ఆర్తి, స్ఫూర్తి, మూర్తి శ్రీమతి నాయుడిగారి కవితలోను కొంత వరకు మనం చూడగలం. ఈ రెండు కవితలు చదివాక బాలగంగాధర్ తిలక్ "ముసలివాడు" మన మనోనయనాల్లో మెదలకుండపోడు.

"కనుగూడులు నల్లనయి
పెనుబ్రోడులు చల్లనయి
కీలు కీలుగా బాధగా
నాడు నాడులు లాగగా
చలిగాలి చూరులో కసరినట్లు
చలిచీమ మట్టిలో దొలచినట్లు
వచ్చినది మూగినది ముసిరినది ముసలితనము"

"పై కప్పు వంగి పడు
పాడిల్లో వలె నిలిచి
వీధి పోయే వింతవింతల
చూసి రోసి
బ్రతుకొక ఆరిన వత్తికొడిలా తలచి మిథ్యలకలచి
పెదవి సందుల వెగటు నవ్వును బిగబట్టి
కన్రనానుకు సాగిపోయే
ఎముకల గూడుని అరిగిపోయిన జోడుని"

— (అమృతం కురిసిన రాత్రి–పు 83, 84)

ఇలాగే "ఒంటరి పాప"నుగూర్చి ఈ కవయిత్రి జాలివెందింది.

"అమ్మవవుతావ నా కంబాల చుక్కా!
నడిరేయిలో నేను జడిసి ఏడుస్తుంటే
నాతోనె ఉంటావ నను ముద్దుగొంటావ?
నా అన్న వవుతావ నవ్వేటి గాలీ!

తోడుగా నిలిచి ఆడుకుంటావ?
కదలి కథలను నింగి కబురులను చెబుతావ?
తోడుంది గువ్వలకు తోడుంది పువ్వులకు
తోడుంది తేనెటీగలకూ
తోడుంది గొర్రె పిల్లలకు గోరింకలకు
తోడుంది చిట్టెలుకలకు బుడుత ఉడుతలకు
తోడుంది జింక పిల్లలకూ
చీకట్లో నను గుండెకద్దుకొని
చెవిలోన ముచ్చట్లు చెప్పేటి
అమ్మ నాకెంతో కావాలనీ
ఆ దేవుడే మరిచె నెందుకని?"

ఇలాంటి దిక్కులేని దీనులైన పాప లెందరో? అలాంటి పాపలకై 'జోలపాట' పాడింది జగన్మోహనంగా శ్రీమతి నాయుడు.

"ముద్దుపాపా! కళ్ళు
మూసుకో హాయిగా
ఆ వేప గుబురుల్లో
ఆడె మిణుగురులు
పొదరింట దాగిన
ముత్యాల కలనూ
దోచాను నీ కొరకు దాచాను."

— ఇలా ఆర్తులు, పీడితులూ, దగాపడిన తమ్ముళ్ళు కవితలో మనకు దృగ్గోచర మవుతారు. శ్రీమతి నాయుడి అభ్యుదయ కవితా మాధుర్యం ఆస్వాదయోగ్యమైనదిగా స్పష్టమవుతుంది.

### భావ చిత్ర కవిత (Imagery) :

సరోజనీనాయుడి కవితలో భావ చిత్రాలు, పదచిత్రాలు కోకొల్లలు చాలవరకు

ఈవిడగారి కవిత అనుభూతి ప్రధానంగా గోచరిస్తుంది. అందుకే భావచిత్రాలు ఆయా సన్నివేశ, సందర్భాలకు సముచితరీతిని మనోజ్ఞమై మనసుల్ని ఉల్లాసపరుస్తాయి.

"పాట పైరగాలిలోన ఊగెనామె పువ్వులా
ఏటినురగ చాలులోన తేలె నామె గువ్వలా
విరబూసిందామె కలల పెదవుల చిరునవ్వులా"

"పాట మంచు బిందువులో వాలె నామె చుక్కలా
తరగ అంచుపైన ఆమె మెరసె వెలుగురేకలా
కురిసె నామె కొత్త పెళ్ళికూతురు కన్నీరులా"—(పల్లకీబోయిలు)

పై భావ చిత్రాలు సహృదయ హృదయైక వేద్యమై మనోజ్ఞమై ఉన్నాయి.

ఇలాగే—

"ఝుమ్మనే తుమ్మెదల మెయిలులారా
కమ్మ తెమ్మెరలో ఉసూరనే
కలికి ఆకుల యెలతుపానులారా
గగనాంత రాన్వేషణంలోన
ఎగసెగసిపోవు వనవిహగమ్ములారా!" — (ఇక సెలవు.)

'కొండపైని వొగమంచులలో
వెండి నీలి కొమ్మించులలా' (గాజులవాళ్ళు)
ఆమెనగలు మలిసందెలలోన కదలి
అంచులపైన తళతళ మెరిసే నగలు
ఆమె వలువ ప్రభాతహిమ
యవనిక; మరకత స్వర్ణ చయనిక". (అసూర్యంపశ్య)

ఇలా ఎన్ని పంక్తులనైనా ఉదాహరిస్తూ పోవచ్చు.

ప్రతీక కవిత :

సరోజనీనాయుడి కవితలో ప్రతీక కవిత సైతం చోటు చేసుకోవడం విశేషం. 'హుసేన్‌సాగర్' ఖండికలో ఈ ఛాయ గోచరిస్తుంది. ఇది వాచ్యం చేయబడింది.

నావలెనే కట్టువడి
నావొకే ఉశ్వాస సూత్రాన
ఓ సరోవరమా !
ఓ సజీవ మదాత్మ బింబమా!

– ఇలాగే 'గాజులవాళ్లు' ఖండికలో గాజుల గూర్చి.

"ముద్దు బిడ్డలకు ముద్దు గుమ్మలకు
మురిపెపు బ్రతుకుల గురుతులు."

అనడంలోను, 'అలవోకగా' అనే ఖండికలో

"అది పువ్వుకాదు – నా హృదయం
అది పాత్రకాదు – నా ఆత్మ."

— అని వర్ణించడంలోను ఈ ప్రతీక కవిత స్పష్టమవుతుంది.

ఇలాగా సరోజినీనాయుడు కవిత చక్కటి సామాజికస్పృహతో, అభ్యుదయ కవితా ధోరణితో, భావచిత్ర కవిత, ప్రతీ కవితలతోగూడ సహృదయ హృదయరంజకమై ఆవిడ కవితాత్మ ఆవిష్కరణకు తగినరీతిని నడచినట్లు మనకు సువిదితమవుతుంది.

"నీ గీతి చదివి
నిన్నెదను పొదిగి
పలికితిని నీ వాణి
తెలుగులా ఎదిగి.

నీ ప్రతిభ నవ్యం
నీ ప్రతిన భవ్యం
నీ కవిత ముత్యాల
కోకిలా! శ్రావ్యం"—ప్రొఫెసర్ సి. నారాయణరెడ్డి

(విశాలాంధ్ర 14–1–1981)